పై పద్యము నాధారపఱచుకొని కీ. శే. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులవారు కృష్ణరాయల నిధన కాలమునుగూర్చి జక్కని వ్యాసమును విరచించి, స్థానిక చరిత్రలలోని కథలను కృష్ణరాయల కడపటి రాజ్య వర్షములలో వ్రాయబడిన కొన్ని శాసనములను నాధారపఱచుకొని, 'కృష్ణరాయలు శా. శ. ౧౪౪౬ లోనో ౧౪౪౭ లోనో మృతినొందినట్లును, అప్పటి నుండియు శా. శ. ౧౪౫౨ (క్రీ. శ. ౧౫౩౦) వఱకు విజయనగర రాజ్యము నాక్రమించు కొనవలయునని అతని కుమారుఁడైన తిరుమలరాయలును, అల్లుడైన రామరాయలును, తమ్ముడైన యచ్యుతరాయలును ప్రయత్నించు చుండినట్లును ఎవ్వరికి వీలయినవారు శాసనములు వేయించుట, కొళ్ళగొట్టుట మొదలయిన పనులు చేయుచుండినట్లును, ఈ కాలమున నెవరి యధికారమును స్థిరపడనట్లును దోచుచున్నది' అని యూహించిరి. (లక్ష్మణరాయ వ్యాసావళి. పుట ౫౨.) ఈ యూహకు ప్రోదిగ లక్ష్మణరావుగారుదాహరించిన సాధనములలో నెల్ల శా. శ. ౧౪౪౬ తారణ మార్గశిర శు. ౨ శనివారమున వ్రాయించిన తిరుమల దేవ మహారాయల శాసనము ముఖ్యమైనది. (*EC. IX. Ma.* 82) ఇందు 'కృష్ణదేవ మహారాయరిగె గంగోదక సేవితరప్ప...కోనప్ప నాయకరు' అను వాక్య మీ సందర్భమున జక్కఁగ గమనింపఁదగినది. ఈ వాక్యమునకు లక్ష్మణరావుగా రిట్లు వివరణమును వ్రాసియున్నారు. 'కృష్ణదేవరాయలకుఁ గోనప నాయకుఁడు గంగోదకము సేవింపజేసెననియునిందుఁ జెప్పఁబడియున్నది. చరమావస్థయందు గొంతులో గంగఁబోయు నాచారము హిందూదేశ మందంతటను గలదు. కావున గోనపనాయకుఁడు రాయల చరమ దశయందు దాతని సేవఁజేసి ధన్యుఁడయ్యెనని మనము తలంపవచ్చును. పై చాటు పద్యమునందలి మరణ తిథియే నిజమైనదియెడల ఈ శాసనము రాయల మరణా నంతరమున ఆఱునెలలో వేయబడినదియగును'. (లక్ష్మణరాయ వ్యాసావళి. పుట ౫౧). కాని పైశాసన పరిష్కర్తయగు లూయీ రైసుగారు 'గంగో దక సేవితరప్ప' యను మాటలకు గంగోదకమును మోయువా (*The bearer of the Ganges water to Krishna deva Maharaya*) డని యర్థము జెప్పిరి. కృష్ణరాయలు స్వయముగ యాత్ర చేసి గంగలో స్నానము సేయుటకు వలనుపడక పోగా నీ కోనప్పనాయకు నంపి యతనిచే గంగాజలమును దెప్పించుకొని యందు స్నాన మాడి యుండవచ్చును. ఇందసంగతి మెద్దియు లేదు. కావున పై వాక్యము నాధారపఱచుకొని కృష్ణరాయలా శాసనకాలమునకు ముందే మృతిజెందెనని చెప్పుట సమంజసముగాదు. మఱియును లక్ష్మణరావుగారే, 'ఈ యూహాలకన్నిటికిని వ్యతిరేకముగ గృష్ణరాయని శాసనములు పెక్కులు శా. శ. ౧౪౫౨ వఱకును గలవు. కావున నే సూరులు మొదలయిన తజ్ఞులు కృష్ణరాయలు శా. శ. ౧౪౫౦ (క్రీ. శ. ౧౫౩౦) వఱకును జీవించియుండెనని వ్రాసియున్నారు' అని యొప్పుకొని యున్నారు. (లక్ష్మణరాయ వ్యాసావళి. పుట. ౫౨). మఱియు శా. శ. ౧౪౪౬–౧౪౫౨ ల మధ్య కృష్ణరాయల కుమారుఁడైన తిరుమల రాయలును నల్లుడైన రాయలును, దమ్ముడైన అచ్యుతరాయలను రాజ్యము కొఱకొం డొరులతో బోరుచుండిరని తెల్పు సాక్ష్యము విశ్వాస పాత్రమైన దెద్దియు గానరాదు. కావున పై చాటువు నందు జెప్పినట్లు కృష్ణరాయలు శా. శ. ౧౪౪౬ నకు సరియైన తారణ వర్షమున స్వర్గస్థుఁడాయెనని యంగీక రించుటకు వలనుపడదు.



# "ఎవరు, ఏమిటి, ఎందుకు"



శ్రీ అనిసెట్టి అప్పారావు

ఇవాళైతే ఈ బొంబాయిలో మనిషి ఒరుసై ఒరుడాకై మెలికలు తిరిగిపోతున్నాడుగాని అసలుకి ధర్మారావు పుట్టిన స్థలం గన్నవరం. చెడ్డీలు తొడుక్కోడం తెలీని రోజుల్లోంచి పల్లెమీదుగా చెట్ల చిటారు కొమ్మల్ని ఒరుసుకుని ఎగిరిపోయే విమానాల్ని తనలో సృష్టించుకుంటూనే పెంచుతూనే ప్రపంచం ఇంచుమించూ తెలియక పర్యవసానం ఎరుగక లేడిపిల్లలా పాలబుడ్డిలా తనూ పెరుగుతూనే ధర్మారావు విమానాలంతటి ఊహాల్ని తనలో చిత్రించుకోడం జరిగింది.

ధర్మారావు కుర్రతనం గనక తనుపట్టిన కుందేటికి మూడేకాళ్ళనుకున్నాడు. అలా అనుకుని తృప్తి పడితే ఎంతో బావుండేది. అది తను మెట్రిక్ పాసైనప్పటిమాట. అలా అనుకుని డెరు సుబ్బారావు దగ్గిర గుమాస్తాగా కుదురుకుని ఉంటే ఎంతో బావుండేది. ఒకళ్ళ సలహా పాటించలేదు. ఒకళ్ళ ప్రాపు ఆశ్రయించలేదు. అసలుకి కుర్రాడు తను. అనుభవించాలని వయస్సు. అంతేగాని ప్రపంచం వేపు ఒక్కసారి కన్నెత్తి చూళ్ళేదు. దాని గమనాన్ని వక్రమార్గాల్ని, ఒక్కో మనిషి ఎన్నెన్ని ముఖాలు తగిలించుకుని ఎందుకైతే ఒకరితో సంబంధాలు లేక మంచితనంలేక ఎందుకైతే ఇలా తిరుగాడుతున్నాడో ఇలా యాతన పడుతున్నాడో తను పరికించలేదు. ఒక్కో సమస్యకి ఎన్నెన్ని ముఖాలైతే వున్నాయో తను పరిశీలించలేదు. కావడంవల్ల కాలేజీలో చేరాడు. కావడంవల్ల తన స్థితిగతులు ఆలోచించలేదు. కావడంవల్ల అప్పులు చెయ్యడం, ఉన్న నాలుగెకరాల ముప్పాతికా పొలం తాకట్టుపెట్టడం, చివరికి అమ్మడం జరిగింది. ముచ్చటైన ప్లీడరీ గుమాస్తాని—కంచంలో అన్నాన్ని కాళ్ళతో తన్నుకోడం జరిగింది.

ఐతే మొదట్లో తను చేసింది పెద్ద తప్పుగా అవుపించలే దతనికి. ఒకటి రెండు రోజులు పస్తులు వుండి కాలేజి మానివేసి పార్కులో చెట్టుకింద నీడలో పడుకున్నప్పుడు అతనికి ఇవే ఆలోచనలు వచ్చేవి. తను కాలేజీలో చేరడమే పెద్ద పొరపాటని పించేది. కళ్లు చెమ్మగిలేవి. ఐతే చివరిరోజులు కావడంవల్ల చదువు పూర్తిచేయకుండా కాలేజీ వదిలేస్తే అంతా వృథా అవుతుందని ఇంకా కొంత ఎక్కడో మనస్సులో మారుమూలల పెనుగులాడేది. కణతలు నొప్పిపుట్టేవి. ఆలోచించడం మానివేసేవాడు. నిజానికి అసలు ఆలోచించి మానివేసి ఎన్ని రోజులయింది. తనలో తను తెలిమబ్బు కాంతిలా నవ్వుకునేవాడు. దగ్గర దమ్మిడీకూడా లేని సమయాల్లో నవ్వుపుట్టిన సమయాల్లో స్వచ్ఛమైన తెల్లటి పాలపొంగులాంటి నిరంతరానందమయమైన నవ్వు తళుక్కున మెరిసే క్షణం అది. జీవితంలోని యథార్థ సంఘటనల్ని చూసి బెదరిపోయేవాడు. నెమ్మదిగా రోజులు జరిగినమీదట తనని తను సంబాళించుకోవడం జరుగుతున్నది. తనని తను తల్లిలా ఓదార్చుకోడం జరుగుతున్నది.

నిజానికి తను పెద్దపెద్ద ఆశలకి పోలేదు. అతి సామాన్యుడు కోరే జీవితం తప్ప తను ఎక్కువేమీ కోరడంలేదు. పరువుగా మర్యాదగా తనకు తానై స్వతంత్రించి బ్రతకగలిగే శక్తి తనలో వుంది. తన దగ్గిర ప్రతిభ వుంది. తను అనుకున్న రీతిలో బ్రతకాలి తను. ఒకరి అండమీద ఒకరి దయాదాక్షిణ్యాలమీద బ్రతకడం తనకి పడదు. అసహ్యం. ఐతే ప్రపంచానికి తను ఇవ్వగలిగిందానికంటే ఎక్కువేమీ కోరడం లేదు తను. అసలు ఇలా కోరడంలో వున్న తప్పు ఏమిటో ఎప్పుడూ అర్థంకాదు తనకి. ఐతే ఇలా కాకుండా ఎందుకు జరుగుతున్నది. ఈ దబ్బునే

వస్తువు ప్రతివాడికీ అందుబాటులో లేకుండా ఎందుకు జరుగుతున్నది.

తన జీవితాన్ని ముందుకు సాగనివ్వకుండా క్షణంక్షణం అడ్డుతున్న దెవరు? ధర్మారావుకి అర్థం కాలేదు. అవి కొత్తగా దినపత్రిక చదవడం మొదలు పెట్టిన రోజులు. ప్రపంచం ఇంకా రమారమి అర్థం కాని రోజులు.

* * * *

ఎలాగైతేనేం తనూ బి. ఏ. అనిపించుకున్నాడు. ఇంతటితో కష్టాలు గడిచి గట్టెక్కినట్టు కాదని ధర్మారావుకి తెలుసు. ఇంతటితో తను గమ్యం చేరినట్టు కాదు. ఎక్కడో ఎవరో తన శ్వాస బిగిస్తున్నారని ధర్మారావుకి తెలుసు.

ఇంక తను పుట్టి పెరిగిన ఊళ్ళో ఉండడానికి ఆస్కారం లేదు. ఇష్టం కూడా కలగదు. తన అవసరం ఎవరికీ లేదు. కప్పకూలిన మట్టిమిద్దె తప్ప ఊళ్ళో ఇంక తనకి మిగిలిందేమీ లేదు. కష్టాలు పరంపరలుగా రావడం తప్ప తను ఎవరికోసం ఆ ఊళ్లో ఉండాలో తనకి తెలిసిరావడం లేదు.

'వివాహాలు నడపడం దేవు డెరుగు. ఉన్న చోటే వుండు. ఏదైనా చిన్న ఉద్యోగం చూసుకుని తాపీగా బ్రతికేమార్గం చూడు.'

మాటలు ధర్మారావుమీద విరుచుకుపడ్డాయి. మాటలు ఒట్టి ఊహలు గనక, ఊహించడం ప్రమాదకరం గనక రోడ్డుమీద నడుస్తున్న ధర్మారావు ఒక్క క్షణం జంకి ఒక్కన ఆగి వెనక్కి తిరిగి చూసుకున్నాడు. ఇలాంటి క్షణాలు ప్రతి ఒక్కడి జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు హటాత్తుగా ఒక్కసారి ఎదురవక మానవు. ఇన్నాళ్ళనుండి తనని తను తన జీవితాన్ని తను మోసగించుకుంటున్నానేమో ననిపించింది ధర్మారావుకి. తలపెట్టిన ప్రయత్నాలు తలకి మించినవిగా అవుపించేసరికి, అలివిమాలినవిగా తెలివిమాలినవిగా అవుపించేసరికి ధర్మారావు ఒక్కసారి వెనుదిరిగిచూడడం తటస్థించింది.

తను కలలుగన్న భవిష్యత్తు ఎదురు మాపుల పొన్నులాంటిది.

తను ఇన్నాళ్ళనుండీ శ్రమపడి చదివిందంతా వృథాయేమో ననిపించింది. ఎందుకూ కొరగానిదేమో ననిపించింది. భయం ఒళ్ళంతా కంపించసాగింది. ఇప్పుడనుకోని లాభం ఏముంది. ఇంతకీ పరిస్థితులు కారణం. ఏ ఊహాలైతే ఒకప్పుడు తన జీవితంలో ఒక ప్రయోజనాన్ని సాధిస్తాయనుకున్నాడో ఇవాళ అవే కోర్కెలు తన జీవితాన్ని కంటకావృతం చేస్తాయని, అసలు ప్రాణమే చావుబ్రతుకుల కవాటంలో హతిమారిపోతుందని తను ఎప్పుడూ అనుకోలేదు. ఏదైనా ఇప్పు డనుకుని లాభం ఏముంది. ఇకనైనా జాగర్త పడడం మంచిది. ఉన్న పొలం కొస్తా అమ్మకం అయినమీదట, దీపం ఆరిపోయినమీదట, కంచంలో పాలు ఒలికిపోయిన మీదట, ఇకనైనా మెలుకువతో ఉండడం మంచిది. తనమీద తను ఒట్టు వేసుకుని చెబుతున్నాడు. తనుఇక ఎప్పుడూ అలాంటి పొరపాట్లు చెయ్యనని. తను చేసిందానికి నిజానికి తను తగడని!

ప్రాణాలు అరచేత పట్టుకుని ప్రతి ఆఫీసూ గాలించాడు. ప్రతి ఆఫీసరు చుట్టూ తిరిగాడు. ఐతే తనకి ఉద్యోగం రాలేదుమరి. నిజానికి తనకీ ఉద్యోగం వచ్చివుండేదే. ఐతే తనదగ్గిర ఐదు వందల రూపాయలు ఎక్కడ ఉన్నాయి. ఎక్కణ్ణుంచి తెచ్చేట్టు, లేకపోతే తనకీ ఉద్యోగం దొరికేదే. తనూ గుమాస్తాగా బ్రతికి ఉండేవాడే. గుండెనిండా గర్వంతో, హుందాతో, కాళ్ళకి కొత్తజోడు తొడుక్కుని, మెరుస్తున్న సిగిరెట్టు కాలుస్తూ—బిళ్ళాబంట్రోతు దారిచేస్తుంటే, తనప్రక్క ప్రక్కన తనకి దారి ఇస్తూ ఒత్తిగిలి అతివినయంగా అవసరాల క్లయింటు తన ప్రక్కన నడుస్తుంటే—తను గూడా తాసిల్దారులా గుమాస్తాగా గుర్రబ్బండీగా బ్రతికి ఉండేవాడే. అవును, నిజానికి తను గట్టిప్రయత్నమే చేశాడు. ప్రమాణం చేసి చెబుతున్నాడు. ఐతే తను ఐదువందలు ఎక్కణ్ణుంచి తెచ్చేట్టు. అవును, తనకి తెలుసు. ఇక్కడ తనని పలకరించే వాళ్ళే లేరు. ప్రయత్నాలు చేసి చేసి విసుగెత్తిపోయింది. జీవితంమీద. ఇల్లు అమ్మగావచ్చిన డబ్బు కూడా అయిపోవచ్చే సూచనలు అవుపించేసరికి ధర్మరావుని ఎన్నడూ ఎరుగని భయం ఆవరించసాగింది. డబ్బులేని భయం, బ్రతకడానికి వీల్లేకుండా చేస్తున్న డబ్బులేని భయం!

తనకి తెలుస్తున్నది ఇవాళ:

ప్రపంచంలో వాస్తవాన్ని ఎదుర్కోవడం కంటే కష్టతరమైంది మరొకటి లేదని.

తను జీవితంలో ఇన్ని యాతనలు పడుతున్నప్పటికీ తను జీవితాన్ని ఇంకా గాఢంగా ప్రేమిస్తున్నాడు. కష్టాల్లోపడి అగచాట్లమధ్య, అపాయాల

మధ్య చిక్కుకున్నప్పుడు ఇంకా తను జీవితాన్ని గాఢంగా ఇంకా ఇంకా గాఢతరంగా ప్రేమిస్తున్నాడు.

ఐతే తను చెయ్యదల్చుకున్నవి చెయ్యనివ్వకుండా చేస్తున్న దెవరు?

విలువలు చచ్చిపోయిన ప్రపంచంలో కూచుని ధర్మారావు ప్రశ్నిస్తున్నాడు.

## 2

'వాడు చూశావా బొంబాయి వెడుతున్నాడు!'

'ఎవడూ.'

'వాడే, ధర్మారావు.'

'ఎందుకూ. ఏరోడ్రోంలో చేరడానికేనా!'

'ఆఁ, అదే. అక్కడ వీడికోసం ఉద్యోగాలు ఎదురుచూస్తున్నట్టు. అయినా ఉన్నదాంట్లో ముడుకోక.'

'మన వాడికన్నీ గొంతెమ్మ కోర్కెల్లే.'

'బాగా చెప్పావు.'

'ఐతే వస్తా.'

'ఏం.'

'ఇంట్లో పనుంది.'

'ఛాస్లే. ఐనా కాఫీకి నన్ను పిలుస్తావా'

'ఛ ఛ. నిజంగా ఇంట్లో కాస్త పనుంది.'

'నిజం. ఇంటికనేది. హోటల్లోకి పోయేది. నాకూ తెలుసు.'

'ఐతే వస్తే రా.'

'నువు పిలిస్తే రాకుండా వుంటానా'

'పద.'

* * * *

ఔను. ధర్మారావు బొంబాయి వెళ్ళినమాట నిజమే. నవనాగరికుల మెప్పులు పుష్కలంగా పొందింది బొంబాయి. అది డబ్బున్న వాళ్ళ బొంబాయి. డబ్బున్నవాళ్ళకి దాని అందం చందం! ఇవన్నీ తెలిసే వెళ్ళాడు ధర్మారావు. ఉన్న ఊళ్లో ఉంటానికి తావులేక. అక్కడ తనకోసం ఎవరూ ఎదురు చూట్టంలేదు. ఏ ఉద్యోగాలు తన కోసం ఆగి లేవు. ఐతేనేం, వెళ్ళక తప్పింది కాదు. అసలు తను ఏదైనా విమానాశ్రయంలో చేరాలన్నా బొంబాయే వెళ్ళాలిమరి. ఐనా తనకోసం ఎవరో ఎక్కడో ఎదురు చూస్తారనుకోవడం కంటే తెలివి తక్కువ మరొకటి లేదు. ధర్మారావుకి ఈ ప్రపంచం సంగతులు అన్నీ నెమ్మదిమీద తెలుస్తూనే వున్నాయి. ఐతే తను రైలు ఎక్కేప్పుడు బాధతోనే వెళ్ళాడు. ఎవరో తనని బలవంతాన రైల్లో కూర్చోబెట్టినట్లనిపించింది. తనకి తెలుసు. ఇదంతా అంతగా తన మంచికేమీ రాలేదని. కాకపోతేనేం! ఐనా ఇంక చేసేదేముంది. అందుకే ధర్మారావు ఒక పరిచయస్తుని సలహామీద బొందిలో ప్రాణంవుండగా బొంబాయి వెళ్లాడు.

రైల్లో ప్రయాణంచేసినన్నాళ్లూ ట్రంకుపెట్టెని రెండుచేతుల్తో గట్టిగాపట్టుకు నేవున్నాడు. నిద్రపోకుండా ఒకమూలకూచుని కునికిపాట్లుపడుతూ, పెట్టె బరువెక్కువవుతున్నకొద్దీ వచ్చేనిద్రమంపు కాస్తా వదలిపోయేది.

జాగర్తసుమా అక్కడపట్టపగలే ఖూనీలు జరుగుతాయి. చాలా జాగర్తగావుండాలి నువ్వు. బొంబాయిలో 'చార్ సౌబీస్' ఎక్కువ. బొంబాయి చాలా గొప్పగావుంటుందిలే! పదే పదే స్నేహితుని మాటలు చెవుల్లో గింగురుమని తిరిగేవి.

మసక మసకగా తెల్లవారేసరికి రైలు తనని బొంబాయిలో దించింది. అంతేసి ఎత్తున గాలిలోకి లేచిన ఏడేసి అంతస్తుల మేడలుచూసేసరికి ధర్మారావుగుండె బావురుమన్నది. ఆ మేడలు ఇంతింత మురికి కొట్టుకుని, ఒక్కొక్క మేడలో వందలాది కుటుంబాలు కుక్కగొడుగుల్లా జీవించడం చూసేసరికి ధర్మారావుకి అసహ్యంవేసింది. ఒళ్లు జలదరించింది. ఒక్కొక్కగదిలో ఒక్కొక్కకుటుంబం, భవనాలచుట్టూ వున్న వేలాదికిటికీలు—ఒక్కొక్కకిటికీనుండి మకిల దుమ్ముకొట్టుకుని వ్రేలాడే ఆకులు పూలులేని బారెడు పూలమొక్క కాడలు ఇది శిథిలమవుతున్న బొంబాయి నాగరికతకి సరైన చిహ్నం అనిపించింది ధర్మారావుకి. బొంబాయినగరం గర్వపడే ఈ నాగరికతని చూసి, బెదిరి, ఒక్కసారి వెనక్కితిరిగి రైలెక్కి పారిపోదామనిపించింది ధర్మారావుకి. కాని ఇంటిదగ్గర తన కోసం ఎదురుచూస్తున్న దెవరు! ఒకరిమీద ఒకరికి ఈర్ష్య, అనుమానం, అసూయ, ద్వేషం తప్ప తన ఊళ్లోమాత్రం ఎన్నికుటుంబాలు సజావుగా, సాఫీగా బ్రతుకుతున్నాయి గనక. అంతకంటే ఈ కృత్రిమ జీవితమే మేలు. ఇక్కడ నువ్వు ఏ కాల్వలోకో, ఏ రైలుకిందనో, ఏ రస్తాప్రక్కనో పడి చని

పోయినా ఎవరని అనుకునేవాళ్లుండరు. ఎవరేమిటని వచ్చి తొంగిచూసేవాళ్లుండరు. ఒకరితో ఒకరు పలకరు. దూసరు రంగులు వేసుకున్న ముఖాలు తప్ప, దుస్తుల విలువలు తప్ప, విలువైన కార్లు తప్ప, బొంబాయి మహానగరంలో ఒకరి ప్రమేయం మరొకరికి లేదు. ఎవరి బ్రతుకు తెరువు, ఎవరి మంచిచెడ్డలు, వాళ్లు చూసుకోడం తప్ప పక్కకి కన్నెత్తి చూడరు.

ఇక్కడ ఒకరూ నడవరు. పరిగెడతారు. అంతా కూడబలుక్కున్నట్టు, అంతా గడియారాల్లా ఆడామగా విచక్షణ లేకుండా, మరబొమ్మల్లా, ఐదు నిమిషాలకొకసారి పట్నంలోకి వెళ్లేమురికి రైలుకోసం అంతా పరిగెడతారు. ఇదంతా చూసి ధర్మారావు మొదట ఆశ్చర్యపోయాడు. కాలం అనేక రెట్లుగా తన వేగాన్ని గుణించుకున్న ఈ బొంబాయినగరంలో ఇప్పుడు అంతా సహజంగానే అవుపిస్తున్నది. వేనకు వేలల్లో, లక్షలాదిలక్షల్లో, ఇప్పుడు అందరిలో తనూ ఒకడు. ధూళిలో, గాలిలో, రైలులో, గుంపులో ఇప్పుడు అందరిలో తనూ ఒకడు. తనూ పరిగెడతాడు. బాంద్రానుంచి చావుని మోసుకు వెడుతున్నట్టు దుర్వాసన దుర్గంధం చిమ్ముతూ పేదవాళ్ల కొంపల్ని చుట్టుముడుతూ దశదిశలా వ్యాపించి మెలికలు తిరుగుతూ పోయే మురికినీళ్ల పైపులు తప్ప, అంతా వస్తుసౌందర్యం తప్ప బొంబాయికి అందం ఏమిటి!

ఐతే నగరంలో ఏ ఇరానీ అంగడిలో పట్టినా అణా యిస్తే గుక్కెడు చాయ్ దొరుకుతుంది. ధర్మారావుకి చాలా గొప్పవార్త ఇది. కానీ బొంబాయి వెళ్లిన మొదటిరోజే ఒక విషయం తెలిసివచ్చింది తనకి. ఎలాంటి పరిస్థితుల్లోనైనా సరే—సబ్బు కొనుక్కుని తన బట్టలు తను ఉతుక్కోవడం తప్ప, ఏ షాపుకీ వెయ్యకూడదని. ఆ డబ్బు పెడితే ధర్మారావులాంటి వాళ్లు ఒక రోజున గమ్మున బ్రతకవచ్చు!

ధర్మారావుకి బొంబాయినగరం చీకటి గొయ్యిలా ఖైదుకొట్టులా అవుపించసాగింది.

అవును. తను నివసిస్తున్న గది ఖైదుకొట్టులాగే ఉంటుంది. తనతో పాటు మరో నలుగురు ఉంటున్నారు అంత చిన్న ఇరుకు సందులో. కప్పులోంచి రాలుతున్న మట్టి, కప్పుని కరుచుకుని నోళ్ళు తెరిచే పెద్ద పెద్ద బల్లులు. అంతా ధర్మారావుని పద్మవ్యూహంలోకి లాగినట్టు, చిత్రహింసలు పెడుతున్నట్టు, నరనరాలు తోడుతున్నట్టు బాధ. జివ్వున లాగుతున్న కాళ్లు, పాదాలు, చేతులు, రాయికి మల్లే మొద్దుబారిపోతున్నాయి. ఇలా రోజుకి వారానికి ఎన్ని సార్లు జరగడం లేదు. ఇది పెద్ద విశేషం కాదు. కడుపులో బల్లలు పెరిగినట్టు, గట్టి పడిపోయి జీర్ణకోశం చెడిపోవడం ధర్మారావులాంటి వాళ్లకి జరగడం అతి సామాన్యం. ఇది బొంబాయిలో పెద్ద విశేషం కాదు. ఐతే నాయర్ దగ్గర అన్ని మందులూ వున్నాయి. అన్నీ హోమ్యోవి. మరి ఇక్కడ డాక్టర్ల దగ్గరికి కనీసం పది రూపాయలు లేనిదే నువ్వు వెళ్ళలేవు. శీతజ్వరం కాసినా సరే. దానంతటదే పోవాల్సిందే తప్ప, లేకపోతే ఇక్కడ డాక్టర్లు నిన్ను దోచుకుంటారు. ఇది బొంబాయిలో అతి సామాన్యం.

మొదటి నెలకి ముందుగానే డబ్బు చెల్లించుకున్నాడు ధర్మారావు. కాళ్లు చాచుకుని పడుకోడానికూడా వీల్లేదు. ఇంత చిన్న చిన్న గదుల్ని తనెప్పుడూ చూళ్ళేదు. ఆ భవనంలో దాదాపు అరవై గదులున్నాయి. ఇలాంటి భవనాలు బొంబాయిలో వేలకు వేలున్నాయి. ఇలా నివసిస్తున్నవాళ్లు లక్షలకి లక్షలున్నారు. ఇంత చిన్న చిన్న అరలుగా ఈ భవనాలు ఒకరు కట్టినట్టు కాకుండా ఏ రాత్రో ఎవడో ఒక కిరాతకుడు వీటన్నిట్నీ అమాంతంగా సృష్టించినట్టు, వాటిల్లో మనుషులుగా జీవించడానికి వీల్లేకుండా తన లాంటి వాళ్లందర్నీ ఒక్కుమ్మడిగా బంధించినట్టు ధర్మారావు అనుకునేవాడు. అంతేగాని వీటన్నిట్నీ రాళ్ళతో ఉక్కుతో అన్ని ఇళ్ళకి మోస్తరుగానే మనుషులే వీటినీ నిర్మించారనే, యదార్థం నమ్మకం ధర్మారావుకి పోయింది. మానవుడిలో నమ్మకం, తనలో తనకి నమ్మకం ధర్మారావుకి క్రమేణా తగ్గిపోసాగింది. నాయరు, లాలాజీ తప్ప ధర్మారావుకి ఆ గదిలో ఉన్నవాళ్లెవరూ జీవితాన్ని సాఫీగా లాగుతున్నట్టు అవుపించదు. ఒకరూ అర్ధరాత్రి తప్ప ఎప్పుడూ గదికి రారు. పగలల్లా ఎక్కడ వుంటారో, ఏం పనులు చేస్తారో ఒకరికొకరికి తెలియదు. ఎవరి అవస్థలు వాళ్లు ఒంటరిగా రహస్యంగా భరించడం తప్ప, ఒంటెల్లా జీవితాన్ని ఈడుస్తూ, లాదూ బేదూ వేసుకుని బరువును మోస్తూ బ్రతకడం తప్ప ఒకరి విషయం మరొకరికి పట్టదు.

ధర్మారావుకి అవతలగా గోడకి కాళ్లు తన్ని బోర్లా పక్కకి కరుచుకుని పడుకున్న నాయర్ అర్ధరాత్రి లేచాడు. గోడకి కళ్ళు గుచ్చి, ఆలోచనారహితంగా చూస్తూ పడుకున్న ధర్మారావుని తట్టి లేపాడు.

'మాకంపెనీలో ఏం జరిగిందో తెలుసా?' అడిగాడు.

నాయర్‌కి విమానాశ్రయంలో పని. తను పని చేయాలనుకున్న విమానాశ్రయంలో; తన ఆశలన్నీ తన కోర్కెలన్నీ పెట్టుకున్న విమానాశ్రయంలో.

గోడమీద ప్రాకుతున్న బల్లిని చంపకుండా దిగ్భ్రాంతిపడి చూస్తూ ధర్మారావు నాయర్ వైపు తిరిగాడు.

'మీ సమ్మె ఎంతవరకు వచ్చింది?' అడిగాడు.

'అరెస్టుచేశారు. నాటనలుగుర్ని'

'ఏం గలాటా చేశారా ?'

'లేదు. ప్రభుత్వం కంపెనీని అత్యవసరశాఖ కింద ప్రకటించింది.'

అత్యవసరశాఖ అంటే పనివాళ్ళ కాళ్లూ చేతులూ విరగ్గొట్టినట్టు, సమ్మె చెయ్యడానికి వీలుండదు.

అలాగనక చేస్తే పనివాళ్లని పట్టుకువెళ్ళి జైల్లో పెడతారు.

'ఐతే వర్కర్సు పనిలోకి వెళ్లానికి ఒప్పుకుంటారా ?'

నాయర్ మాట్లాడ లేదు.

సమ్మెని విచ్ఛిన్నం చెయ్యడానికి యజమాన్లు యూనియన్ నాయకులకి ప్రలోభాలు చూపారు. కానీ వర్కర్సు లొంగిరాలేదు. యజమాన్లు కొందర్ని చంపి గద్దెలకి వేసే పద్ధతులు అనేకం అవలంబించారు. కానీ వర్కర్సు లొంగిరాలేదు.

జరగడానికి వీల్లేని పరిస్థితుల్లో జరుగుతున్న విషయాల్ని చూసి ధర్మారావు విస్తుపోయాడు. తనకంటే తక్కువ చదువుకున్న నాయర్ ఉద్యోగ స్థిరత్వాన్ని చూసి అప్పుడప్పుడు తను అసూయపడని క్షణాలు లేకపోలేదు. ఐతే ఇవాళ నాయర్ తెచ్చిన వార్తని చూసి ధర్మారావు కంపించిపోయాడు. హఠాత్తుగా నాయర్ని పనినుండి తొలగించింది కంపెనీ. ఒక్క నాయర్నే కాదు. యూనియన్ కార్యదర్శినికూడా. మొత్తం నాలుగువందల ఎనభైమందిని. కారణం కంపెనీ నష్టంమీద నడుస్తుందని. మిగిలిన వర్కర్సు జీతంలో ఇరవైశాతంకూడా కోతపెట్టింది కంపెనీ.

తనకి తెలుసు, నాయర్ ఒక్కడే కాదు. కొచ్చిన్‌లో మారుమూలల పల్లెల్లో తల్లీ ఇద్దరు చెల్లెళ్ళూ ప్రతినెలా నాయర్ పంపే మనీయార్డరు కోసం ఎదురుచూస్తుంటారు. ఐతే ఈనెల నాయరు డబ్బు ఎలా పంపుతాడు ? ఇప్పుడు వాళ్ళగతేం కాను. ఇప్పుడు నాయర్ ఇక్కడ ఎలా వుండగలుగుతాడు ?

నాయర్‌కి ఈపని తప్ప మరోపని తెలియదు. ఇక్కడ తప్ప మరొకచోట ఉద్యోగం దొరకదు. దేశం మొత్తంమీద విమానాలు నడిపే కంపెనీలు మూడు నాలుగేను. ఐతే ఇక్కడ పనిలోంచి తీసేశారు. ఇంకెక్కడ పని దొరికేట్టు. పని దొరక్కపోతే ఇంకెక్కడ ఎలా బ్రతికేట్టు !

'యూనియన్ సమ్మె చేయడానికే నిశ్చయించింది.'

'ఇంకేం, మంచిదేగా.'

'అవును, నువ్వు అలాగే అంటావు. చూడు. రేపీపాటికి కంపెనీ మూతవేస్తారు.'

'మరి ప్రభుత్వం—'

ప్రభుత్వం చాపకింద తేలులాంటిది.

'ఈ అత్యవసరాలన్నీ వర్కర్సుకి సంబంధించినంత వరకే.'

'ప్చ్. మనరోజులు బాగాలేవు.'

'నువ్వూ నేనూ పనిచేయడం అనడంలేదుగా.'

'మరి వాళ్ళకి నష్టం వస్తుంటే.'

'జొన్లనే లోపల జరిగే తంతు మనకెలా తెలుస్తుంది. పోయిన సంవత్సరం ఇలాగే నెలనెలా లక్షలు లక్షలు నష్టం వస్తుందన్నారు.'

'ఐతే రాలేదేమిటి !'

'భలే. ఎకౌంట్సులో ఎన్ని అంకెలు మార్చినా చివరికి కొద్ది వేలేనా లాభం కనపడక మానిందికాదు.'

అవును, మనరోజులు ఎప్పుడూ బాగుండవు, ధర్మారావు ఈసారి లోలోపల అనుకున్నాడు. అనుకుని వాలికి కొరుక్కున్నాడు.

'నీకు అసలు సమస్య అర్థం కాలేదు.'— నాయర్.

నిజమే. తనకంటె తక్కువే చదువుకున్నా నాయర్‌కి జీవితం లోతుపాతులు బాగా తెలుసును. నాయర్ జీవితంలో ఎన్నో తుఫానుల్ని చూసినవాడు. ఐనా తను సమస్యల్ని అర్థం చేసుకోడానికి ఇతరుల వుద్దేశ్యాలు వినడానికి తగినసమయం రాలేదప్పుడూ. నిన్న మొన్నటిదాకా తను ఆలోచించాల్సిన అవసరంకూడా కలగలేదు. నిజానికి ఇంకా ధర్మారావు జీవితంలో తుఫాను ప్రారంభం కాలేదు. జీవితంలో చిన్న-చిన్న విషయాలకే హడలిపోవడం తప్ప, అసలు కొద్దిపాటివాటికే పరితపించడం తప్ప, తుఫానువీచే ముందు ముసురుకునే చల్లటిగాలి, నిరాశ, నిస్పృహలు తప్ప, నిజా

నికి ధర్మారావు జీవితంలో ఇంకో తుఫాను ప్రారంభమే కాలేదు.

'మనిషిని క్రమేపి చంపడం వాళ్ళకి బాగా తెలుసును.

ఐతే మనరోజులు బాగుండే దెప్పుడు? — నాయరు.

అసలు మనరోజులు ఎందుకని బాగోలేవు?

ఏ మనిషీ సుఖంగా బ్రతుకుతున్నట్టు అవుపించడు ఎందుకని. ఒక్క లాలాజీ తప్ప ఈ గదిలో ఆఖరికి నాయర్ స్థితికూడా చెడింది. ఎందుకని. ఈసారి నాయర్‌కీ తనకీ ఎక్కడో చాలా దగ్గర సంబంధం ఉందనిపించింది. ఔను. తనకి తెలుస్తున్నది ఇప్పుడు. తను ఒకడే కాదు. తనలాటి వాళ్ళు లక్షోపలక్షలు. అందరిలో తనూ ఒకడు. తనకి తెలుస్తున్నది ఇవాళ: ఇది తన ఒక్కడి సమస్యే కాదు. లక్షోపలక్షలకి సమస్య తన ఒక్కడికే సంబంధించింది కాదు. అందరిలో తనూ ఒకడు.

నాయర్ అంటున్నాడు; 'ఇంక రెండు రోజుల్లో కాకా మన పెట్టెలు వీధిలో పారేస్తాడు.'

మాటలు శాపాల్లాంటివి. పదునైన బల్లాలాంటివి.

'లాలాజీ ఇంకా రాలేదేం.' ధర్మారావు నాయరు చెప్పే మాటలు వినిపించుకోకుండా తనలో తను గొణుక్కుంటున్నాడు.

బైట పొగమంచు ధవళవస్త్రాలు ధరించుకున్న మనుషులకి మల్లే రోడ్డుమీద అటూ ఇటూ పచార్లు చేస్తున్నది. మబ్బుల్లోంచి గాలిలోంచి రోడ్డుమీదకి, కిటికీ ఊచల్లోంచి గదిలోకి దిగి వస్తున్నది. వెన్నెల కాంతిలో పచ్చగా నల్లగా మెరుస్తున్న కిటికీ ఊచలు తప్ప గదినిండా చీకటి తేమగా పరుచుకుని వుంది. అరలరలుగా వున్న ఈ భవనం గదుల్లో పది గంటలకే లైట్లు ఆర్పేస్తారు. నువ్వు స్విచ్చీ వెయ్య నక్కర్లేదు. ఏడు గంటలకి వెలుగుతాయి. పదింటికి ఆరిపోతాయి. అసలు ఏ గదిలోనూ స్విచ్చీలు లేవనే విషయం నువ్వు గమనించి వుండకపోవచ్చు.

'ఈ ఇళ్ళమీద కాకా ఎంత సంపాయిస్తున్నాడో నీకు తెలుసా.' నాయరు చెప్పుకుపోతున్నాడు.

'రెండు లక్షలు పన్ను కడుతున్నాట్ట.'

నిజానికి నాయర్‌కి కూడా తెలియకపోవచ్చు!

ధర్మారావు ముఖం పక్కకి తిప్పుకున్నాడు. నాయర్‌తో మాట్లాడ్డమంటే తనకి మొదటినుండీ విసుగు. జీవితంలో వాస్తవ పరిస్థితుల్ని ఎదుర్కోవడమంటే తలబొప్పి కడితేనే తప్ప ఎవరికైనా కష్టమే మరి. పైగా తను జీవితంలో ఇంత చిన్న వయస్సులో వన్యమృగంలాంటి పరిస్థితుల్ని మూర్ఖంగా ఎదుర్కోవడం తటస్థించింది. నిజమే. నాయర్ చెప్పినవన్నీ నిజమే. ఐతే ఈ నాల్గువందల ఎవళ్ళ సంసారాలు కుళ్ళి కృశించి నశించాల్సిందేనా?' ధర్మారావుకి ప్రశ్న ఛట్టున ముఖాన కొట్టినట్టనిపించింది. ఇంత కిరాతకత్వం ఎక్కడ వుంది. అసలు లోపం ఎక్కడ వుంది.

నాయర్ అంటాడు ఇవన్నీ వ్యాధి లక్షణాలు మాత్రమే నని.

ఉద్యోగంకోసం ప్రయత్నించి విసిగెత్తి నిరాశ చెంది, తనకి మాత్రం రైల్లో గుంపులో ఫుట్‌బోర్డు మీద నిలబడి ప్రయాణం చేస్తున్నప్పుడు తనకిమాత్రం ఎన్నిసార్లు ఉద్రేకం కలగలేదు. క్షణంలో తేలిగ్గా జీవితాన్ని అంతమొందించుకుందామని తనకి మాత్రం ఎన్నిసార్లు అనిపించలేదు.

వన్యమృగంవలె జీవితాన్ని పరిస్థితులు ఎదుర్కున్నప్పుడు గాజుగ్లాసులా తను కూడా ఈ భూమ్మీద నిలబడదామనే ఆశలు బ్రద్దలైనప్పుడు తనకీ తెలిసివస్తున్నది తను జీవితాన్ని ఎంత గాఢంగా ప్రేమించింది.

ఉద్యోగం దొరికే ఆశలు రోజురోజుకీ సన్నగిలేకొద్దీ తనకీ తెలిసివస్తున్నది క్షణం క్షణం కల్లోలపడుతున్న మానవుడి స్థితి, క్షణక్షణం గగ్గోలు పడుతున్న కుటుంబాల క్షోభ. తన స్థితీ అటువంటిదే, తనూ నిస్సహాయుడే. ఇలా ఆలోచించేప్పుడు ధర్మారావు కళ్ళల్లో నీళ్లు తిరిగేవి. ఆశ్చర్యపడి లాభం ఏమిటి. తను, జీవితాన్ని ఇంత గాఢంగా కాంక్షిస్తున్నవాడు, ఆశ్చర్యపడి లాభం ఏమిటి. తనూ ఏదో ఒకటి చేయాలి. బలీయమైన కోర్కె, ఉబలాటం. తనూ సుఖంగా మానవుడిలా బ్రతకాలి. ఆశ, ఆర్భాటం. ఐతే తను చెయ్యదల్చుకున్నది చెయ్యడానికి వీల్లేకుండా చేస్తున్న దెవరు?

## 3

గుమ్మంలో పెద్దగా ముసిముసినవ్వులు నవ్వుకుంటున్న గర్వంతో వెండిలా మెరుస్తున్న లాలాజీతల అవు

పిస్తున్నది. లాలాజీ చాలా చిత్రమైన మనిషి. ఎప్పుడూ ఖులాసాగా కాలక్షేపం చేయడం, ఎప్పుడూ నవ్వుతూ ఎదురవడం లాలాజీ ప్రత్యేకత. కేసరు కొంతిలాంటి లాలాజీ నవ్వు ప్రమాదకరమైందని ధర్మారావుకి తెలుసు.

'ఎవరక్కడ?' తను.

ధర్మారావుదుస్థితి కీడుమూడిన మానవుడిస్థితి. లాలాజీకి బాగా అనుభవవేద్యం.

'హలో. ఎలావుంది జీవితం' లోనికి వస్తూ లాలాజీని ప్రశ్నించాడు. ప్రశ్న ధర్మారావులో అణువణువు, ఛేదిస్తున్నది.

'ఏమిటి కథ?' —తను.

'స్టేషన్‌కి వెడదామా?'

'ఎందుకు'

'చాయ్ తాగుదాం'

ధర్మారావుకి ప్రాణాలు లేచివచ్చాయి.

'పద'

చాయ్ తాగుతూ అడిగాడు తను:

'నువ్వు స్టాక్ బ్రోకర్‌వి కదూ'

'భలే. ఎవరన్నారు.'

'ఐతే నువ్వు ఏంచేస్తుంటావో ఎప్పుడూ చెప్పావు గాదు.'

'ఎప్పుడో నువ్వు నన్ను అడిగినట్టు.'

ధర్మారావు మనస్సు నొచ్చుకున్నాడు. ఇన్నాళ్లూ లాలాజీని తప్పించుకు తిరగడం తనకి అప్పుడే తెలిసివచ్చినట్టు.

'నేను లేనప్పుడు మీరంతా నన్ను గురించి చాలాచాలా చెప్పుకుంటా రనుకుంటాను.'

మాటలు పొడుస్తున్నవి. తనకి చాయ్ మింగుడు పడ లేదు. దెబ్బలు ఇచ్చేది లాలాజీ అనే సంగతి తన తల కొట్టేసినట్లనిపించింది. పెద్ద అవస్థలో పడ్డాడు తను.

'అవును, ఇది అతని వంతు.' లోలో గొణుక్కున్నాడు.

ఐతే తనుచేసింది అంత మంచిపని కాదు. ఇన్నాళ్ళూ తనూ ఇతర్లూ లాలాజీని ఆడిపోసుకోడం చూస్తే ఇప్పుడు తనమీద తనకే అసహ్యం వేస్తున్నది.

'పరనిందలో ఆనందం ఎందుకు?' తనలో తను.

'నన్ను గురించి ఇతర్లు ఏమనుకుంటారో నని నే నెప్పుడూ ఆలోచించ లేదు.'

ఇందులో అంత నిజం లేకపోవచ్చు.

'ఐతే నేను చేస్తున్నది అంత మంచిపనని నేను మాత్రం అనుకుంటున్నానా ఏమిటి.'

లాలాజీ మాటలు చాలా వింతగా వున్నాయి తనకి.

ఐతే లాలాజీ చేస్తున్నది ఏంపని. తను అడగ లేదు. మాట పెకల్లేదు.

'ఏదో ఒకరకంగా మనిషి బతకాలా మరి'

'ఔను. ఏదో ఒకటి చెయ్యాలి' తను.

'లేకపోతే ఎన్నాళ్లని పస్తులుంటావు. ఎన్నాళ్లని యాతనపడతావు. నేను గోవానుంచి వ్యాపారం చేస్తాను.'

'అలాగా.'

అలా చేయడం తప్పు కాదూ.

ఒక పక్కన కడుపుకాలి చస్తుంటే ధర్మపన్నాలేమిటి!

ధర్మారావుకి ఆశ్చర్యం కలిగింది. అయితే గోవాలో సరుకులు కొని దొంగతనంగా బొంబాయి చేర వేస్తాడన్న మాట. చాలా లాభసాటి బేరమే ననుకో. ఐతే నేం. చాలా ప్రమాదం కూడా.

ధర్మారావు తన కేవేమీ అర్థం కానట్టు ముఖం పెట్టాడు.

'దాదర్‌లో ఆ పచ్చ మేడ వుంది చూశావా?'

'ఊ!'

'వాడు అంత పెద్ద మేడ ఎలా కట్టాడో తెలుసా.' వంచకుడు. చార్ సౌబీస్!

'ఇందులో నేం? ఏదో ఒకరకంగా బతకాలి మరి.

'నువ్వు మూడు నెల్లనుంచి ప్రయత్నిస్తున్నా ఇంతవరకు ఉద్యోగం దొరక లేదు. ఔనా?'

ఇక్కడ నీకోసం ఉద్యోగాలు పోసుకొని కూచో లేదు ఎవరూ: ఏ ఆఫీసులోనో ఏ మేనేజరో తనని అన్న మాటలు.

'ఔను. ఇంక దొరికే ఆశకూడా లేదు.'

'నేను ఒకప్పుడు నీలా ప్రతి కంపెనీచుట్టూ తిరిగినవాణ్నే. నేను మీ అందరికంటే ఎక్కువ కష్టాలే పడ్డాను. నా జీవితంలో దాదర్‌నుంచి చర్చి గేటుదాకా నడిచినరోజు లున్నాయి.' దాదాపు పది మైళ్ళు.

'ఇప్పుడు నా జీవితం హాయిగా గడుస్తున్నది.' ఐనా ఇంతకంటే నీచం ఏముంది!

గదికి వచ్చేసరికి నాయర్ లేడు. ఊరేగింపులో పాల్గొనడానికి తెల్లవారకముందే వెళ్ళిపోయాడు.

'రేపు వెళ్దాం. వస్తావా.'

'ఎక్కడికి.'

'గోవా.'

'ఎందుకు.'

'భలే.'

'ఆలోచిస్తాను.'

'నాదగ్గిర ఉండిలే డబ్బు.'

'నన్ను ఆలోచించుకోనివ్వు.'

ధర్మారావు ముఖాన నెత్తురుచుక్క లేదు.

జీవితం విలువిద్య లాంటిది.

లాలాజీతో సంభాషణ తన గుండెలు నమిలి వేస్తున్నది.

## 4

ఉదయం అవడంతోనే వేటకి బైల్దేరాడు ధర్మారావు. ఉద్యోగంకోసం చేసే యాత్రకి! మరి ఉద్యోగం గండపెండేరంలాంటిది. భద్రత జటాయువు లాంటిది.

తనకి తెలుసు, తను తీగమీద నడుస్తున్నాడని. ఐతే మధ్యలో ఈ తీగని తెగగొట్టిం దెవరు. తనకి తెలుసు: తను తీగమీద నడవడంలేదని. ఒట్టినే ఇది కత్తి అంచున ఆటగత్తె సామ్యం అని. ఐతే మధ్యలో ఈ తీగని సృష్టించిం దెవరు. ఈ తీగపైకి ఎక్కించి బలవంతాన తనని కిందకి పడత్రోసిం దెవరు. ఎవరు ఎవరు ?

తనకి తెలుసు ధ్వనినుంచి ప్రతిధ్వని వస్తుందని. కొంతకాలం తీసుకుంటుందని. ఆడుతూ పాడుతూ పనిపాటలు చేయాల్సిన మానవుణ్ణి—పడి నలిచి వస్తున్న మానవుణ్ణి శవాలకిమల్లే మృగాలకి మల్లే శ్వాస లాక్కుంటూ—ఇలా మనిషిని మనిషిగా బ్రతకనీకుండా చేస్తున్న దెవరు ?

ధర్మారావుని పిచ్చివాళ్ళ ఆసుపత్రిలో కూచో బెట్టారు. అతని ఒంటినిండా ఉచ్చులు బిగిస్తున్నారు. అతని మనస్సుని శల్యాలుగా లాగివేస్తున్నారు. అందమైన బొంబాయి నగరం అతని మనస్సుకి గుర్రపు నాడాలు గుచ్చుతున్నది. తన కాళ్ళకింద చాప లాగుతున్న దెవరు? తను భీతావహం చెందుతున్నాడు. క్షణక్షణం కంపించిపోతున్నాడు.

అన్ని వీధుల్లో తను సంచరిస్తున్నాడు. అన్ని వేళల్లో తను అవిరామంగా అరుంధతీ నక్షత్రానికి మల్లే అమావాశ్యచంద్రునికిమల్లే అన్ని ఆఫీసుల ముందు తను ప్రకాశిస్తున్నాడు.

కుత్సితాలకి కుట్రలకి ఆలవాలమైన సమాజంలో కూచున్నాడు. మధ్యాహ్నం సూర్యుడు కాళ్ళూ చేతులూ ముఖమూ చెవులూ కాలుస్తున్నాడు. విరిగిపోయిన పాలకిమల్లే నల్లమందు మిథ్యావాదంలో పడలేదు తను. తన చుట్టూ నిరాశావృత్తం చుట్టుకుని తిరగడంలేదు తను.

నివ్వెరపడి, తల దిమ్మెత్తి, కాళ్లు పడిపోయి, ఒళ్ళు చల్లబడి శ్వాస ఆడక కొట్టుకులాడుతున్న సమాజంలో, అస్థిపంజరంలాంటి కుక్కగొడుగుల్లాంటి పార్కులాంటి సమాజంలో కూచున్నాడు.

గతంలో పడిపోయినవాళ్ళు, ప్రస్తుతంలో పనికిరానివాళ్ళు, భవిష్యత్తులో పడిగాపులు పడే వాళ్ళు—అందరూ కలిసేచోట, నీటిలో చేపలవలె దూసుకుపోయే భయాలు కలిసేచోట, పార్కులో సమాధిలాంటి సమాజంలో కూచున్నాడు తను.

దేవుడా, ఏమిటి ఇలా చేశావు.

వినరానిచోట్ల వింటూ, తిరగరానిచోట్ల తింటూ, పడరానిపాట్లు పడుతున్నాడు. కాళ్లూ చేతులూ తనవి కానట్టు తనతో సంబంధంలేనట్టు, ఎక్కడివి తగిలించుకున్నట్టు వేటికవే ఊడిపడుతున్నాయి. బ్రతుకు జీవుడా అని బలుపాకైనా లేక ఒట్టినే గాలికి తిరుగుతున్నాడు తను.

అవును. సామాన్యమానవుడి దుస్థితికి కారణాలు: ధరలు, వ్యాధులు, గాలి. అవును ధనికులు కూడా. అన్నిటికంటే ధనికులుకూడా, తనకి తెలుసు, సముద్రం ఉప్పొంగి వస్తుందని, సంఘటితం పడుతున్న లక్షోపలక్షల యువకులు, కోటానుకోట్ల మానవులు సముద్రంలా ఉప్పొంగివస్తారని, తనకి విశ్వాసం వుంది. మానవుడిలో పోరాటంలో ధర్మంలో తనకి విశ్వాసం వుంది.

అందుకే యింకా తను ప్రకాశిస్తున్నాడు.

అందుకే తను జీవితాన్ని ఇంకా గాఢంగా ప్రేమిస్తున్నాడు.

అందుకే ఇంకా ప్రతి ఆఫీసుముందూ వియాపాతునిగా బాధా సముద్రునిలా బడబాగ్నిలా ఇంకా తను ప్రకాశిస్తున్నాడు.

తనని వేలకి వేల ప్రశ్నలు వేధిస్తున్నాయి. జవాబులివ్వని ప్రశ్నలు, ప్రశ్నలు వేయని జవాబులు, అన్నీ తనని లక్షోపలక్షలుగా పీడిస్తున్నాయి. ఐతే తను చావడానికి ఒప్పుకోవడంలేదు. మరి. బ్రతికి బాగుపడాలని తనకీవుంది మరి. తను జీవితాన్ని గాఢంగా నిశ్శంకగా నిశ్చింతగా ప్రేమించాడు మరి. ఐతే ఇప్పుడు తను చెయ్యాల్సిందేమిటి. ఇప్పుడు తనేం చెయ్యాలి ?

తను అనుకున్నట్టు జరుగుతవనుకున్న విషయాలకి జరగరాని పరిస్థితుల్లో జరుగుతున్న విషయాలకి—ఒక దాని కొకటి పోల్చి చూసుకుంటున్నాడు. రెండు చేతులు కలిపి వేళ్లు గుణించుకుంటున్నాడు. ఎక్కడ తేడా వస్తున్నది. అసలు విషయం ఏమిటి. అసలు మానవుడికీ మానవుడికీ ఇంత భేదం ఎక్కడ కల్పితమైంది. అసలు వీటన్నిటికీ కారణం ఏమిటి ?

# పిలుపు



శ్రీ బూర్లగడ్డ కందాళ లక్ష్మీనరసింహాచార్య

తిగ్మ తిగ్మాంశుకిరణ సందీప్తదగ్ధ - మధుర మృదుశోభన శ్రీసుమంగళాంగి
కుముద వనలక్ష్మి నీ రాకకోస మేమొ - వేచిచూచుచున్నది వేయికనుల.

తళుకుచుక్కల క్రొమ్ముడిం దాల్చి, మొయిలు
తెరల మాటునఁ బరపు సిగ్గరిలిబించు
వాలుచూపుల నీ విదే వత్తువంచుఁ
జిన్ని రేకన్నె; రాకున్నఁ జిన్నవోవు!

అకులు వాడిపోయినవి; ఆనత శీర్షములైనవోయి, దో
షాకర! భూజముల్ వినవిసా చెలరేగుచు నగ్గిఁ జిమ్ముచున్
దూకెడి గాడ్పుగాని అతిధూర్తత సౌఖ్యము నేడ్పియేడ్పి, నీ
రాకకు నంగలార్చినవిరా! రజనీ రమణీ మనోహరా!

చల్లని లేతవెన్నెలల చాలులయందున గ్రుమ్మరించరా
వెల్లువ గట్టునట్లు వినువీథులయం దమృతంపు ధారలన్!
మెల్లగఁ బ్రాణముల్గొనుచు మేల్కొను దుర్భరతాపబాధ మూ
ర్ఛిల్లిన మా జగమ్ములు! గిరీశ సుతేశ శిఖాశిఖామణీ!

నీ వెన్నెలలలోన నిండియున్నవి దేవ - పారిజాత మనోజ్ఞ పరిమళాలు!
నీ వెన్నెలలలోన నిలచియున్నవి వియ - ద్గంగా తరంగ సుభంగిమాలు!
నీ వెన్నెలలలోన నీరయి స్రవించెను - దేవేంద్ర పీఠస్థ దివ్యమణులు!
నీ వెన్నెలలలోన నిండిన వప్సరః - స్త్రీస్వర్ణ మంజీర శింజితాలు!
ఊర్వశీ ముగ్ధలాస్య లీలోజ్జ్వలాలు! - మేనకాస్నిగ్ధ సుస్మిత మిశ్రితాలు!
నీదు వెన్నెల వన్నెలు నించవోయి - కలువ కన్నెల కన్నులఁ గాంతినిండ.

ఏ మహాకవి సత్కావ్య సీమలోన - నాటలాడుచునుంటివో హాయిమీఱి,
మాదులోకానఁ గ్రమ్మె తమస్సు; దాని - దొలఁగఁజేయఁగ రావోయి కలువరాజ!

---

# ఇమ్మడి రాజరాజచోళుడు

(క్రీ. శ. ౧౧౪౬-౧౧౭౩)

# ఇమ్మడి రాజాధిరాజు

(క్రీ. శ. ౧౧౬౩-౧౧౭౮)



శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు

ఇమ్మడి కులోత్తుంగ చోళదేవుడు క్రీ. శ. ౧౧౪౬ సంవత్సర ప్రాంతమున చనిపోయెను. ఆ రాజేంద్రుని మరణమునకు బూర్వము రెండుమూడేండ్లకు ముందునుండియు నాతని కుమారుడు ఇమ్మడి రాజరాజ చోళుడు తండ్రితోపాటు రాజ్యభారమును బూని యుండెను; ఇమ్మడి రాజరాజచోళుని రాజ్యాభిషేకము క్రీ. శ. ౧౧౪౬ సంవత్సరమున ఏప్రిల్, — జూలయి నెలల నడుమ (శ. ౧౦౬౮ వైశాఖ జ్యేష్ఠ మాసముల నడుమ) నెప్పుడో జరిగి యుండెను.1 ఆనాటి కా రాజేంద్రునకు పదునెనిమిది సంవత్సరముల వయస్సుండవచ్చును. పట్టాభిషిక్తుడయి నది మొదలు ఇమ్మడి రాజరాజచోళుడు ఇరువదియారు సంవత్సరముల చోళ - ఆంధ్రమండలములను రెండింటిని త్రిభువన చక్రవర్తి బిరుదముతో పరిపాలించెను. నిజమున కాతడు దక్షుడుకాడు. సమర్థులైన మహాసేనాపతులు, దండనాయకులు, మహామండలేశ్వరులు రాజ్యభారమును బూని రక్షించిరి. చోళమండలమున సామంత నృపాలురును, దక్షిణాంధ్రసీమలందు పొత్తపి నగరాధీశులయిన తెనుగు చోళ భూపతులును పూర్వాంధ్రదేశమందు వెలనాంటి మహామండలేశ్వరులును, దక్షతతో చక్రవర్తి పేరును, సామ్రాజ్యమును పరిపాలించిరి. రాజరాజచోళుడు దక్షుడు గాకపోవుట వలన సామంతులును, మహామండలేశ్వరులును మిగుల బలవంతులై ప్రవర్తించిరి. పేరునకుమాత్రము రాజరాజచోళుడు ఆంధ్రదేశమున చాళుక్య కులతిలకుడు. చోళమండలమునందు మాత్రము బూర్తిగా చోళుడు. తంజావూరిజిల్లా మాయూరం (మాయూరవరం) తాలూకాలోని రొంక గ్రామమునందున్న శిలాశాసనమునందు2 "రాజరాజచోళుడు తన ప్రజకు ప్రాణమువంటివాడు మూడులోకములందును ముఖ్యుడు, ఆగమములకు ముఖమువంటివాడు, మూర్తిమిళులకు శిరమువంటి ప్రధానుడు, తలమానికము" అని వర్ణింపబడినాడు. అయినను అతడు దురంధరత్వము గల్గినవాడు కాడు గావున, వెలనాంటి యిమ్మడిగొంకరాజును, అనంతరము (క్రీ. శ. ౧౧౬౧ కు తరువాత) అతని కుమారుడు మహామండలేశ్వర వెలనాంటి వీరరాజేంద్ర చోడుని ఆంధ్రదేశమునకు అధీశ్వరునిగా నభిషేకించెను. * ఆ నియోగమువలన ఇమ్మడి రాజరాజు రెండుఫలములను సంపాదింపగల్గెను. వాటిలో మొదటిది ఆంధ్రదేశము చోళచాళుక్య సామ్రాజ్యముగ నుండిపోయెను. రెండవది బలవంతులయిన తెనుగు చోడులను తలయెత్తకుండ, చోళమండలమునకు ముప్పువాటిల్లచేయకుండ అదిమి యుంచగల్గెను. వెలనాంటి మహామండలేశ్వరులును తెనుగు చోడులయిన పొత్తపి పురాధీశ్వరులును పరస్పరవైరముతో మ్రగ్గుచుండియు, చాళుక్యచోళ (చోళచాళుక్య) చక్రవర్తులకు సామంతులయియుండుట సంభవించెను.

---

1. ఎపి. ఇం. సంపుటము ౯. పుట ౨౧౯.

2. శాసనావళిరిపోర్టు: ౧౯౨౫ సం. పు ౨౫౭ నెం. శాసనము.

* రాజేంద్రచోడ భూపాల
 స్సోయం పరపురంజయః
నియోగాద్రాజరాజస్య
 పాలయ న్నాంధ్రమండలమ్॥
 నందూరి తామ్రశాసనము.

మహామండలేశ్వర వెలనాంటి వీరరాజేంద్ర చోడుడు (అతడే యిమ్మడి రాజేంద్రచోడుడు) క్రీ. శ. ౧౧౬౧ సంవత్సరమున తండ్రి యనంతరము ఆంధ్రక్షమాధీశ్వరు డయ్యెను. అది మొదలుకొని యిమ్మడి రాజరాజచోళుడు ఆంధ్రరాజ్యపరిపాలన మందు ఎట్టిజోక్యమును గలిగించుకొనలేదు. కలిగించు కొనుట కాతడు సమర్థుడును గాకుండెను. ఇమ్మడి రాజరాజచోళునకు అప్పటికి చోళరాజ్యాభిషిక్తుడయి ఇంచుమించు పదిహేను సంవత్సరములు గతించినను సంతానము లేకుండెను. అతని యనంతరము చోళ రాజ్యభారమును బూనుటకు కర్త గానరాకుండెను. ఆ విషయ మొకటి చోళరాజవంశమునకును, సామంత రాజలోకమునకును, ఇతర విషయములతోపాటు, సంతాపహేతువుగా బరిణమించెను. చోళరాజ్యమున, నాకారణమున చోళసామ్రాజ్యరక్షణసాధనకై, రెండు రాజకీయవర్గము లేర్పడెను. ఇమ్మడి రాజరాజ చోళునకు ప్రతికూలు రెక్కువయిరి. అతనికిని అతని కుటుంబమునకును ప్రాణభయముకూడ వాటిల్లెను. ఆనాడు వృత్తాంతములు ఎట్లు నడచెనో తెలుపుటకు తగినంత సాధనసామగ్రి లేదుగాని, దొరకిన పల్లవ రాయ శ్వేట శిలాశాసనమును[1] బట్టి, ఆనాడిట్లు జరిగి యుండునని యూహింపవచ్చును. ఇమ్మడి రాజ రాజుకు చిరకాలము పుత్రసంతతి లేనికారణమున తన యనంతరము రాజ్యభారము బూనుటకు విక్రమ చోళ చక్రవర్తికి పౌత్రుడును, నెఱియుడై పెరుమాళ్ళకు పుత్రుడును తనకు దాయాదియు నగు ఎదిరిలి పెరుమాళ్లను, గంగయికొండ శోళపుర నివాసియు నగువానిని స్వయముగా నాహ్వానించి, తన యనంతరము రాజ్యభారము బూనుటకు రాజాధి రాజను పేరుతో చక్రవర్తిగా నభిషేకించెను. అది జరిగిన కొంతకాలమునకు ఇమ్మడి రాజరాజచోళునకు వరుసగా నిద్దరు కుమారు లుదయించిరి. రాజరాజ చోళునకు రాజాధిరాజునకు ప్రబల వైరము సాగి దేశోపద్రవకారణముగా పరిణమించకుండ, రాజరాజ చోళుని మామ, పల్లవరాయరు, ఉభయులకును పొత్తు గూర్చి, సఖ్యము నిల్పెను. ఇమ్మడి రాజరాజు సకుటుంబముగ, సపుత్రకముగ, దుర్మరణము వాతఁబడ కుండ కాపాడి సురక్షితమయిన తావునకు జేర్చెను. అది మొదలుకొని, అనగా క్రీ. శ. ౧౧౬౬ సంవత్సరము మొదలుకొని, యిమ్మడి రాజరాజ ఇమ్మడి రాజాధిరాజదేవరలు సౌజన్యముతో రాజ్య పాలనము చేసిరి. రాజాధిరాజదేవరయొక్క వర్గమువారు ఇమ్మడి రాజరాజు క్రీ. శ. ౧౧౬౩ సంవత్సరమున మరణించినాడని దుర్వార్త ప్రచారము చేసిరి.[2] ప్రాయశః ఆ రాజచంద్రుడు ఒక విధమైన చెఱ ననుభవించుచు నామమాత్రముగ రాజ్యపాలనము చేసి యుండును. అతనికి మహాబలవంతుడును, స్వామిభక్తి పరాయణుడు నగు వెలనాంటి వీరరాజేంద్రచోళుని సాహాయ్యసంపత్తి యుండెను. అందువలన రాజాధి రాజుగాని యాతని సామంత రాజలోకముగాని, యిమ్మడి రాజరాజచోళుని కట్టె యెగ్గును తలపెట్ట జాలకపోయిరి. ఇమ్మడి రాజాధిరాజుతోపాటు, ఇమ్మడి రాజరాజచోళుడును చోళమండల సామ్రాజ్యమును పరిపాలించి, క్రీ. శ. ౧౧౭౩ వ సంవత్సరమునందు విజయరాజ్యవర్షములు ౨౭ వ యేట మరణించెను.

ఇంక నంధ్రదేశమున వెలనాంటి ఇమ్మడి గొంక రాజు క్రీ. శ. ౧౧౬౧ సంవత్సరప్రాంతమున మరణించెను. అంతట నాతని కుమారుడు వీరరాజేంద్ర చోడుడు, నిరాటంకముగ అంధ్రదేశాధీశ్వరుడయ్యెను. వెలనాంటి వీరరాజేంద్రుని పట్టాభిషేకాదులు నిర్విఘ్నముగ ప్రశాంతముగ జరిగిపోయెను. కాని యా పట్టాభిషేకము జరిగిన అనతికాలమునకు దేశము నందు అల్లరులు ప్రారంభమై అశాంతి కలిగించెను. కాని వీరరాజేంద్రచోడుడు, పట్టాభిషిక్తుడగుటకు పూర్వము, ఇంచుమించుగా పండ్రెండు సంవత్సరములకాలము తండ్రితో కలిసి రాజ్యభారము బూని యుండిన కారణమునుబట్టి ఆ యల్లరులను స్వామిభక్తి పరాయణులును దక్షులు నయిన దండనాయకుల సహాయమున అతి త్వరితకాలమున అణిచివేయగల్గెను.

వెలనాంటి వీరరాజేంద్రచోడుని కాలమున మహేంద్రగిరి, కాళహస్తిగిరుల నడుమ నున్న పూర్వాంధ్రదేశము, వెలనాంటివంశము వారి పరిపాలన మందుండెను. వీరరాజేంద్రచోడుడు క్రీ. శ. ౧౧౬౧ మొదలుకొని యించుమించుగా ౧౧౮౧ వఱకు, ఇరువదియేండ్లు రాజ్యపాలనము చేసెను. అతడు ఇమ్మడి రాజరాజచోళునిమాత్రము తన యేలికగా గౌరవించి నాడుగాని, యాతని యనంతరము యిమ్మడి రాజాధి రాజును తన చక్రవర్తిగా పాటించలేదు. ఒకవిధముగా క్రీ. శ. ౧౧౭౮ నుండి మహామండలేశ్వర వెలనాంటి వీరరాజేంద్రచోడుడు సర్వస్వతంత్రు డయ్యెను. చోళచాళుక్య చక్రవర్తులయెడ అభిమానము స్వామిభక్తిగలవారు మాత్రము, అక్క

1. ఎపి. ఇం. సం. ౪౧, పుట ౧౮౭.

2. పూర్వోక్తమయిన పల్లవరాయ శ్వేట శిలా శాసనము.

దక్కడ నుండుచు ఇమ్మడి రాజాధిరాజును ఆతని తరువాతివారలను నామమాత్రముగ స్మరించు చుండిరి.

శకవర్షము ౧౦౮౫ సుభాను సంవత్సరారంభ మున (మార్చి నెల క్రీ. శ. ౧౧౬౩) గోదావరి మండల మున ఉభయగోదావరులనడుమనున్న కోనసీమయందు, విప్లవములు పుట్టెను. కోన 1 లేక కోనసీమను అనాడు హైహయవంశజులు సామంత నృపచిహ్నములతో పరిపాలించుచుండిరి. ఆ సామంత హైహయవంశము చాళుక్యచంద్రుడైన శక్తివర్మ (౯౯౯-౧౦౧౧) నాడు, ఆ చాళుక్య చక్రవర్తికి పాదపద్మోపజీవులయి, బాసటలై నిలచి ఖడ్గసహాయ్యము చేసికోన సీమను సామంత నృపచిహ్నములతో మాండలిక ప్రభుత్వ మును సంపాదించి యుండురు. కోనసీమకు గౌతమీ వసిష్ఠ గోదావరులును సాగరమును సీమలు. హైహయులు అత్రేయ గోత్ర వంశజులు. 2 ముమ్మడి భీముడను హైహయ నృపునిచే నిర్మితమైన ముమ్మడి భీమవరము వారికి రాజధాని. నేడాయూరు ముమ్మిడి వరమని బరగుచున్నది. దానికి మాహిష్మతీపురమని కూడ నొక పేరు గలదు. చక్రవర్తి మొదటి కులో త్తుంగచోడదేవుని పాదపద్మోపజీవుడైన మహామండ లేశ్వరకోన రాజేంద్రచోడుని మరణానంతరము కోన హైహయులు రెండువంశములుగా విడిపోయిరి. అది క్రీ. శ. ౧౧౩౪ వ సంవత్సరము తరువాత జరిగెను.3 ఒకవంశమువారికి ముమ్మడివరమును, రెండవవారికి పల్వల (పలివెల) పురమో, తాటిపాకయో రాజధాను లయ్యెను. కోనరాజేంద్రచోడుని యన్న మనుమడైన లోకరాజు పుత్రవిహీనుడయి, క్రీ. శ. ౧౧౬౦ ఆ ప్రాంతమున చనిపోయెను. ఆతని రాజ్యభాగమును, ఆతని దాయాది భీముడనువాడు సత్యరాజుకుమారుడు బలాత్కరించి యాక్రమించుకొనెను. దాయవిభాగ ధర్మమునననుసరించి లోకరాజు రాజ్యమండలము కోన రాజేంద్రుని ఇతరకుమారులకు వారి సంతతికి సేతిరాజుకు నాతని తమ్ముడు మల్లిదేవుడు మొదలయినవారికి — రావలసియుండెను. అంతట దురాక్రమణచేసిన భీమునికి, ధర్మశాస్త్రమునననుసరించి కర్తలయిన సేత రాజాదులకును వైరము పెరిగి అంతః కలహములు భయంకరరూపమును దాల్చెను. వారిలో వారికి పొత్తు కుదురని కారణమువల్ల అంతః కలహములు పెరిగి దేశ మును అల్లకల్లోలపరచుటవల్లను, మహామండలేశ్వర వెలనాంటి వీరరాజేంద్రచోడుడు కోనసీమలోని అల్ల రులను మాన్ప బూనుకొనవలసి వచ్చెను. అంతఃకలహ ములును, తత్ఫలితముగ సంభవమైన సంగ్రామములను సాగకుండచేయుటకు వెలనాంటి ఇమ్మడి రాజేంద్ర చోడుడు తన సేనానులలో నొక బ్రాహ్మణ చమూ పతిని, అమృతలూరి మంత్రిన మంత్రికుమారుని దేవన ప్రెగ్గడను నియోగించి పెద్దసేననిచ్చి కోనసీమకు బంపెను. అది శ. ౧౦౮౫ కు సరియైన క్రీ. శ. ౧౧౬౩ చైత్ర జ్యేష్ఠమాసములందు (మార్చి-మేయి) బంపెను.4 కోనసీమ దండయాత్ర ఇంచుమించుగా మూడేండ్లు నడచెను. చివరకు దేవనప్రెగ్గడ కోనసీమ సాధించెను. వైరములు మాన్పెను. దురాక్రమణ చేయబడిన సీమను ధర్మశాస్త్రానుసారము కర్తలయినవారికి వశ పఱచెను.

చమూపతి దేవనప్రెగ్గడ శ. ౧౦౮౫ సంవత్సరము చైత్రమాసమున మేషసంక్రమణ విషువత్పుణ్యకాల మున సోమవారము నాడు తన యశస్సుకొఱకు కర్పూర వర్తితో అఖండదీపదానమును శ్రీ భీమేశ్వర మహా దేవునికి సమర్పించెను. మరియు మాత పున్నాగ రంభా జంబీర ఫలపుష్ప వృక్షములతో నిండిన యొక ఆరామమును మూల్యం పెట్టికొని సమర్పించెను. ఇది క్రీ. శ. ౧౧౬౩ మార్చి ౨౪ సరియగుచున్నది. దాక్షా రామమునుండి దేవన ప్రగ్గడ కోనసీమకు బోయెను. అక్కడ అల్లరులు లేవదీసిన "దాయాదు"లను రణరంగ మున నోడించెను. కోనభీముడు మొదలయినవారిని సంహరించెను. తప్పేలిన మహామండలేశ్వర వెల నాంటి కులోత్తుంగ రాజేంద్రచోడు (వెలనాంటి వీర రాజేంద్రచోడుడు)ని శత్రువుల దేశమును దహించెను.

---

1. కోనసీమను 'కోన' సీమ యనుటకంటె "క్రోన" సీమ యనుట యొప్పును. కడు ప్రాచీన కాల మున రెండువేలయేండ్లనాడు ఆంధ్రదేశమున కొనసీమ 'క్రోన'యం దుండెను. అదిగాక నది గోదావరికి అది 'క్రోన'యందున్న సీమ గావున "క్రోనసీమ" యయ్యెను.

2. ఈ హైహయ క్షత్రియ వంశజుల చరిత్ర మరియొకప్పుడు విస్తరించి వ్రాయగలను.

3. పిఠాపురం కుంతీ మాధవస్వామివారి ఆల యమునున్న కోనమన్మసత్యరాజు శాసనము (ఎపి.ఇం. సం ౪. పుట ౮౫ నుండి) హైహయుల చరిత్రకు ముఖ్యాధారము.

4. ఈ వృత్తాంతమును దెలుపు శాసనములు రెండు, దాక్షారామ భీమేశ్వరునియాలయమందుగలవు. *S. I. I. Vol. IV.* నెం. ౧౦౮౩, ౧౦౮౬. వీటి లోని వాక్యములనెత్తి ముందు ముందు ఉదాహ రింతును.

కాప్పసింధువు అని పేరు గల పలివెలపురమునందు ... ఏమేమో కార్యకృత్యములు వెలిపెను. మృగపతి కార్యము గల దేవనప్రెగ్గడ, "శ్రీమన్మహామండలేశ్వర కులోత్తుంగ రాజేంద్రచోడయరాజుల ప్రధాని దేవన ప్రెగ్గడ కోన సాధించ్చివచ్చి, శ్రీ భీమేశ్వర మహాదేవునికి కర్పూరవర్తిగా" అఖండదీపమును పెట్టెను. ఆ దానమును శ. ౧౦౮౭ సంవత్సరమున మార్గశీర్ష పున్నమినాడు చంద్రగ్రహణసమయమున సమర్పించెను. ఆ గ్రహణము ఇంగ్లీషు తేది నవంబరు ౩౦, ౧౧౬౫ నాడు పట్టెను. ఈ రెండు శాసనవాక్యములనుబట్టి చూడగా కోనసీమపై దండయాత్ర క్రీ. శ. ౧౧౬౩ మార్చి మొదలుకొని ౧౧౬౫ జనవరిలోపుగా రెండుసంవత్సరముల కాలముబట్టెనని తెలియుచున్నది. ఈ దండయాత్ర చోళచాళుక్యచక్రవర్తి రాజరాజదేవర విజయరాజ్య సంవత్సరములు ౧౭-౨౦ ల మధ్య జరిగి యుండినట్లు దాక్షారామశాసనములు దెలుపుచున్నవి.

కోనమండలమున అల్లరులు చెలరేగిన కాలము నాడే వేంగీ మహీరాజ్యమునకు పడమటి సీమలందు,—కుంతలేశ్వరుని సామ్రాజ్యమందున్న తెలంగాణమునందు,—కర్ణాట సేనానుల దండయాత్రలు కూడ సాగెను. కర్ణాట సామ్రాజ్యము అల్లకల్లోల స్థితియందుండెను. త్రైలోక్యమల్ల నూర్మడి మూడవ తైలపదేవుడు క్రీ. శ. ౧౧౬౨ సంవత్సరమున పదచ్యుతుడయ్యెను. అతని సామంతుడు, మహామండలేశ్వర కళచురి బిజ్జలరాయడు, కర్ణాట సింహాసనము నాక్రమించుకొని, చాళుక్యతైలపుని త్రోసివైచి, కుంతలేశ్వరుడయ్యెను. ఆ యదను చూచుకొని కర్ణాట మహామండలేశ్వరులు కుంతల రాజ్యమునకు తూర్పుననున్న తెలుగుసీమలందు జొచ్చి, బిజ్జలరాయని విధవమును, విజయమును జూచుకొని, తాముకూడ స్వతంత్రరాజ్యములను స్థాపింపతలచిరి. కాకతీయు లింకను బలవంతులు కాలేదు. రెండవ కాకతిప్రోలరాజు, త్రైలోక్యమల్ల నూర్మడి తైలపదేవునికి ఇష్టభృత్యుడైన సామంతమాండలికుడు. తైలపదేవుని యనుగ్రహము సంపాదించి, అనుమకొండ విషయమును సామంత నృపచిహ్నములతో బడయగల్గెను.1 బిజ్జలరాయనికిని నూర్మడి తైలపదేవునికిని జరిగిన యుద్ధములందు స్వామిభక్తి పరాయణుడై నిలచి, రణక్షేత్రమున మరణించి యుండును. అతని వెనుక, సింహాసన మధిష్ఠించిన యాతని కుమారుడు రుద్రదేవుడు కర్ణాట సామ్రాజ్యములందు చెలరేగుచుండిన విప్లవమును గాంచి, బాలుడగుటవలన గాబోలు ఏమియును చేయనోపకయున్నకుండియుండును, అట్టి తరుణమున యెలుబరిగ సింధువంశజులును, కొందత్తి రట్టవంశజులును ఏకమై పరరాజ్య వైభవశ్రీలను అపహరింప దలపడిరి. యెలుబరిగ పురాధీశ్వరుడయిన మహామండలేశ్వర చావుండరాయడు, కలచురి బిజ్జలరాయనికి బావమఱది యగుటచేత2 అతని సాహాయ్యమును ప్రాపును జూచుకొని చౌండరాయడు వెలనాటి వీరరాజేంద్ర చోడుని రాజ్యముమీదికి కర్ణాటసేనలను గూర్చుకొని దండెత్తి వచ్చెను. కర్ణాట సైన్యమందు ముప్పదివేల కాల్బలమును, కొన్నివేల గుఱ్ఱములు, వందలకొలది ఏనుగులునుండెను. ఆ మహాసైన్యము నెదిరించి వెలనాంటి రాజ్యమున కలిగిన మహావిపత్తును తొలగజేయు భారము వెలనాంటి వీరరాజేంద్రుడు తనకు మహాప్రధానియు, సంధివిగ్రహియు, సమర కార్యకాండుడునగు నండూరి కొమ్మనమంత్రిపై నుంచెను. కొమ్మనామాత్యుడు నండూరి గోవిందన మంత్రికుమారుడు. బహుళ సైన్యసమేతుడయి ఎదురేగి కొమ్మన మంత్రి కర్ణాట సేనలతో క్రొత్తచెర్ల పరిసరభూమియందు తలపడెను. క్రొత్తచెర్లకు, చెఱువులకోటయనియు, క్రొత్త చెఱువుల కోటయనియు, ఇతర పేర్లు.3 ఆ గ్రామము వినుకొండకు సమీపముగానున్నది. ఆ మహాసంగ్రామమున కొమ్మనామాత్యునికి అఖండవిజయము సమకూరెను. ఆ కథను మంచెన కవి కేయూరబాహుచరిత్రమున నిట్లు వర్ణించి యుండెను.

క. దలము మెయిఁగటక సామం
తులుఁ గరిహయ బహులసేనతో సేతేరన్
దలపడిరొకఁ గొమ్మ సచివుడు
బలియుండై క్రొత్తచెల్ల పరిసరభూమిన్.

మృగరాజ పరాక్రముడైన కొమ్మన దండనాథుని కార్యకృత్యములు, మంచెకవి అత్యద్భుతముగా వర్ణించినాడు.

1. డా. శ్రీనివాసాచారిగారి తెలింగాణపు శాసనములు ౫, ౬, నంబర్లుగల హనమకొండ శిలాశాసనములు.

2. చావుండ (చౌండ, లేక, చాముండ) రాయని దేవి సిరియాలదేవి బిజ్జలరాయని తోడబుట్టువు. *J. Bom. By. A. S.* సం. ౧౧. పుట ౨౫౯.; *Dynasties of The Kanarese Distriots, p.* ౪౬౬. చాళుక్యరాజ్యము కూలుటకును, బిజ్జలరాయడు కర్ణాట సింహాసన మధిష్ఠించుటకు చౌండరాయడు తోడ్పడియెను.

3. క్రొత్త చెఱువులకోట కొంత కాలమునకు కొచ్చెర్లకోట అయ్యెను.

పెలకట్టెవాటునఁ జెలఁగి రెంటెని మాఁటి
గూడ గుజ్జంబులు గుదురు గ్రుచ్చుఁ
బ్రతిమెంగంజగు నరపతుల కత్తికమునఁ
గడిమిమై వీఁపులు వెడలఁ బొడుచుఁ
బందంపు గోజీయల పగిది నేమంగుల
ధారసద్దిగ నసిధారఁదునుముఁ
జెదియించుఁ బగిలించుఁ గేతుల తీటవో
వడిఁగాండ వేసి మావఁతుల తలలు
తల పుడికి వ్రేసి మావంతుల తలలు శత్రు
రాజ శిరములుఁ ద్రొక్కించు రాఁగ దిరుగ
బాగనుబ్బెడు తన వారువంబుచేత
మహిత శౌర్యుండు కొమ్మనామాత్యవరుఁడు.

క్రొత్తచెర్ల తేక చెఱువులకోట యుద్ధమునందు శౌర్యకృత్యములు నెఱపిన వారి ముప్వురి పేళ్ళు శాసనములందు కానవచ్చుచున్నవి. వారిలో వెలనాంటి ఇమ్మడి రాజేంద్ర చోడరాజుల సామంతుడును ధాన్యవాటీ పురవరేశ్వరుడు నయిన సమధిగత పంచమహాశబ్ద మహా మండలేశ్వర రాచూరి దారపరాజు ముఖ్యుడు.1 అతని శౌర్యకృత్యములను దెలుపు బిరుదు గద్య లనేకములుగలవు అతడు మహావీరుడు, ఏకాంగవీరుడు. "చాండరాయ చాణూరమురాంతక," చోడ కటక సామంతముంకోల్వ (?) రట్ట కటక సామంత— — —(?)" యిత్యాది బిరుదులు గలవా డితడు. చాండరాయడను వాడు సింధు వంశజుడును కలచురి బిజ్జలరాయని తోబుట్టువు భర్తయనుటకు సందియము లేదు. చందవోలు పండితేశ్వరదేవర వర్తకియు, మాహేశ్వర పరివార స్త్రీయగు సాక్కమకొడుకులు కామయ, నరణయ నాయకులుకూడ చెఱువులకోట రణరంగమున శౌర్యమూర్తులై విహరించి ప్రభువుకు విజయము గూర్చియుండిరి.2 "కొంకెఱువుల కోనుగణపతి సైన్యమును ఒడిచి, గాయపడి వీరస్వర్గము నలంకరించెను అతని తమ్ముడు వీరుడు నరణయ చాందకరాయని (చాండవరాయని)" వారిధి సొరనెగిచి, వైరివర్గమును జంపెను,3 ఈ చాండవ (చాందవ) రాయడను మహామండలేశ్వర రాచూరి దారపరాజు చంపిన చాండవరాయడను ఒక్కరే యనుదురు. నరణయ వీర భటుడు; దారపరాజు దండనాథుడు. ఆ వీరకృత్యమునకు ఉభయులును కర్తలే యనుదురు. కేయూరబాహు చరిత్రమందు, మంచెనకవి, మహామండలేశ్వర వెలనాంటి కులోత్తుంగ — రాజేంద్ర — చోడయరాజులయు వారిని ప్రధాని కొమ్మనమంత్రులయు, ఆనాటి చందవోలు వైభవములను ఈరీతిగా వర్ణించినాడు.

నవకోటి పరిమిత ద్రవ్యమే భూపాలు
భండారమున నెప్డు బాయకుండు,
నేకోన శతదంతులే రాజునగరిలో.
నీలమేఘము లీలఁ గ్రాలు,
బలవేగ రేఖ నల్వది వేల తురఁగంబు
లే నరేంద్రుని వాగె నెపుడుఁ దిరుగుఁ,
బ్రతివాసరంబు డెబ్బదియేను పుట్లునే
విభుమండల నెపుడుగల్గు,
నట్టి యధిక విభవుఁడగు కులోత్తుంగ
రాజేంద్ర చోడనృపతి కిష్టసచివ
తంత్ర ముఖ్యుఁడనఁగ మంత్రి, గోవింద
నందనుఁడు కొమ్మన ప్రధానుఁడొప్పు.

* * *

రమణీయమైన, గూర్మ గ్రామమున యందు
గురు గుత్తిపురమునఁ గ్రొత్తచెర్లఁ,
ద్రిపురాంతకమునఁజేర్చిన కొట్టిదోన, బొగ్గరమునఁ,
గళింగ రాష్ట్రములోని
రొలమంచిలాదిగా నెలమి ముప్పది రెండు
విష్ణు ప్రతిష్ఠలు వెలయఁజేసి
నిచ్చవేవురు మేదినీ సురవరులకుఁ
బంతి సద్భక్తితో బాయసంబు
తవర నిడుటరౌ జన్మవ్రతంబుగాఁగ
మనువు గడిపిన కొమ్మన మంత్రివరుని
బుద్ధిలోన బృహస్పతిఁ బోలువానిఁ
బోల గల్గుదురే ధర్మపురుషు లెందు.!

ఇమ్మడి రాజరాజ చోళుని కాలమును, ఆ రాజేంద్రుని సామంతుడైన మహామండలేశ్వర వెలనాంటి యిమ్మడి రాజేంద్రచోడని కాలమును దక్షిణాపథ చరిత్రయందు నూతన యుగ ప్రారంభకాలము. సాంఘిక పరిస్థితులు తారుమారయి, వర్ణాశ్రమధర్మములు సాంకర్యము చెందిన కాలమది. మతధర్మ పరిస్థితులు పూర్తిగా తల్లక్రిందయిన కాలమది. రాజకీయముగ చోళ, చాళుక్యవంశముల రాజ్యములు ఐశ్వర్యములు నాశనమొంది నూతన రాజ్యములు స్థాపితమైన కాలమది. ప్రాచీన యుగము అంతరించి మధ్యయుగ మారంభమయిన కాలమది.

---

1. *S I. I. Vol. IV No.* 1058. ద్రాక్షారామ శాసనమిది.

2. *S. I. I. Vol X No.* 151. తిమ్మాపురం (నరసారావు పేట తాలూకా.) శాసనము.

3. పూర్వోదాహృత ప్రమాణము:

ప్రాచీన శైవ, వైష్ణవ మతధర్మములు పూర్తిగా మారిపోయి వీరశైవ, వీరవైష్ణవాచారములను పొందెను. శైవబౌద్ధములు అంతరించెను. వాటిలో ముఖ్యముగ బౌద్ధము కొకటి వేళ్ళతో నూడబెలుకబడెను. వైదిక, పౌరాణిక బ్రాహ్మణధర్మము నూత్న మర్యాదను పొందెను. శైవమతమును కాపాలిక, భైరవాది తంత్రములనుండియు, భయంకర శైవాచారముల నుండియు తప్పించి భక్తిమార్గమున త్రిప్పుటకు ఆంధ్రకర్ణాట దేశములందు విశ్వప్రయత్నములు సాగెను. ఆంధ్రదేశమున మల్లికార్జున పండితారాధ్యుడును, కర్ణాటదేశమునందు బసవేశ్వరుడును అవతరించిరి. బ్రాహ్మ్యంబుపై పొత్తు బాయలేక పండితయ్య భక్తి ప్రధానమైన శైవమును బోధించెను. మల్లికార్జున పండితారాధ్యుడు వర్ణాశ్రమ ధర్మములు చెడరాదని శాసించెను. అతడు తన ధర్మమునందు విపరీతసిద్ధాంతము లేవియు ప్రతిపాదించి యుండలేదు. ఆనా డాంధ్రదేశమున ప్రబలియుండిన పరమ మాహేశ్వరవ్రతమును భక్తిమార్గమున నడిపింపదలపెట్టెను. అందుల కాతడు రాజాదరణమును అర్థించెను. అతని బోధలకు రాజాదరణము అనవసరమయ్యెను. ప్రజలే వర్ణాశ్రమ ధర్మముపై ఆధారపడి, వేదవిహితమైన శైవము, భక్తిమార్గమున ముడివడియున్న శైవము అతి త్వరితముగ ప్రజాహృదయము నాకర్షించెను. ఇక కర్ణాటదేశమున అట్లుగాకుండెను. అసహ్యకరమైన జినధర్మమును రూపుమాపి, వర్ణాశ్రమ ధర్మములును కూలంకషముగ నాశనమొనరించి వేదములను విడనాడి, కేవలము భక్తిమార్గమునే బోధించుచు, శివునికంటె శివభక్తు డధికుడని బోధించిన వీరశైవము వెలువడెను. దానిని బోధించిన మహానుభావుడు బసవేశ్వరుడు. అతడు కుంతలేశ్వరుడయిన బిజ్జలరాయని ప్రాపువడసి తన వీరశైవ ధర్మమును విస్తరింపజేసెను. మల్లికార్జున పండితారాధ్యునకు బసవేశ్వరుని వీరశైవము పూర్తిగా సమ్మతిగాకుండెను. భక్తితో గూడిన తన విశిష్టాద్వైత శైవధర్మమునకును, వర్ణాశ్రమ ధర్మనాశన హేతుకరమును వేదబాహ్యమునగు బసవేశ్వరుని వీరశైవమునకు సామరస్యము కలిగింపజాలెను మల్లికార్జున పండితయ్య. బసవేశ్వర, మల్లికార్జున పండితయ్యల సమావేశము సంభవింపలేదు. మల్లికార్జున పండితయ్య బోధించిన శివధర్మమునందు పరమేశ్వరుడైన శివునికిని, ముక్తి గోరిన జీవునికిని నడుమ భక్తితప్ప వేరొకటిలేదు. అట్లుగాకుండెను బసవేశ్వరుని వీరశైవమందు. పరమేశ్వరుడగు శివునికంటె ముఖ్యుడు అతని నందివాహనాంశముగల బసవేశ్వరుడు. వానికంటెను ముఖ్యుడు శివభక్తుడు. శివునికంటెను శివభక్తుడు గొప్పవాడు. శివభక్తుని పూజించిన భవునికే ప్రీతియని బసవేశ్వరుని బోధ. బసవేశ్వరుని బోధ అవైదికము. కర్ణాటదేశ ప్రజలకు బసవేశ్వరుని బోధ ఆదరణీయమై వెలసెను. అందువలన విపరీతములు, విప్లవములు పుట్టెను. దేశము సంక్షుభితమై రానున్న కాలమున కర్ణాటదేశము క్షీణదశకు దీక్షి కొనివచ్చెను. పండితయ్య ఆంధ్రదేశమునకు జేయదలచిన యుపకారమును చేయగల్గియు, బసవేశ్వరుని కలుసుకొన జాలమికి వగచుచు శ్రీశైలమునకు బోవుచు మార్గమధ్యమున అసువులను విడచెను. బసవేశ్వరుడు క్రీ. శ. ౧౧౬౭ ప్రాంతమున ప్రాణములను విడచెను. అటుతరువాత అచిరకాలమునకే తనువు చాలించెను మల్లికార్జున పండితారాధ్యుడు.[1] ఆంధ్ర కర్ణాట దేశములను ఘూర్ణిల్ల చేసిన మతసాంఘిక విప్లవములు చోళమండలమును గూడ కలచివై చియుండును. అట్టి సంక్షుభిత కాలమందు, క్రీ. శ. ౧౧౬౩ వ సంవత్సరారంభమున చాళుక్య చోళ చక్రవర్తి రాజరాజ చోళుడు మరణించెను.

వెలనాంటి వీరరాజేంద్ర చోడుని ఒక దానము దెలుపు తామ్రశాసనము బాపట్ల తాలూకా నండూరు గ్రామమున లభించెను.[2] అం దాతని ప్రశస్తి కొంతగలదు. అది యిమ్మడి రాజరాజ చోళుని ౩౩ వ విజయరాజ్య వర్షమగు శ. ౧౦౮౫ వ సంవత్సరము (క్రీ. శ. ౧౧౬౩) నాటిది. వెలనాంటి వీర రాజేంద్ర చోడుడు నొక పుణ్యదినమందు, చందవోలు అని రెండవ పేరుగల ధనదు పురరాజధానియందుండి, ఇనుంగల్లు గ్రామమును వేదవేదాంగ పారగుడును, మీమాంస శాస్త్రజ్ఞుడును, షట్తర్క శాస్త్రవేత్తయును నొక విప్రముఖ్యునికి సర్వకర పరిహారముగ అగ్రహారముచేసి ఉదకపూర్వముగ దానముచేసెను. ఆ బ్రాహ్మణ పండితుని పేరును వంశ, గోత్రాదికముల వివరములును తెలియరాకుండ పోయినవి.

1. పండితారాధ్యుని గూర్చి వివరములు తెలుసుకొనగోరువారు అతడు రచించిన *శివయోగసారమును*, పాల్కురికి సోమనాథుడు రచించిన పండితారాధ్య చరిత్రను (ఆంధ్ర పత్రికా గ్రంథముల) చూడ వచ్చును.

2. *C. P. No. 23 of 19170. A. R. E, 1917, p. 148.*

నందూరు గ్రామమునకు సమీపముగా నున్న ఇను గుర్తిపాడు గ్రామమే వాటి ఇనుంగళ్లు అగ్రహారము.

ఇమ్మడి రాజరాజ చోళుడు మరణించిన తరువాత, యిమ్మడి రాజాధిరాజు ఏదారేండ్లు మాత్రము సర్వస్వతంత్రుడయి చోళమండలమును మాత్రము పరిపాలించెను. ఆంధ్రభూమి సొంతకు రాలేదు. దానికి కారణము లనేకములు గలవు. వాటిలో ఇమ్మడి రాజరాజ చోళుని కుమారుడయిన మూడవ కులోత్తుంగ చోళుడు యుక్తవయస్కుడయి రాజ్యాభిలాషతో రాజాధిరాజుకు ఒత్తిడి కలిగించినది యొక కారణము కావచ్చును. ముమ్మడి కులోత్తుంగ చోళదేవుడు రాజాధిరాజు మరణించిన వెంటనే పట్టాభిషిక్తుడయి రాజ్యపాలనము ప్రారంభించెను.

---

# మునిమాపు చూపు



శ్రీ బొడ్డు బాపిరాజు

కాంచన వేణుదండమును కమ్మనిరాగము పల్కుమంచు నం
దించితి వయ్య, నన్ను కరుణించియు; ప్రాణములైదు నూదిమ్రో
యించితి మోహనస్వరము లే! హృదయమ్మును దాచి, లోకమున్
వంచనబుచ్చి యల్లుకొని నానొక బంగరు సాలిగూటిసన్.

విస్తృత జీవనాబ్ధి వలవేసితి కోర్కుల గండుమీలకై
యస్తమయమ్ము దాక;- వెలుగార్చిన చీకటిజాడ శూన్యసహా
హస్తముతోడ సాగుచు నిరాశల మూక గళమ్మునన్ విశ
ర్యస్త విషాదగీత వికల స్వనముల్ పలికింతునో ప్రభూ!

అమృతపాత్ర కెంబెదవి యంచులమోపి, తదీయ హేమ వి
భ్రమముల సొక్కి - లోని మధురాసవముం జవి చూడలేక కా
లము వృధసేయు వెఱ్ఱిని! అలౌకిక భవ్యకళాగిరీంద్ర శృం
గముల నిల్చి జారితి నగాధములైన పసిండి లోయలన్!

---

# మంగళగీతములు



'కృష్ణశ్రీ'

గృహశ్రీ కవనములో గృహిణి ప్రేమాభిమానాలు చక్కగా బింబిస్తాయి. తన యిల్లూ, తనవాకిలీ, తనబిడ్డలూ, తన సంపదా మాత్రమే ఆ కవనములోని వస్తువు. 'గృహిణి ఆత్మగతము' అని పేరుపెట్టినా చెల్లుతుంది ఆ కవిత్వానికి. జీవితయాత్రలో వినోదోత్సవ సమయాల్లో స్త్రీలు పాడే పాటల్ని మంగళగీతాలంటున్నాము. ఇరుగు పొరుగింటి సుమంగళులూ, ఇతర ఆహూతులూ పరివేష్టించినప్పుడు పాడే పాటలు కేవలము ఆ యింటి సౌరభాన్నే వెదజల్లేవి కాకుండా, అలాంటి శుభసమయాల్లో ఏయింట్లో పాడినా రాణించేటట్లుండాలి. అలా గని హృదయ స్పర్శే లేకుండావుంటే అతి సామాన్యములైపోయి ఎవర్నీ పలకరించవు. ఒకవైపు ఉత్సవ ప్రత్యేకతనీ ఇంకొకవైపు సార్వజనీనతనీ పోషించుకుంటూ సాగిపోవాలి ఈ పాటలు. ఈ సుందరాశయాన్ని ఎలాగు సాధిస్తారో పరిశీలిద్దాము.

పురుషుని ఆదర్శాలకీ స్త్రీ ఆశయాలకీ చాలా తేడావున్నది. పురుషుడు 'యేలో యేలో ఎటకో' జలదాలదాటి తారకల వినీల పథరాజాలనెల్ల నతిక్రమించి చదలేటి తుషారపు స్వప్నరాసులలో, కలిసిపోవాలనీ విశ్వమంతా వ్యాపించి పోవాలనీ ఆశిస్తే, గృహలక్ష్మి విశ్వమంతటినీ—విశ్వనాథునితో పాటు — లుమ్మచుట్టి లాగుకొనివచ్చి తనయింటిలో ప్రతిష్ఠించాలని ఆశిస్తుంది. పురుషుడు భావనా బలమువల్ల తన (యింటి) అనుభవాల్ని పెంచి అతిలోక దృశ్యాల్ని నిర్మిస్తాడు,—స్త్రీ తన అభిమానబలమువల్ల స్వర్లోక వాతావరణాన్ని తన యింట్లో కుప్పకూరుస్తుంది. మంగళగీతాల్లో ఈ ప్రయత్నమే చక్కగా గోచరిస్తుంది. తన బిడ్డ (యే) అచ్యుతానందుడూ, ముకుందుడూను. బ్రహ్మాండమంతా తన యింటిలొట్టి; నాలుగు వేదాలూ గొలుసులు; బలుదైన ఫణిరాజు పాన్పు; 'తత్త్వమసి' యే చలువ వస్త్రపు మసెత. అందులో పాపణ్ణి యేర్పాటుచేసి యేడులోకముల వారూ (పేరంటాండ్రు) యేకమై పాడాలి. పురుషుడు 'ఎక్కడున్నావయ్యా స్వామీ' అని లోకమంతటా తిరిగి అన్వేషించే పరమాత్మణ్ణి, స్త్రీ తన ప్రేమాభిమానాల్ని గుత్తకొన్న పాపడిలో గుర్తించుకుంటోంది. తన ప్రేమ మాధుర్యాన్ని భక్తితో రంగరించి విశ్వేశ్వరుడికి నివాళిపట్టుతోంది. ప్రేమా, భక్తీ అనే అందపు భావాల సమ్మేళనమువల్ల ఆవిర్భవించిన ఈ మంగళగీతాలు ఏ యింటిలో పాడినా అక్కడికక్కడ చక్కగా అమిరిపోతాయి. కనక వీటిలో సార్వజనీనతే ఎక్కువపాలు. ఇక ఈ ఉత్సవమూ, వినోదమూ తనయింటివి. ఎదురుగా ఊయెలా, గొలుసులూ, పానుపూ, చలువ మసెతలూ, పాపడూ తన స్వంతము. వీటన్నిటివల్లా ఆ పాటకి ప్రత్యేక వాస్తవికత సమకూడుతుంది.

లాలిపాటలూ జోలపాటలూ పరమేశ్వరాంకితాలే. బిడ్డని ఉయ్యాలలో పెట్టి పేరంటాండ్రందరూ చుట్టూ కూర్చుని పరమేశ్వరుని విభూతిని ఈ పాటలలో కీర్తిస్తారు. 'కృష్ణజననము' పాటే ఈ ఉత్సవములలో సామాన్యముగా వినిపిస్తుంది. ఇది సుదీర్ఘమయిన 'పాట', వినోదోత్సవము జరుగుతూన్నంత సేపూ సాగుతుంది. అంటే బిడ్డని తొట్టిలో పెట్టడమన్నది బీజప్రాయమై పుణ్యపురుషుల జననోత్సవకీర్తనకి దోహదము చేస్తున్నదనమాట. కృష్ణజననమూ, మార్కండేయ జననమూ, మేనకాదేవి నొప్పులూ, సీతపుట్టుకా, అన్న పాటలు జననోత్సవాలకి చెందేవే. వీటిలో సీతపుట్టుక అన్నది నాకు లభించలేదు. మార్కండేయ జననమును వీరశైవులు ప్రత్యేకంగా రచించుకున్నారనిపిస్తుంది, దానిలోని శైవ వాతావరణము గమనిస్తే. మృత్యువు నతిక్రమించిన వాడయ్యె! మానవులలో అతనికంటె ఘనులెవ్వరూ?

పుట్టుక మొదలు పెండ్లిదాకా ప్రత్యేక మంగళగీతాలు పాడవలసిన వినోదోత్సవాలు కనపడవు. భోగి పండ్లు పోసినప్పుడూ, పుట్టినరోజు పండుగలకీ వచ్చిన పేరంటాండ్రు ఎవరికి వచ్చిన మంగళహారతి వారు పాడతారు. ఈ మధ్య అల్లిన పాట ఒకటి భోగిపండ్ల పాట దొరికింది :

శశిముఖులారా రారే! మా పసిబాలలకు భోగి పండ్లు పోయుదాము॥ మంగళాకారులు మదన సుందరులు రంగుగ పీటపై రాణింపుచున్నారు॥ అన్నవి ఆ

పాటకు పల్లవీ, అనుపల్లవులు. ఇది 'ఇకనే మందునే చెలియా' వరసలోని పాట. 'వెంకటశివగురుడు'ట దీని రచయిత. పుట్టినరోజు పండగలకే కాక ఏ ఉత్సవానికైనా పాడే మంగళహారతులు వేలమీదుంటాయి సేకరిస్తే. కేశవనామాలూ, వినతులూ, అను ప్రాసాలతోచేరి కనపడతాయి ఈ పాటలలో. పురుషులు రచించిన వాటికి చివ్వరి చరణములో పేరుంటుంది. స్త్రీల రచనలలో ఈ బడాయి కనబడదు. కృష్ణుడి అల్లరిని వర్ణించేపాట ఇది వినండి. "పోయిరాగదమ్మ జానకీ" వరుస: "బూచివాని పిలువనంపనా, గోపాల కృష్ణా!॥ మత్తగజము తెచ్చి చిన్న, తిత్తిలోన పెట్టి అదినా, నెత్తిమీద పెట్టిన, స్నేత్తుకోవె (య) శోద యందు॥ బూచి॥" వ్యాఖ్యాన మనవసరము! యశోద పాడినట్లున్నదే ఇంకొక పాట వినండి. "కాళింగ మడుగూ దగ్గరి పోకుమా। కృష్ణ॥ కాళింగి మడుగూ లోన ఘనమైన పామున్నాది। బాలూని కరచేనట పామూ దాసున్నా దట॥ కాళింగి॥ మత్స్యావతార మూన, ముద్దూ సోమాకుద్సంచి, తెచ్చీ వేదాలు బ్రహ్మ, కిచ్చీన చిన్ని కృష్ణ॥ కాళింగి॥ ఇది 'ఆనంద మానంద మాయెనూ' అన్న మంగళసూత్రం పాట వరస. అవతారాలు వర్ణించడానికి పాటలోని బెదిరింపు ఒక సాకు. కృష్ణావతారంతో ఆగదుపాట! బుద్ధ కల్క్యవతారాలు కూడా ఏకరువు పెట్టుతుంది. ఇంతకంటె ఒకమెట్టు పైకెక్కుతుంది యశోద కొంగ పాట. బాలకృష్ణుడే ఏకరువు పెట్టాడు తన అవతారాల్ని అన్నిటినీ!

'పెండ్లి' అన్నమాట అనగానే పాటలు గలగలమంటాయి నేపథ్యంలో. పెండ్లికోసము చేసే సన్నాహముతో పాడే ఆడపిల్లలు పాటలు వర్ణించడము కూడాను! ఎవరెవరు కంఠాలు కలిపి ఏ పాటలు పాడాలో వరసలు వేశేసుకుంటారు ఈడు వచ్చీరాని పిల్లలు. పెండ్లికూతుర్ని చెయ్యడముతో ప్రారంభము! ఎన్ని రకాల మంగళహారతులైనా వినిపిస్తాయి. 'అనసూయా దేవికి మంగళం జయమంగళం మంగళం,' 'మంగళంబో శంభురాణీ మానినీ ఓ పువ్వుబోణీ', 'వర్ధనమ్మ ఇదే మంగళం' అన్నవి ఆ వనమాలలోని మూడు పువ్వులు. నూటికి తొంభయి ఇవి ప్రశస్తులే. ఈ ఆఖరిపాట మాత్రము కొంచెము తత్త్వగంధము విసురుతుంది. ఇక కృష్ణుడి మీదా రాముడిమీదా, రంగడిమీదా, శివుడిమీదా ఉన్న మంగళహారతులకు లెక్క లేదు. ఇంటికొక మంగళహారతి వుంటుందన్నా అతిశయోక్తి అవదు. ఇవన్నీ ప్రశస్తులూ, లీలలూనూ.

ఈనాటి పాటలలో పల్లవీ అనుపల్లవీ చరణమూ అనే మూడుభాగాలూ వుంటాయిగానీ పూర్వకాలపు పాటలలో, రామదాసు రచన "రామచంద్రాయ జనక రాజజా మనోహరాయ మామకాభీష్టదాయ మహిత మంగళం" అన్న పాటలోలాగా జయదేవుడి అష్టపదులలోలాగా చరణాలన్నీ ధ్రువమ్ అనే పల్లవిలాగే ఉంటాయి.

పెండ్లి అవుతూవుంటే, అనగా మంగళసూత్రము కట్టుతూ వుంటే 'ఆనందమానంద మాయెనూ' అన్న పాట; సన్నాయీ బ్యాండూ పాటకులు పాడతారు. వధూవరుల్ని శేవదీసేముందు (కూము?) నరసింహదాసు రచించిన 'సీతాకల్యాణ మహోత్సవ సమయము చూతాము రారే చెలీ' అన్నపాట పాడతారు, సామాన్యంగా. కాని ఈ కల్యాణపు పాట లెన్నైనా వున్నాయి. వీటిలో సీతాకల్యాణమూ, పార్వతీకల్యాణమూ గంగా యమునల్లాగ ప్రవర్తిస్తాంటాయి. వివాహనిశ్చయమూ, యత్నమూ, తర్లిరావడమూ, పెండ్లి మండప వర్ణనా, పెండ్లితంతూ, సర్వమూ వర్ణిస్తాయి ఈ పాటలు. యతులూ ప్రాసలూ, అనుప్రాసాలూ జాస్తిగా వచ్చి పడుతూంటాయి వీటిలో. రంగు, తీరు, కోరి, వర, అనే మాటలకి ఈ పాటలలో ఆటవిడుపు. ఈ రకపు మాటలు కనపడకపోతే ఆపాట స్త్రీల రచనే అవవచ్చునేమో. 'వినవే శ్రీరాముల కల్యాణ చరితము కమలాక్షీ వివరించెద' అన్నది అలాటిదే.

పెండ్లి అయిన మర్నాటి ఉదయంనించీ వినోదాలదే హయాము. పళ్ళు తోమించువప్పటిపాట, ఉదయము వధూవరులకు పసుపు నలుగులు జరుగుతూన్నప్పుడు నలుగుపాటలూ, మధ్యాహ్నము బంతులాట పాటలూ, భోజనాలవేళ బువ్వముబంతి పాటలూ, వదినలను ఎగతాళిచేసే పాటలూ, వియ్యాలవారి విందుల వింతలు వర్ణించే పాటలూ జోరుగా వినబడతాయి. వీటన్నింటికీ వస్తువు ఆ సమయానికి జరిగే తంతులే, వెటకారముతో కలిసి వస్తాంటాయి. ఘాలీ సుబ్బారావుగారు ఇలాంటి పాట లెన్నో రాశారు. గొల్లపల్లి వెంకటప్పయ్య దాసువి 'నలుగు బంతులపాట' లున్నాయి. ఈ రకపు పాట లన్నిటా బువ్వము బంతిపాటలు ఎక్కువ ఆప్యాయమైనట్లు కనబడతాయి రచనల సంఖ్య గుర్తిస్తే. శ్రీ కృష్ణుడి బువ్వమూ, సీతారాముల బువ్వమూ, పరమేశ్వర బువ్వమూ, — చాలా పాట లున్నాయి. ఇన్ని వున్నాయి మళ్ళీ 'తలుపుదగ్గర పాటలు'. వధూవరుల్ని

తలుపు కటూ ఇటూ నిలబెట్టి పాడతారు వీటిని. ఈ పాటల్లో వారు పార్వతీ పరమేశ్వరులూ, భామా కృష్ణులూ, అలమేలుమంగా వెంకటేశ్వరులూ, లక్ష్మీ విష్ణువులూ అయిపోతారు. అన్నిటిలోనూ — ఒక్క శ్రీరాముడిపాటలో తప్ప (!) — నాయిక ఖండితే. స్వామిశరీరంపైని చిన్నెలేమిటని నిలవదీసి అడుగుతుంది. "చిటపట చినుకులు దుప్పటి తడిసెను తలుపు తీయవే భామా - నీవు - తలుపు తియ్యవే భామా" అని కిటతక కిటతక వరసని ఎనిమిది ఆవృతాల పాదమూ, దానివెంటనే వుండే నాలుగావృతాల చిరుపాదమూ కనపడతాయి వీటిలో. ఒక్కొక్క అక్షరానికీ ఒక్కొక్క స్వరం వచ్చే ఈ పాటలన్నీ నాలుగు శతాబ్దాలవాటివేనా అయివుంటా యనుకుంటున్నాను.

నాలుగోనాడు ఉదయము కొట్నములు దంచుతారు. ఈ వినోదపు దంపులో, రోకళ్ళ పోటుతో తాళము నడుపుతూ సువ్విపాట పాడతారు. తకిత తకిట తకిట తకిట అని మూడక్షరాల ఆవృతాలు పదహారుంటాయి వీట్లో. వీటి సరళగతీ, అక్షర స్వరాలూ వీటినికూడా 15 వ శతాబ్దానికి నెట్టడానికి సాయపడతాయి. బువ్వంపాటలూ, తలుపుదగ్గర పాటలూ, సువ్విపాటలూ, తకిట తకిట అని నడిచే (ద్విపదలేమో ననిపించే) ఒప్పగింతల పాటలూ రాగనిర్దేశ మేదీ లేకపోడమునించీ, గతి సారళ్యమునించీ, ప్రాచీనములే అనిపిస్తున్నాయి. లక్ష్మీ కల్యాణా సౌభాగ్యమే - గౌరి కల్యాణా వైభోగ్యమే అన్న పల్లవితో కిటతక కిటతక అనే ఎనిమిది ఆవృతాలతో నడిచే గౌరికళ్యాణం పాట కూడా పూర్వపు పాటే ననాలి. ఇది ద్విపదయొక్క వికృతి అనిపిస్తుంది పరాకుగాచూస్తే. కాని కాదు. ఈ పాటలన్నీ నడవవు, ప్రవహిస్తాయి. ద్విపద నడుస్తుంది. ద్విపదది అక్షర (గణ) ఛందస్సు. ఈ పాటలదిమాత్రా ఛందస్సు.

కట్నాలు, ఇస్తిరా, కానూ, కి స్తిరా
వట్టేపి, ల్లలకు మేము, వాచీ, రాలేదూ॥
అన్న పంక్తులు గణవిభజన చేస్తే
కట్నాలు ఇస్తిరా కానుకి స్తిర
వట్టె పిల్లలకూను వాచి రాలేదు॥

అని ఇంద్రగణాలతో, ద్విపదలేమో అనిపిస్తాయి. ఇక్కడ పాదానికి 18 లఘువులు లేలివనుకుందాము. పైన మొదట రాసినట్టే రాసుకుంటే

కిటతక కిటతక కిటతక కిటతక
కిటతక కిటతక కిటతక కిటతక

అని 16 అక్షరాల పాదాలతో నడుస్తుంది పాట! కట్నాలు, ఇస్తిరా, కానూకి, స్తిరా, వట్టేపి, ల్లలకు మేము, వాచీ, రాలేదూ, అన్న ఆవృతాలన్నీ నాలుగేసి అక్షరాలకాలమే నడుస్తాయి. వీటన్నిటినీ సమాన 'కాలము'లో పలకాలి పాటలో. ఇలా పలకడములో దీర్ఘాక్షరమూ హ్రస్వాక్షరమూ ఒకేకాలముతో వినబడతాయి. గణవిభజన కీరకపు సర్దుబాటు కుదరదు. గురువుని రెండు మాత్రల కాలము ఉచ్చరించి తీరాలి అక్కడ. కనక పాటల్లోని అక్షరాల్ని గురువూ లఘువూ అని పేరుపెట్టి గణ విభజన చెయ్యకూడదు.

సమర్తపాటలూ, సీమంతపుపాటలూ, వేవిళ్ళ పాటలూ కొన్ని ఉన్నాయి. జీవితములో ప్రతిఘట్టానికీ ప్రాముఖ్యత వుంది గృహలక్ష్ముల దృష్టిలో. రుక్మిణీదేవి సీమంతములో, తాను పిలిస్తే వచ్చి మొక్కిన శ్రీకృష్ణుడితో దేవకి అంటుంది:

'ఏమిర కృష్ణా యెన్నడు ఇంటికి రావూ
వేడుకతో కొమాళ్ళ గనియేటి వేళాయెర నాతండ్రి
బాలుడనై తిరిగితి గోపాలకులనుగూడి'

ఈ చివ్వరి వాక్యము ఎంత సుందరమైనదీ! ఈపాటలో 'స్త్రీలపాటలు' అనబడే కథాగేయాలు స్ఫురిస్తున్నాయి. వీటిలో ఎన్నో కేవలము ఒక మంగళ సన్నివేశాన్ని పురస్కరించుకుని పుట్టినవే. నిన్న మొన్నటి స్త్రీలు నలుగుపాటలూ, పెండ్లి పాటలూ, మంగళహారతులూ పాడుకుంటే, పూర్వకాలపు స్త్రీలు—అంటే మన అవ్వలు—ఈ గేయాలు పాడుకున్నారు. నేటి మంగళగేయాలు టుప్రిమాలే వీటితో పోల్చితే. కేవలము మంగళగేయాలు కాక, అంత గొప్ప కథాగేయాలూ కానివి — వినోద కథాగేయాలు—సీతాకళ్యాణంపాట, సీతవేవిళ్ళు, రుక్మిణీదేవి సీమంతమూ, కృష్ణజననమూ అన్నవి ఉన్నాయి. వీటి సౌందర్యము సందర్భానికి అమిరిపోవడములో మాత్రమే లేదు. పెండ్లి అయినతర్వాత క్రొత్త పెండ్లికూతురుచుట్టూ చేరిన సుమంగళులు సీతాకల్యాణము పాట పాడతారు. నెల తప్పిన యువతులుకూడాఉన్న గుంపులో ఒకరు సీత వేవిళ్ళపాట పాడి వారిని అందపు ఎగతాళి చెయ్యడము కద్దు. అలాగే రుక్మిణీదేవి సీమంతమూనూ! అయితే, కథాభాగము ఎక్కువగావుండి వివాహితనో, దౌహృతినో, పుత్రవతినో వర్ణించేఘట్టముపల్చనైపోయినగేయాల్ని మంగళగేయాల నడుమకంటె 'కథాగేయము' లనడము మెరుగు. ఈ కథాగేయాలు చాలా వున్నాయి.

# ముసలాడి మాట



శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న

"అబ్బబ్బ! దిక్కుమాలిన రంధి బాగా వొచ్చి పడింది నాకు. వాళ్ళకి తోచదు; ఒకరు చెబితే అర్థంవూ చేసుకోరు. చిన్న పిల్లలూ చితకపిల్లలూ కారుకదా, కోంపడ్డానికీ బెదిరించడానికిన్నీ."

మహా చెడ్డ విసుక్కుంది రాజేశ్వరి. పెళ్ళి అయిన పదేళ్ళకి పుట్టింటికి వెళ్ళిందామె, అయిదేళ్ళ కొడుకుని తీసుకుని.

గత అయిదారుయేళ్ళలోనూ యెంతైనా మారిపోయిందామె. బి. ఏ ప్యాసయి కొత్తగా కాపరానికి వొచ్చినరోజుల్లో రాజేశ్వరి అంటే అబాలగోపాలం ప్రాణం పెట్టేవారు. పిల్లలయితే బొత్తిగా నేను. పిల్లలంతా యెవరుండేవారనీ? తోటికోడలి కొడుకూ, కూతురూను. అయినా ఆ పిల్లలు "పిన్నీ, పిన్నీ" అంటూ యెప్పుడూ యీమె కొంగు పట్టుకునే వేళ్లాడే వారు. చద్ది అన్నాలు పెట్టాలంటే పిన్ని; తలంట్లు పొయ్యాలంటే పిన్ని; రాత్రిళ్ళు నిద్రపోయేటప్పుడు కూడా పిన్నే. ఔను మరి. రాజేశ్వరి అంత చక్కగా కథలు చెప్పేది. అసలు కథ ఒకయెత్తూ, ఆమె చెప్పడంలో నేర్పు రెండెత్తులున్నూ. అసుర సంధ్య వేళ తిరిగి, చీకటి ముసురుకుంటూఉంటే అన్నాలు పెడుతూనో, వాళ్ళ పక్కని వాకట్లో మంచంమీద పడుకునో ఆమె కథలు చెబుతూ ఉంటే, నిజంగా ఓ పెద్దకొంగ ముక్కు "అఁ"అని తెరుచుకుని కృష్ణుణ్ణి మింగెయ్యాలని వొచ్చినట్టూ, లేకపోతే ఓ పెద్ద చెరువులో పాము పడగమీద ఆడినట్టే ఆడి, కృష్ణుడు దాని బుర్ర కాళ్ళతో చితకతన్నుతూన్నట్టూ, అది కాస్తా 'రక్షించుమెర్రో, యింకెప్పుడూ యెవ్వరినీ అల్లరి పెట్టను' అని బతిమాలుకుంటూన్నట్టూ అనిపించేది వాళ్ళకి యేమిటోను. అనిపించడం ఏమిటి, కళ్ళకి కట్టినట్టు తెలుస్తూ ఉండేను!

అసలు కృష్ణుడు యెంత బావుండేవాడనీ?

"నాలాగ ఉండేవాడు కదూ, పిన్నీ?"

"మరేం చక్కటికిరీటంకూడా పెట్టుకునే వాడు, ధగధగా మెరిసిపోతూను."

"కిరీటం అంటే యేమిటి పిన్నీ?"

"మొన్న దువ్వెంతుకు వేసినప్పుడు నువ్వు పెట్టుకున్నావూ? అదీ."

"అదే బావుంది పిన్నీ, జిగేల్మంటూను"

"కిరీటం మధ్యని నెమిలిపింఛం కూడా ఉండే దిరా, కృష్ణుడికి"

రాజేశ్వరి ఆమాట అనేసరికి వాచక పుస్తకంలో పాఠం ఆనవాలుగా పెట్టుకున్న నెమలికన్ను జ్ఞాపకం వొచ్చేది కుర్రాళ్ళకి.

"మెత్తగా యెంత బావుంటుంది, పిన్నీ, నెమలికన్ను!" అంటూ వాపోయేడు కుర్రాడు.

"అలా యిలా తిప్పితే రంగులూ మెరుస్తాయి, తమాషాగాను!" పల్లవి పాడింది చెల్లెలు.

"ఔనౌను. ఈసారి నాకో కిరీటం కొనిపెట్టమంటాను, నాన్నగారిని."

"నాకుమాత్రం అక్కర్లేదేంటి, నాయనా? నేనూ కొనిపెట్టమంటాను, ఓ అడకిరీటం"

చూస్తుఉండగానే యేళ్లు పైబడుతూవొచ్చేయి. పిల్లలకి నవలలూ నాటకాలూ అంటే యెక్కడలేని అభిరుచీ కుదిరింది. తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ మార్కులు కాస్త బాగానే వొస్తూఉన్నా, పనికి వొచ్చే ముక్క ఒక్కటీ ఒంటబట్టేది కాదు. లెక్కలూ అవీ అంటే వాళ్ళకి యెప్పుడూ, పీకలే, పాపం. స్కూలుఫైనలు అప్పుడే ఓసారి తప్పేరు. ఈమాటు అయినా సవ్యంగా గట్టెక్కుతారన్న భరవసా యేమీ కనిపించడంలేదు.

పంథొమ్మిదోయేట తాను బి. ఏ ప్యాసయి కాపరానికి వొచ్చిన కొత్తలో, వాక్చాతుర్యంకొద్దీ కథలు చెబుతూ పిల్లలని మంత్రముగ్ధులనిచేసి తనవెంట తిప్పుకుంటూ ఉండేనూ, పిల్లలంటే తనకున్న ఆదరానికి అటు అత్తమామలూ, యిటు భర్తా బావగారూ సంతోషిస్తూ ఉండేనూ, తను చేస్తూన్నపని యెంతో

బావున్నట్టే అనిపించింది మొదట్లోను. కాని పెద్ద క్లాసుల్లోకి వెళుతూన్న కొద్దీ పిల్లలు ఎప్పుడూ పనికి రాని పుస్తకాలే చదువుతూ ఉండేవారు. రానురాను పిన్నిదగ్గిర పాఠాలు చెప్పించుకోవడం అరుదయి పోయింది. అసలు వాళ్ళు పిన్నిని అడిగేదల్లా ఏవో కఠినమయిన మాటలకి అర్థాలే. డిక్షనరీ చూసుకో మంటే "టైము వేస్టు, పిన్నీ, చెప్పేద్దూ ... మాంఛి పట్టులో ఉంది కథ" అని జవాబు! తీరా చూస్తే వీడి చేతులో ఓ యింగ్లీషు నవలా, దాని ఒడిలో చిలకమర్తివారి డిటోన్ను. మరి యీ దౌర్భాగ్యులు ఎలా ప్యాసవుతున్నారా అని అనుమానం వేసి, ఒకటి రెండుసార్లు "ప్రోగ్రెసు కార్డు"లు చూసింది. భర్తతో యీ సంగతే అనేసరికి, "ఆ హైస్కూలు హెడ్మాస్టరూ మా నాన్నగారూ క్లాసుమేట్సు రాజా" అంటూ కీలకం చెప్పేడు భర్త.

ఇహను ఆనాటినుంచీ ప్రోగ్రెసుకార్డులు చూడడం మానేసి, పిల్లలని హెచ్చరించేది చదువుకో మని. వాళ్ళు యింగ్లీషూ తెలుగూ తృణంగా చదివినా, లెక్కలూ వగైరాలు మాత్రం పొలిమేరల్లోనే ఉంచేసేవారు. మరీ ప్రాణం విసిగి, ఓనాడు గట్టిగా కూకలేసేసరికి, ఆడపిల్ల కంట నీరెట్టుకుంది; మొగపిల్లడు అమితంగా బెదిరిపోయి జ్వరం తెచ్చుకున్నాడు. ఉదయాన్నే టెంపరేచరు చూసి మందిస్తూ ఉంటే— "ఎంత తంటాలుపడ్డా రావడంలేదు పిన్నీ ... ఓయ్ బాబోయ్, కొట్టకండి, మాస్టారోయ్, కొట్టకండి... మా పిన్ని కూడా అంది ... రేపట్నుంచీ యింకే పుస్తకంవూ ముట్టుకోను...లెక్కలే చేస్తాను...ఇంక కొట్టకండి, బాబూ, చ-చ్చి-పోతాను" అంటూ బావురుమన్నాడు వాడు. రాజేశ్వరి కడుపు కెలికేసింది ఆ పరాకుమాట!

అదుగో ఆనాటినుంచే ఆమెలో గొప్ప పరివర్తనం. పొరపాటునయినా పరుషంగా మాట్లాడేది కాదు, పిల్లలతోను. కథలు చెప్పిన ఆప్యాయతతోనే వాళ్ళని పక్కన కూచోబెట్టుకుని లెక్కలూ, సయన్సూ, వల్లకాడూ వసనాభీ రాత్రి పన్నెండు గంటలదాకా తంటాలు పడేది.

పరీక్షలయేయి.

రిజల్ట్సు ప్రచురించేరు.

"నువ్వే మళ్ళీ ప్యాసయేవు, పిన్నీ" అన్నారు పిల్లలిద్దరూ నవ్వు మొహాల్తో.

అమాయికంగా అన్న ఆమాట ఓ పెద్ద వ్యంగ్య కావ్యం అయిపోయింది పిన్నికి. చిన్ని క్లాసుల్లో వాళ్ళకి మార్కులు తక్కువ వొచ్చినప్పుడు తనే ఫెయిలయింది. తాను మప్పిపెట్టిందేగా కథలంటే వాళ్ళకి ఆ అభిరుచీ ? అంచేత "నువ్వే మళ్ళీ ప్యాసయేవు పిన్నీ" అని వాళ్ళంటే విపరీతం అయిన నిజం ఎంతో వివరంగా గోచరించింది ఆమెకి. ఇంకా నయం, కాస్త వెలుగుండగా సర్దుకోబట్టి గాని, లేకుంటే యావజ్జీవం వాళ్ళు — ముఖ్యంగా ఆ కుర్రనాగమ్మ — యీమెని తలుచుకుని ఉసూరుమని పోయేవారు కాదూ? మళ్ళీ అదే నాటకం ఆరంభం అయ్యేలాగుంది. నేరకపోయి వొచ్చేను బాబూ, అనుకుంది రాజేశ్వరి.

## 2

వొచ్చి పదిరోజులే అయినా పుట్టినప్పట్నుంచీ తాతగారింట్లోనే పెరిగినట్టు మెసులుతున్నాడు పిల్లడు. ఇట్టే చేరికయింది వాడికి తాతగారిదగ్గిర. రోజూ సాయంకాలం ఆయనతో షికారు వెళ్ళి వొచ్చేవాడు. రాత్రిపూట ఆయన విధిగా కథలు చెబుతూ ఉండేవాడు. "అనగా వినగా చెప్పగా చెయ్యగా, అంగ వంగ కళింగ, కాశ్మీర, సౌరాష్ట్ర ఛప్పన్న దేశాల్లో...", పట్టాలమీద రెయిలుబండీ లాగ, పాత ఫక్కీలో సాగిపోయేది కథ ఝుంయిమని. రాజేశ్వరికి తేళ్ళు కుట్టినట్టు ఉండేది. మొదట్లో రెండురోజులు తండ్రిమీది అభిమానంకొద్దీ ఊరుకుంది యేమీ అనకుండాను. తరవాత పిల్లడు పాడైపోతా డన్నమాట ఎన్నోవిధాల సూచించింది. తన తండ్రి కాలానికీ తన కాలానికీ దృక్పథాల్లో ఎంతో మార్పు వొచ్చిందన్న సంగతి ఆయనకి నచ్చచెప్పాలని వెయ్యి విధాల యత్నించింది. కాని ముసలాళ్ళు చిన్నపిల్లల కంటే అన్యాయం అయిపోతారు ఒక్కొక్కప్పుడు! ఇంతకూ డెబ్బయ్యేళ్ళ కురువృద్ధుతో ఆమె దెబ్బలాల్లేదుగదా. కాగా, కన్నతండ్రి ఆయిరి!

ఈలోగా రాజుకొడుకూ, మంత్రికొడుకూ, జోడు గుర్రాలు ఎక్కడం, అలా వెళ్ళగా వెళ్ళగా చీమదూరని చిట్టడవీ, కాకిదూరని కారడవీ, ఆమధ్య ఓ పెద్ద మర్రిచెట్టూ, దాని కొమ్మలు పట్టుకొని వీళ్ళు చెరోదిక్కుగా వెళ్లడం, అప్సరసలూ...ఒకటేంవిటి? ముసలాయన టెలివిజనే చూపించేస్తున్నాడు.

కథల నిషా బాగా తలకెక్కిపోతోంది కుర్రాడికి !

## 3

ఓనాడు మరి నిగ్రహించుకోలేక పోయింది, రాజేశ్వరి.

"యింక చాల్లెస్దురూ, నాన్నగారూ ఉట్టి పుణ్యానికి పాడుచేసేస్తున్నారు వాణ్ణి."

ముసలాయన పొడిగా ఓ నవ్వు నవ్వేసి తిరిగీ కథ అందుకున్నాడు.

అమర్నాడు తాతగారితో షికారు వెళ్ళలేదు, కుర్రాడు.

చీకటిపడి తాతగారు యింటికి వొచ్చేసరికి పిల్లడు పడమటిగదిలో పడుకున్నాడు.

భోంచేసి చుట్ట ముట్టించుకుంటూ హాల్లోకి వచ్చిన తాతగారికి బల్లమంచంమీద పిల్లడు కనిపించలేదు.

"బాబూ, కథ చెప్పుకుందాం, రావోయ్" గుండెల్లోంచి పొంగి పొరలే అప్యాయతతో పిలిచేడు ముసలాయన.

"వాడు పడుకున్నాడు లెండి నాన్నగారూ" రాజేశ్వరి సమాధానం యిచ్చింది.

"అదేఁ? ఊరు సంధ్యపడకుండానే?"

"పోనిస్తురు, నాన్నగారూ. అలాగ కథలు అలవాటు చెయ్యడం మంచిదికాదు"

"అద్గదీ. అంచేత చంటి వెధవని తొంపడి పడుకోమన్నావన్నమాట. ఇంతకూ కథలు వినడం యెందుకు మంచిదికాదో?"

"అలా కథలు వినివిని, వాళ్ళు హీరోలయి పోయినట్టు ఊహించుకుంటారు. కావాలన్న పనికి తగిన కృషి చెయ్యకుండా ఏవో పిచ్చిపిచ్చి ఊహలలో కాలం గడిపేస్తారు. కథల్లో ఏ అప్సరసో రాత్తుసుడి ప్రాణాల ధరిణ చెప్పేసినట్టు వీళ్ళకీ ఏ మహానుభావుడో అడ్డుపడతారని భ్రమిస్తారు. నిజంగా జీవితంలో అటువంటిది ఏఁవీ జరగదు. కాగా మిగిలేది ఒట్టి పేకమేడ. ఇహ నా తరవాత యెందుకూ పనికి రాకుండా పోతారు."

కూతురు హెచ్చరికకి ముసలాయన ఏఁవీ అనుకోలేదు. అమితంగా జాలిపడ్డాడు ఆమె వైఖరి చూసి—

"అయిందా నీ ఉపన్యాసం? పిచ్చిపిల్ల! నేనున్నంతకాలం వాడికి ఏమీ భయంలేదు. ఇంత త్వరగా నాకేమీ రానూరాదు. అలాంటిది ఏదయినా జరుగుతుంది అనుకున్నప్పుడు—"

"ఊరుకోండి నాన్నగారూ. ఎందు కొపాపపు మాటలు. నేనేమయినా అలాంటిది అన్నానా?" రాజేశ్వరి మనస్సు చివుక్కుమంది, మరి.

"నా కథలవల్ల నాడు చెడిపోతాడంటేనూ? చెడిపోకుండా చూసుకోడానికి యింకా బోలెడు వ్యవధి ఉంది అంటున్నాను."

"అబ్బబ్బా. ఏఁవిటా అమాయిత్యపు మాటలు! ఊరుకోరు నాన్నగారూ?"

"ఇంతకూ కథలు వినడంవల్ల యేఁవిటా ప్రమాదం?"

"ప్రమాదం ఏఁవీ లేదు, మంచిదికాదన్నాను."

"ప్రమాదం ఏఁవీ లేనప్పుడు మంచిది కాకపోవడం ఏఁవీ?"

"ఇంక రేపు యింటికి వెళ్ళినతరవాతకూడా వాడు కథలు చెప్పమని నా ప్రాణాలు తీస్తాడు."

"ప్రమాదం ఏఁవీ లేదని ఒప్పుకుంటూన్నప్పుడు, అక్కడ నువ్వుమాత్రం యెందుకు చెప్పకూడదూ, కథలూ?"

"అదో దురభ్యాసం అయిపోతుంది నాన్నగారూ"

"ప్రమాదం లేనప్పుడు అలవాటు అయితే మాత్రం యేం?"

తండ్రీ కూతుళ్ళ సంవాదం వింటూ అంతవరకూ ఉలక్కుండా పలక్కుండా కూచున్న భర్త వసారాలోంచి ఫకాలుమన్నాడు.

రాజేశ్వరికి అవమానం, పౌరుషం ముంచుకొచ్చేయి.

"మరీ చిన్నపిల్లలకన్నా కనికిష్టం అయిపోతున్నారు. నాన్నగారూ, మీరూ మీపంతమున్నూ"

"పంతంకాదు, అమ్మాయీ నీకూ విద్యాబుద్ధులు చెప్పించేను. బి. ఏ ప్యాసయేవు. నేనూ పట్టా పుచ్చుకున్నవాణ్ణే — ఎప్పుడో నువ్వు పుట్టకముందులే. అంచేత విషయం తర్కిస్తున్నాం అన్నమాట. అంతేగాని నాకు పంతం దేనికీ? అందులోనూ నీతోను!"

"ఏమయినా మీరు నాలుక్కాలాలు చూసిన వాళ్లు. అంచేత నామాట తిరిగి వాళ్లే తప్పుచెప్పే నేర్పు—"

"నేర్పూ లేదు గీర్పూ లేదు. ఇటు మాకు, అమ్మాయికీ కథలవల్ల ప్రమాదం ఏఁవీ లేదూ అనుకున్నప్పుడు మరేపుట్టిములకొకూడా రాదుసుమీ అని నచ్చచెప్పాలనీ నా ప్రయత్నం అంతాను. ఇంతకూ పుట్టిన అయిదేళ్ళకి తొలిసారిగా నాలుగు రోజులు నాదగ్గిరున్నాడు వాడు."

"ఆడది, దాంతో ఏఁవిటి పోనిస్తురు, మాఁవ గారూ" అన్నాడు భర్త.

రాజేశ్వరి ఘర్రుమంది. "ఆఁహ్. ఆడవాళ్ళు! మీరున్నారుకదూ మొగవాళ్ళు! అటు మీరూ, యిటు నాన్నగారూ, గదిలో బాబులూ — అంతా మొగాళ్లే. ఒక్కతే నేనే ఆడదాన్ని. మీరెంత మెజారిటీలో ఉన్నా నా అభిప్రాయం మారదుగాక మారదు."

రాజేశ్వరిని మరి కొంత రెచ్చగొడదాం అనిపించింది భర్తకి. అతనికి అదో అలవాటు. ఏడుస్తూన్న వాళ్ళని మరి కొంత యేడిపిస్తాడు—"అవునూ. కథలు వినడంలో ప్రమాదం లేదంటూ—"

"చాల్లెండి, ఉన్న గేదె కూడా యీనిందా అనీ? మీవొంతు ఉండిపోయిందా యేఁవిటి యింక? కాకపోయినా రెండు నిమిషాలు యెవరయినాపట్టుగా మాట్లాడితే జాను అదే రైటు అని తల వూపేస్తారు మీరు. వీడుకూడా పరిక్షలు తగలేస్తూ ఉంటే—"

"అలాంటి అభాసు ఏదయినా జరుగుతుం దనుకున్నప్పుడు నువ్వన్నమాటే; వొప్పుకుంటాను. కాని కథలు వింటే ప్రమాదం ఏఁవీ లేదని నువ్వే అన్నావుగా?"

ఇంక రాజేశ్వరికి విసుగెత్తింది. అంతలో పడమటి గదిలోంచి పిల్లడు పిలిచినట్టయింది. "నువ్వింకా పడుకోలేదురా, నిశిరాత్రి అవొస్తూ ఉంటేనూ?"

ఆమె విసుక్కుంటూ చరచరా లోపలికి వెళ్ళిపోయింది.

## 4

"వాడికి నా దగ్గిర చేరికయింది. అసలు కథలంటే సరదా లేని పిల్లలు యెవరుంటారు చెప్పూ? చూడు, పాపం వాడు యెలా యేడుస్తున్నాడో" "ముసలాయనకి ఏఁవిటో చెయ్యి విరగ్గొట్టుకున్నట్టుంది, పక్కన పిల్లడు లేకపోవడం.

"ఆడవాళ్లంతా అంతే, పోనిద్దురు మాఁవ గారూ."

"నేను దగ్గిరగా మెసిలిచూసిన ఆడవాళ్ళంతా యెవరూ? అటు నీ అత్తగారూ, యిటు నీ భార్యానూ. వీళ్ళిద్దరిని బట్టే లోకంలో ఆడవాళ్ళంతా అంతే అని పాటా పెట్టెయ్యడం సబబుకాదనుకో. కాని చూడు, వాళ్ళు అదోరకం మనుష్యులు. విన్నన్న చెప్పిందే వేదం, వాళ్ళలోను. ఇంక దానికి మంచీ, చెడ్డా, విమర్శ యే వల్లకాదూ అక్కర్లేదు."

"ఒట్టి బండలు పోనిస్తురు, మావగారూ" నిజంగా అతని గుండెల్లోంచి వొచ్చిన మాటకాదది. రాజేశ్వరి అంటే అతనికి పంచప్రాణాలూను. నెత్తినె యెక్కించుకునే వాడు ఆమెని. కాని ప్రస్తుత పరిస్థితుల్లో మాఁవగారి మనోవ్యాకులం—మాన్లేక అలా అనేసేడు.

కాని ముసలాయనది మహా నిశితం అయిన తర్కం. "బండలైనా బావుండి పోను", ఆయన సున్నితంగా విమర్శ ప్రారంభించేడు, "బండ మారు పలకదు. కాని వీళ్ళతో అలాగ కాదుగా! ఒకమాటకి పదిమాటలు జవాబు చెబతారు, వీళ్ళు, యెంత అసందర్భంగా వున్నా సరే ఆ మాటలు."

ముసలాయన యింకా తర్కం సాగిస్తూనే ఉన్నాడు. అవతల పడమటింట్లో రాజేశ్వరి పిల్లడితో నోరు చేసుకుంటోంది. నిజానికి ఆమె పిల్లడిని అంతలాగ యెన్నడూ కసిరి యెరగదు. అవేళఅయినాఅంత త్వరగా కోపంవొచ్చి ఉండకపోను, ఆమెకి. కాని గంటన్నర అయి అనవసరంగా తండ్రితో వితండ వాదంతో ఓ కొంత, తీరా పోనీ అని వొదిలేస్తే తోటికోడలి పిల్లల్లాగే వీడూ చెడిపోతాడేమోనని భయంతో మరి కొంత ఆమెకి మతిపోయింది. ఆమెలో ఆమెకే విసుగెత్తింది. చివరికి కోపంగా పరిణమించింది.

కాని ఆ గాథ అంతా కుర్రాడికి యేం తెలుసూ? యెన్నడూ కన్నెర్రజెయ్యని తల్లి గట్టిగా కోప్పడేసరికి వాడు కాస్తా బావురుమన్నాడు ఒక్కసారి.

"శని వెధవ, యెలా యేడుస్తున్నాడో. ఎవరైనా వింటే బలవంతాన్న పీక నులిమి చంపేస్తున్నాం

అనుకొంటారు." రాజేశ్వరికి కోపం, చికాకూ ప్రతిఫలించి పోయేయి.

ఆ చివరి మాటలు కాస్తా ముసలాయన చెవిని పడ్డాయి. "ఆఁ. ఇరుగూ పొరుగూ వినిపోతారేమో నన్న భయం కాస్త ఉందన్న మాట" అనుకున్నాడు. అంతలో ఆయనకి యేదో ఆలోచనతట్టింది. ఫక్కున నవ్వేడు.

అల్లుడు తెల్లబోయేడు.

"అబ్బే, యేఁవీ లేదూ. జీవితంలో ముఖ్యం అయిన విషయం ఏఁవిటో గ్రహించేవూ, పిల్లలతండ్రి వయేవు!" అన్నాడు మాఁవగారు.

అల్లుడికి యేమీ పాలుపోక, దిగాలుపడి చూస్తూ ఉండిపోయేడు.

"వొంటికి పాతికేళ్ళు వొచ్చేయే నీకు, ఇన్నాళ్ళూ యేఁవిటి కావాలనిపించింది నీకు?" ముసలాయన ముదలకించేడు.

"అనేకం."

"అవునా? నీ చేతుల్లోనే ఉంటే అవన్నీ అనుభవించేవాడి వన్నమాట. ఏం?"

"బహుశా అలాగే జరిగిఉండేది"

"కాబట్టి నీకు కావలసిందల్లా ఒక్కటే, స్వేచ్ఛ. నీ యిష్టం వొచ్చినపని చెయ్యడానికి ఏ అభ్యంతరం ఉండకూడదు. దాని పేరే స్వేచ్ఛ"

ఈ మాటల్లో అంతరార్థం దూరంగా దృగ్గోచరం అయింది అల్లుడికి.

"అదేనోయ్ జీవితంలో కీలకం. స్వేచ్ఛ. ఆ స్వేచ్ఛకోసం దేవుళ్లాడతాడు జీవి పుట్టినదగ్గిర్నించీని. పుట్టగానే ఏం చెయ్యడానికీ శక్తిఉండదుగా. అంచేత యేడుస్తావు. మీ అమ్మకి రెండు చెవులంటూ యిచ్చేడు భగవంతుడు. అంచేత ఆ యేడుపుతో నీకు కావలసింది లభిస్తుంది అప్పట్లో. చంటిపిల్ల బహు సున్నితం అయిన వస్తువు మరి. ఆ సున్నితం సాధారణంగా మనకి తెలిసి యేడవదు. అందుకు దాని దారి అది చూసుకోవడానికని యిదో మార్గం పెట్టేడు భగవంతుడు. ఆ తరవాత యెప్పుడైతే యితర సాధన ద్వారా తన కోరిక నెరవేర్చుకో గలుగుతాడో అప్పుడు ఏడ్చి సాధించడం మానేస్తాడు పిల్లడు."

ముసలాయన లెక్చరు విని, అంతవరకూ చెలరేగిన తుఫాను అకాత్తుగా మరిచిపోయేడు అల్లుడు. మాఁవరాకడ యేదో వింతగానే ఉంది.

"మీరు చెప్పిందంతా బాగానే ఉందిగాని, యీ యేడ్చి సాధించడం అనేది రానురాను పంతంగొట్టుతనంగా పరిణమిస్తుందేమో నని నా భయం, మాఁవగారూ! పంతగొట్టుతనం యేం అంత మంచి గుణఁవా మరీ?" అల్లుడూ తన లోకజ్ఞానం వెల్లడించేడు.

"మాట పొరపాటుగా వాడేవు" మాఁవ ఠకీమని అందుకున్నాడు, "పంతగొట్టుతనం అని మనం భ్రమపడేది పట్టుదలకి బీజం. పిల్లడికి జ్ఞానం తెలుస్తూన్న కొద్దీ కొత్తలక్షణాలు అబ్బుతాయి. ముఖ్యంగా సంతోషం, రోషం తెలుస్తాయి. వాడికి సంతోషం పెల్లుబికి వొచ్చినప్పుడు చప్పట్లు కొట్టాలనిపిస్తుంది. రెండు చేతులతోనూ వాడు బాజాలు వాయించేస్తాడు. "వొద్దు, వొద్దు"ంటూన్నా వాడికి మేడమెట్లు యెక్కాలనిపిస్తుంది. తల్లి ఏ పప్పో బియ్యఁవో బాగుచేసుకుంటూ ఉంటే వీడు చల్లగా జారిపోయి మెట్లవేపు ఉడాయించేస్తాడు. తల్లి తలయెత్తి చూసేసరికి వీడు బాగా పదిమెట్లు యెక్కిపోతాడు. "ఒరే, ఒరే" అంటూ నివారించబోతుంది తల్లి. వాడి వెనకాల పరిగెడుతుంది. కాని వాడో? సింహంలాగ మెడ వెనక్కి తిప్పి తల్లివేపు చూసి నవ్వుతాడు, తన కోరిక నెరవేర్చుకున్నందుకూ, పట్టుదల నెగ్గినందుకున్నూ."

"ఇందులో నిజానిజాలు యెలాగఉన్నా మీ తర్కం మాత్రం మా తమాషాగా ఉంది, మాఁవగారూ!"

"ఇంకొక్క మాట చెబుతాను వినవోయ్. ఈ పట్టుదలే తరువాత తరవాత జీవితంలో యెక్కువగా ఉపకరిస్తుంది. పెరిగి పెద్దవాడు అవుతూన్న కొద్దీ పదిమందీ తను చేసినపని మెచ్చుకోవాలనీ, నలుగురిలోనూ తనమాట 'ఔ' నని పించుకోవాలనీ కోరిక పుడుతుంది. ఆ తంటాలుపడడంలో వాడు నెగ్గేడా, సంఘఁవూ ప్రపంచఁవూ వాడికి అంజలి ఘటిస్తుంది. లేదూ, వాడు యెందుకూ కొఱగాకుండా పోతాడు. ప్రస్తుతం వొచ్చిన చిక్కేఁవిటీ అంటే, తనమాట నెగ్గించుకునే యీడు రాలేదింకా వాడికి; అది కాస్తా మళ్ళిపోయింది నాకు. దానాదీనా కథ మిగిలే పోయింది."

## 5

పడమటింటి గదిలో తల్లీ కొడుకూ యింకా యేదో గలభా పడుతూనే ఉన్నారు.

ముసలాయన ఉన్నట్టే ఉండి స్లేటు మార్చేడు.

"అమ్మాయీ" అని ఓ పొలికేక పెట్టేరు, ఊరు కాలిపోయినంత గొడవ చేస్తాను!

ఎదరనున్న అల్లుడు అదిరిపడ్డాడు.

పడమటింటి గదిలోంచి పరిగెత్తుకు వొచ్చింది, రాజేశ్వరి, "ఏఁవిటి, నాన్నగారూ? ఏఁవిటయింది?" అంటూను.

"ఏఁవీ కాలేదు. ఏమయినా అయితే యీ గొడవంతా యెందుకూ? కుర్రవాడి కథ మిగిలేపోయింది." ముసలాయన వ్యాఖ్యానించేరు.

"అబ్బ! ఊరుకుందురూ, నాన్నగారూ, మళ్ళీ మొదలెట్టకా. ఆ విషయంలో యింక యివాళ మన అభిప్రాయాలు కలియవు."

"ఆయన మాట అంత తేలిగ్గా కొట్టిపారెయ్యకు, రాజూ, ఆయన చెప్పినదాంట్లో యెంతో అర్థం ఉంది." భర్త కాస్త నచ్చజెప్పబోయేడు.

"చా ఊరుకుందురూ. నాన్నగారివన్నీ పాత కాలపు మాటలు. అప్పటికీ యిప్పటికీ కాలం మారిపోయింది, మరి.!"

"కాని కథలంటే అభిరుచీ, పిల్లలతో ఆడుకోవాలన్న ఉబలాటం ముసలాళ్ళలో మాత్రం మారలేదే, అమ్మాయ్" ముసలాయన తిరిగీ ఉపక్రమించేరు.

"ఉట్టి పుణ్యానికి యెందుకూ పనికిరాకుండా పోతాడు, నాన్నగారూ. నామాట వినరూ?" రాజేశ్వరి ప్రాధేయపడింది.

"అదే, యెంచేశా అంట"

రాజేశ్వరి తనతోటికోడలి పిల్లల యితివృత్తం అంతా పూసగుచ్చినట్టు చెప్పింది. "దైవకృపవల్ల వాళ్ళయేదు గట్టెక్కబట్టిగాని, లేకపోతే—" మాట ముగించలేకపోయింది ఆమె. "ఇంతకూ కథలూ అవీ అంటే ఆ వ్యామోహం కలిగించింది నేనేగా" అంటూ కంట తడిపెట్టుకుంది.

ముసలాయనకి గుండె కరిగిపోయింది. కూతుర్ని ఒడిలోకి తీసుకుని, ఎంతో ఆప్యాయంతో తల నిమురుతూ అన్నాడు, "ఒస్స! ఈ జిజ్ఞాసలో పడి నీలో హృదయాన్ని చంపుకుంటున్నావా, అమ్మా! కథలు వినిపించవల్లా, నవలలు చదవనివ్వవల్లా ఫెయిలయిపోలేదు వాళ్ళు. మిగతా సబ్జక్ట్సు అశ్రద్ధ చేసినందువల్ల పరీక్ష తప్పేరు. కథలూ కబుర్లూ చెప్పి చిన్నప్పుడు వాళ్ళని తల్లికంటే యెక్కువగా నీ చేతుల్లో తిప్పుకున్నావని నువ్వే అంటున్నావా? వాళ్ళకి నువ్వంటే అంతలాగ అభిమానఁవూ ప్రేమా యేర్పడ్డప్పుడు, మంచిమాటలతోనే వాళ్ళు తప్పుదోవ పట్టకుండా చూడొచ్చునుగా! ఆ సంధ్యా సమయాల్లో వాళ్ళపక్కన పడుకుని ఆ కథలతోపాటు, లెక్కాలూ మానాలూ అవీ యివీ కూడా చెబితే ఎంత బాగుండిపోను! హిస్టరీ అంతా కథల్లోనే చెప్పొచ్చునే, యెముకలకి పట్టిపోయి, మరిచిపోదాం అన్నా మరుపురాకుండా ఉండేటట్టు!"

రాజేశ్వరి కళ్ళు విప్పారేయి. రెప్పవాల్చకుండా చూస్తోంది తండ్రి ముఖం. ఆయన అడిన ప్రతీమాటా శ్రుతిపుటాల్లోపడి, సూటిగా గుండెల్లోకి దిగి నాటుకుపోతోంది. ఆయన అలా చెప్పుకుపోతూనే ఉన్నాడు—

"సయన్సూ అవీ అయితే—చిన్న క్లాసుల్లో ఉన్నప్పుడు — వాళ్ళతో ఆడుకున్నట్టే ఆడుకుని ప్రయోగాలు చేయించి, ఎప్పుడూ నిన్నే పాఠాలు చెప్పమనేటట్టు — ఎంతెంతటి అవకాశాలు ఉన్నాయో గ్రహించేవూ? అయితే అప్పుడు నీకూ చిన్నతనం. అంచేత తెలియక పొరపాటు జరిగిపోయింది. జ్ఞానం తెలిసీక, చేసిన పొరపాటు సవరించుకున్నావు. కాని అంతమాత్రాన హృదయం చంపుకోవలసిన పనియేఁవుందీ? ఎవడో సైకిలుయెక్కి కాలు విరగ్గొట్టుకున్నాడని సైకిళ్ళే నిషేధించేస్తే యేంబావుంటుంది చెప్పు, అమ్మాయీ?"

రాజేశ్వరికి ఒక్కసారి సత్యం స్ఫురించింది.

సంతతధారాపాతంగా అశ్రువులు చెక్కిళ్ళ వెంబడి జారేయి. ఆమె శరీరం అణువు అణువునా కృతజ్ఞతతో కంపించిపోయింది. ఒక్క అంగలో పడమటిగదిలోకి పరిగెత్తింది, రాజేశ్వరి.

ముసలాయన చిర్నవ్వుతో వెంబడే వెళ్ళేడు.

"బాబూ" గద్గదికతో పిలిచింది తల్లి.

"తాతగారింకా రాలేదే అమ్మా?" యెంతో జాలిగా, దీనంగా అడిగేడు పిల్లడు.

"ఇంకా నిద్రపోలేదురా, భడవా!" నవ్వుతూ అన్నాడు తాత.

"నిన్న చెబుతానన్న కథ చెప్పవ్ తాతా?"

"అందుకే వొచ్చేన్రా, బాబూ, నువ్వ యింకా మేలుకున్నావో లేదో చూద్దాం అని."

# కాటమరాజు కథ*

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య



కాటమరాజు కథలోని యాంతరంగిక సాక్ష్యములనుబట్టి యెఱ్ఱగడ్డ పాటిలో మనుమసిద్ధి మహారాజునకును, కాటమరాజునకును నెంతకాలము పాటు యుద్ధము జరిగినదో తెలిసికొన నగునేమో చూతము. ఇంతకుఁ బూర్వము పేర్కొనఁబడిన శాసనములో 'స్వస్తిశ్రీ శాలివాహన శక వరుషంబులు ౧౧౮౦ అగు నేంటి కాళయుక్తి సంవత్సర కార్తిక శు ౫ నెల్లూరి నలసిద్ధి రాజు సర్వ సన్నాహం మెఱసి లింగాల కొండ యెఱ్ఱగడ్డ పాటికి' యుద్ధమునకుఁ బోయినట్లు కలదు. కాని యథోజ్ఞాపికలో '*Date uncrtain Probably 1180*" అని కలదు. అగుచో క్రీ. శ. 1258 కి సరియగు కాళయుక్తి సంవత్సర కార్తిక శుద్ధ పంచమినాఁడు మనుమసిద్ధి దండయాత్ర పోయినట్లూహింపఁదగియున్నది. ఇది యిట్లుండఁగా గ్రంథభాగమున ననేక స్థలముల 'చిత్రభాను పగ సిద్ధముగ వచ్చు' నని యున్నది. సంప్రదాయముగా నీ కథలఁ జెప్పువారును యెఱ్ఱగడ్డపాటి పోట్లాట చిత్రభాను సంవత్సరముననే జరిగినట్లు చెప్పుదురు. శాసన కాలమునకును దీనికిని పొత్తు కుదురుట లేదు.

## యుద్ధకాల పరిమితి

కాటమరాజు ధాత నామ సంవత్సరము ఫాల్గున శుద్ధ పంచమి గురువారమునాఁడు జన్మ మందినట్లు ప్రతీతి.

కాళయుక్తి సంవత్సరమున నీ యుద్ధము జరగుచో యుద్ధకాలమునాఁటికి కాటమరాజు నలుబది రెండేండ్ల వయసువాఁ డగును. చిత్రభాను సంవత్సరమున జరుగుచో నతఁ డిరువది యాఱేండ్లవాఁ డగును.

'చల్లవారిని దూర్పు పరిహార చేసి
దశమి గురువారాన తగ వొప్ప నిలిచె'

మనుమసిద్ధి చల్లవారితో దశమి గురువారమునాఁడు పోరినట్లిది తెలుపుచున్నది. అది యేమాసమో యందుఁ దెలుపఁబడలేదు. తరువాతి సంఘటనము లన్నియు దినము వెంబడి దినముగా జరుగుచుండుటచే నీ యుద్ధమును మాఘమాసమునందే జరిగియుండఁ దగు ననుకొనవచ్చును. అంతకుఁ బూర్వమే బ్రహ్మరుద్రయ్య యుద్ధము జరగి యుండుటచే ఖడ్గతిక్కన బ్రహ్మరుద్రయల పోరు దశమికిఁ బూర్వము జరగి యుండఁ దగు ననుట నిశ్చయము. కాని యీ నిశ్చయమునకును ప్రతిబంధకముగా బ్రహ్మరుద్రయ్య యుద్ధఘట్టములోని యీ క్రింది వాక్యము లడ్డు నిలుచు చున్నవి.

'మాఘ మాసమున నమావాస్య తిథిని
మంగళవారం బమరియున్న నాఁడు
గోబిలంబున వానిఁ గూర్చుండఁబెట్టె'

కాని కాటమరాజునకును, మనుమసిద్ధికిని మాఘ బహుళ అమావాస్య మంగళవారమునాఁడు ద్వంద్వ యుద్ధము జరగినట్లుండుటచే నీ వ్రాఁత యంత సత్యము కాదేమో యని తోఁచును. యుద్ధక్రమము గూడ దశమినాఁటి నుండి యమావాస్య వైపునకు నున్ముఖముగా నుండునట్లు తెలియనగు చుండుటచేత ఖడ్గతిక్కనపోరు దశమికిఁ బూర్వము జరగియుండు ననుటయే సమంజసముగాఁ దోఁచుచున్నది. చల్లవారు 'దశమి యొక్క ప్రొద్దు తగ వొప్పఁజేసి' యుద్ధమునకుఁ బోయిరి. వారు యుద్ధమున మడిసిన పిదప నేకాదశినాఁడు కాటమరాజు పల్లికొండను 'ఏకాదశియు నేఁడు ఎవ్వరి వంతు' అని యడుగును. బొల్లావు దని యాతఁడు నిర్దేశించును. కనుక బొల్లావు యుద్ధము ఏకాదశినాఁడు జరగును. బొల్లావు విష్ణువు

* ఆంధ్రపత్రిక విజయ ఉగాది సంచికలోని "కాటమరాజుకథ" అను వ్యాసమున కనుబంధము.

నవతారము. బొల్లావు చేసినయుద్ధము ప్రశస్తముగానీ కావ్యమునందు వర్ణింపఁబడినది. బొల్లా వానాఁడే వైకుంఠలోకప్రాప్తి నందినది.

'మనుజలోకము నుండి మఱియు బొల్లావు
ఆకాశవీధిని నమరులు చూడ
నేకాదశిని నిర్వ్యాజేకు గడియలకుఁ
గరివరదుఁ డంపిన కనకరథ మెక్కి
యరిగెను బొల్లావు ఆ విష్ణు కడకు'—

ద్వాదశినాఁడు బీరినాయని వంతు. ఇతఁ డాఱువేల గోసంగులతో మంగల్లిపాడు శాణ్యమున నిలిచి పోరెను. గొప్పగా యుద్ధముచేసి గోసంగులు నేల కొఱఁగిరి.

'దండి గోసంగులు ద్వాదశినాఁడు
వైకుంఠమున కొరగి యరిగి రావేళ'

త్రయోదశినాఁడు బాలరాజుల యుద్ధము. బాలరాజు లనఁగా దొనకొండలో నుండిన యయితమ రాజు నతని సోదరులు. కోటపాటి తాటివృక్షము తెచ్చుకథలో—కాటమరాజు దొనకొండలో నున్న యయితమ రాజునకు—యుద్ధములోఁ దనకు సహాయము పడవలసిన దని కోరుచుఁ గాలరిచేఁ గమ్మ వ్రాసి పంపును. అం దిట్లు కలదు.

'మాఘ త్రయోదశి ఆదివారమునకు
బాగుగా నున్నాము బలములతోడ'—

చల్లవారు యుద్ధము చేసినది దశమి గురువార మగుచో త్రయోదశి యాదివార మగును. కనుక చల్లవారి యుద్ధముకూడ మాఘమాసమునందే జరిగిన దని దీనిని బట్టి నిరూపిత మగుటకు నవకాశము కలదు.

చతుర్దశినాఁ డెవరివంతో యెఱుఁగరాదు. బాలరాజుల యుద్ధమే చతుర్దశినాఁడును జరిగెనని యూహింపఁదగును. మఱునాఁ డమావాస్య. కాటమ రాజునకును, మనుమసిద్ధికిని నీదినమునందే ఘోరయుద్ధము జరిగినది. ఇరువురును నా దినమున వీరస్వర్గ మందినట్లు వర్ణింపఁబడినది. శివరాత్రినాఁడే యిరువురకు యుద్ధములో వీరశయనము ప్రాప్తించుట విశేషము.

'అంతట మఱునాఁడు అమావాస్యనాఁడు
పంతపు నలసిద్ధి బారు లేతెంచె
కడువేగ నెదిరించి కాటమరాజు
పద్మనాయఁడు తాను పైనముగాను
మాఘమాసమున నమావాస్యనాఁడు
మంగళవారాన మహిమ దీపింప
నధికులై పోరిరి యంత కంఠకును

*         *         *

ఈ యుద్ధక్రమమును, నేయే దినములం దెవరెవరు యుద్ధము చేసినదియు నీ క్రింది పంక్తులు వెల్లడి సేయుచున్నవి.

'బలభద్రమూర్తి! యోబావ! పల్లికొండ
నెలఁగి మన యాదవుల్ చేసినయాజి
మాఘ బహుళ అమావాస్య మంగళవారంబు
మొదలు!
బాగుగా తంబళ్ల బ్రహ్మరుద్రయ్య
దశమి గురువారానఁ దగఁ జల్లవారు
నెసఁగంగ బొల్లావు ఏకాదశి తిథి
అమర ద్వాదశినాఁడు అమర బీరన్న
త్రయోదశినాఁడో తగ బాలరాజు
లెనయంగ రేపటి నెవ్వరి వంతో —

శాసనములో కార్తిక శుద్ధ పంచమినాఁడు మనుమసిద్ధి దండయాత్ర వెడలినట్లున్నది. అది నిజమగుచో కార్తిక శుద్ధ పంచమినుండి మాఘ బహుళ అమావాస్యవఱకు నన(ఁ)గా మూఁడు నెలల యిరువది రైదు దినములు యుద్ధము జరగిన ట్లగును. పయి యుద్ధ రణములఁబట్టి దినమువెంబడి దినముగా నతిశీఘ్రగతిని యుద్ధము జరగినట్లు తెలియ వచ్చుచుండుటచే మాఘ బహుళ పంచమినాఁడు మనుమసిద్ధి యుద్ధమునకుఁ దరలిపోయియుండునని నూహించుట యసమంజసము కా దనుకొందును. ఇది నిర్ణయము కాదు. ఈ విషయమై యింకను బరిశోధింపవలసి యున్నది. సంప్రదాయజ్ఞు లేమి చెప్పుదురో యదియుఁ దెలిసికొనవలసి యున్నది. అంతకుఁ బిదపఁగాని యే నిర్ణయమునుగాని జేయఁ గుదురదు. లభ్యము లగుచున్న యాధారముతో సయుక్తికముగాఁ జేయఁబడిన కల్పనమమాత్రమే యిది! ప్రామాణికాధారములు లభించినపుడు, సప్రమాణముగా నిది ఖండింపఁబడినపుడు నీ నిశ్చయము మార్చుకొనుటకు వీలున్నది. శాసనవాక్యప్రామాణ్యము నింకను బరిశీలింపవలసియే యున్నది. మన మనుకొనినట్లు బహుళపంచమినాఁడే యుద్ధ మారంభింపఁబడి యుండినయెడల నా యుద్ధము పదిరోజులపాటు జరగి యుండెనని చెప్పఁదగును.

## కాటమరాజు కథ – పద్య ప్రబంధము

కాటమరాజు చరిత్రమని యొక పద్య ప్రబంధమున్నది. రెండాశ్వాసముల పద్య కావ్యము.

ముద్రితము. గుఱ్ఱము కొండ భక్తవత్సలుకవి దానికిఁ గర్త. అతఁడు వేంకటేశ్వర భక్తుఁడు. అతనికి నొకనాఁడు శ్రీనివాసుఁడు కలలోఁ బ్రత్యక్షమై శ్రీనాథుఁడు ద్విపదగా రచియించిన కాటమరాజు కథను పద్యగద్యాత్మకముగా రచింపుమని యాతనిని కోరెనఁట! ఈ పద్యముఁ జూడుఁడు—

సీ. ఒక శుభదినమున నొగి శుభ్రమతి శౌరి
పూజావిధానంబు పొందుపఱిచి
హరికథ విని విని యారాత్రి నిద్రింప
శ్రీనివాసుం డిట్లు చెప్పెఁ గలను
శ్రీనాథుఁ డను కవిశ్రేష్ఠుండు ద్విపదగా
రచియించెఁ గాటమరాజుచరిత
మది నీవు నా పేర నంకితంబుగ, బద్య
గద్యాత్మకంబుగా ఘనత నుడువు
మని వచించి తిరోహితుఁ డయ్యె నంత
నేను మేల్కాంచి యాస్వామి నెంచి మదిని
గాలకృత్యంబులను దీర్చి కడుఁ దలిర్చి
పండితావలిఁ గనుగొని భక్తిమెయిని.

కాకువంశపావనుఁడయిన యయ్యల నాయకుని ప్రోత్సాహమున నతఁ డీ గ్రంథమును రచించినట్లు చెప్పుకొనెను. ఈ కవికాల మేదో తెలియరాదు. ఇతని తల్లి నాగమ్మ. తండ్రి నారాయణస్వామి. ఈతఁడు యాదవ వంశమునకుఁ జెందినవాఁ డని తెలియుచున్నది. అతఁడు తన వంశావతారము నిట్లు చెప్పుకొనెను.

సీ. సిరిమించు కడియాల సింగుకైరవమ్ముగాం
కుఁడు తిమ్మయాఖ్యుండు గూర్మిపత్ని
గౌరీసమానయౌ గంగమాంబికయందుఁ
గాంచిన సుతులందు ఘనతగన్న
కందప్పనాయని కాంత వల్లిసమాన
వేంకటాంబిక గన్న విమలులందు
నారాయణస్వామి దార నాగమ కల్లి
కోట ముద్దనకును గూర్మి పుత్రి
హృదయ మలరంగఁ గాంచెను బృథివి భక్త
వత్సలాహ్వయసుతు నను నైన తేయు
వంశజాతునిఁ బితృమాతృవంశసుఖదు
నార్యజనమిత్రు బంధుతోయరుహమిత్రు.

ఈతఁ డీ గ్రంథమునుమాత్రమే కాక ఆంధ్ర తిరుప్పావును, ఉద్ధవకథ యక్షగానమును, సుబుద్ధి శతకమును, రేణుకాదేవి దండకద్వయమును రచించినట్లు తెలియవచ్చుచున్నది. ఇతని యాశ్వాసాంతగద్య యిట్లున్నది—

"ఇది శ్రీమద్వేంకటాచలనివాస లక్ష్మీమానసోల్లాస శ్రీ శ్రీనివాసకరుణాకటాక్ష వీక్షావిశేష సంలబ్ధ సమస్తాభీష్ట సద్గుణగరిష్ఠ విశిష్ట శ్రీమదానూరి రామానుజాచార్య చరణారవింద మరంద రసాస్వాదన తుందిల మిళిందప్రాయహృదయ వాహోర్వీధరవంశ పవిత్ర నారాయణస్వామి పుత్ర సకలకవిజనవిధేయ భక్తవత్సల నామధేయ విరచితం బగు కఱియావుల కాటమరాజు చరిత్రంబునందుఁ బ్రథమాశ్వాసము"—

వాహోర్వీధరవంశ మనఁగా గుఱ్ఱము కొండ వంశము. ఈ గ్రంథమును కాటమరాజు చరిత్ర మనుటకంటె పెద్దిరాజు చరిత్రమని నుడువుట లెస్స. ఏలయన నిందుఁ గాటమరాజు తండ్రియగు పెద్దిరాజు చరిత్రమే విశేషముగా వర్ణితము.

కఱియావుల పెద్దిరాజు దోనకొండ నేలుచుండెను. పెద్దిమాదేవి యతని భార్య. చాలకాలము వఱకు వారికి సంతానము లేకుండెను. వారెన్నో దాన ధర్మములు, పుణ్యకార్యములు గావించిరిగాని వారికి సంతానము కలుగదయ్యెను. దంపతు లిరువురును విచారమనస్కులై యుండిరి. దీపాంతరమేఁగ నిశ్చయించి పెద్దిరాజు తనభార్య పెద్దిమాదేవి నందుకు సమ్మతింపఁజేసె యారాత్రి నిదురింపఁగా కలలో వారికి కల్యాణమునందలి సోమేశ్వరుఁడు ప్రత్యక్షమై కల్యాణమునకువచ్చి తన్నుఁ గొలిచినయెడల వారికిఁ దన యనుగ్రహమున సంతానము కలుగునని చెప్పను. వారు మఱునాఁడు కల్యాణమునకుఁ బ్రయాణ మగుదురు. అతనిసోదరుఁ డగు సింహాద్రిరాజు ఆస్తి పంపకములుచేసి పొమ్మని తగాదా పెట్టును. చుట్టములఁ బిలువఁబంపి వారిసమక్షమున పెద్దిరాజును, నతని సోదరులును వాస్తిపంపకములు గావించుకొందురు.

పెద్దిరాజు పెద్దిమాదేవితోఁ బోయి పోయి కల్యాణము చేరుకొనెను. కల్యాణము నేలు మాచాని గంగురాజు వారివి సత్కరించి వారి నివాసమున కొక గృహమునుగూడఁ గట్టించి యిచ్చును. పెద్దిరాజును నాయూరు చేరిన మఱునాఁడు తనభార్యయగు పెద్దిమాదేవితోఁ గూడి యా యూరిలోని సోమేశ్వరస్వామి యాలయమునకుఁబోయి పూజాదికము నిర్వర్తించెను.

అతని పూజకు మెచ్చి స్వామి యా యూరిలోని చెఱువుకడనున్న గజనిమ్మకు నీరుపోసి పెంచిన నది చిగిర్చి పూచి రెండుపండ్లు ఫలించుననియును, వానిని పెద్దిమాదేవి భక్షించినచో నామెకు సంతానము కలుగు ననియుఁ జెప్పెను. అతఁ డట్లే గావించెను. సోమేశ్వరుని వరప్రసాదమునఁ బెద్దిమాదేవికిఁ గాటమరాజు అను కుమారుఁడును, పాపనూకమ్మ యను కుమార్తెయును గలిగిరి.

ఒకనాఁడు మాచాన గంగురాజు పెద్దిరాజును దన యింటికి విందునకు రమ్మని పిలిచెను. విందు భుజించుచుండఁగా పెద్దిరాజునకుఁ బాలలో నెత్తుటి చారలు గోచరించెను. కారణమడుగఁగా మాచాని గంగురాజు వాలుకేతు డను రాక్షసుని ఘోరకృత్యముల నెల్ల వర్ణించి యదియు నతని కృత్యమే యని చెప్పి యతనివలని యుపద్రవమును దనకుఁ దొలఁగింప వలసినదని పెద్దిరాజును వేఁడెను. పెద్దిరాజు వాలకేతునితో యుద్ధమునకుఁబోయి యూర్లపెంట రణములోఁ జనిపోవును. గోపురాజను నాతఁడు పెద్దిరాజు మరణమును గంగురాజున కెఱిఁగించుచుండఁగా విని యేడేండ్లబాలకుఁ డగు కాటమరాజు తనతల్లియగు పెద్దిమాదేవికడ ననుమతిఁబొంది తన మిత్రుఁడగు పద్మనాయనితోను, ఒంటికొమ్ము బొల్లావుతోను, గోపురాజుతోను, బీరినాయనితోను గూడుకొని వాలకేతుని మీఁదికి యుద్ధమునకుఁబోయి యతని సంహరించెను. పెద్దిమాదేవి యంతఁ దన సంతానమును గంగురాజున కొప్పించి తనపతితో సహగమనముఁ జేయఁ దలఁచి యతనితో నెవరైనను దనువారువచ్చి వారి నడిగిన యెడలఁ దానున్నచోటికి వచ్చుచో దాను గాజుల గలగలలతోఁ జేతులుచాచి చూపుదుననియు నది యానవాలుగా నెఱిఁగి వారికిఁ దన సంతానము నప్పగింప వలసినదనియుఁ జెప్పి తాను సహగమనము గావించును. పిదపఁ గొన్నాళ్ళకు భక్తిరన్న కాశీనుండి రామేశ్వరము తీర్థయాత్ర పోవుచు, మార్గమధ్యమునఁ గల్యాణముమీఁదుగాఁ బోవుచుండఁగా పాపనూకమ్మ పాడుచుండిన యొకానొక పాట యాతనికి వినిపించును. అది విని యాతఁ డామె యెవరని యడుగును. ఆ పడుచు భయపడి లోనికిఁబోఁగా గంగురాజు భార్య గంగమ్మ భయపడవలదని యామెకు ధైర్యము చెప్పి భక్తిరన్నకు వారివిషయముఁ దెలుపును. అతఁడు వారు తనవారని తెలిసికొని రామేశ్వరము పోయి తిరిగి వచ్చునపుడు వారిని గొనిపోవుదునని వచించిపోయెను. అట్లే యతఁడు రామేశ్వరమునకుఁబోయి మరలి వచ్చునపుడు కల్యాణము వచ్చి పెద్దిమాదేవి వెలసినచోట నానవాలు చూపి మాచాని గంగురాజుకడనుండి కాటమరాజును, పాపనూకమ్మను దనతో దొనకొండకుఁ గొంపోవును.

ఇంతటితో గ్రంథము సమాప్తమగుచున్నది. ఇందుఁ గథ కాటమరాజును భక్తిరన్న దొనకొండకుఁ గొంపోవువఱకే కలదు. అందుచే నిది ప్రధానముగాఁ బెద్దిరాజు చరిత్రమే కాఁగలదు. మఱియు నిందలి గథకూడ నింతకుఁబూర్వము పేర్కొనఁబడిన కథతో భేదించుచున్నది. ముత్తాసులు పాపనూకమ్మను బాధించుచుండిరని యందుండఁగా నిందు వారు గారాబముగాఁ జూచుచుండినట్లు కలదు. ఇందేది సత్యమో తెలియదు. పద్యప్రబంధకర్త పూర్వకథ నించుక మార్చియుండఁబోవును.

## కాటమరాజు - తిరునాళ్లు *

కాటమరాజు తిరునాళ్ళకే గంగ తిరునాళ్ళని కూడఁ బేరు. గంగ యాదవులకులదైవముగుటచే నామె కొలుపునందుఁ బ్రధానముగా నుండుటఁబట్టి దానికి గంగ తిరునాళ్ళని పేరు వచ్చియుండును. ఈ తిరునాళ్ళలో జరగు కొన్ని విశేషము లింతకుఁబూర్వము పేర్కొనఁబడిన లోకలు రికార్డులయందలి కథలో విపులముగాఁ దెలుపఁబడినవి. మఱికొన్ని విశేషముల నిటఁ దెల్పుదును.

గంగ తిరునాళ్ళు ప్రతి సంవత్సరమును వైశాఖ శుద్ధ పౌర్ణమినాఁడు ప్రారంభించి యైదుదినములు జరగును. మూఁడవదినము బొల్లావుల ఆరాధనము, అయిదవదినము గంగకుఁ బొంగళ్ళు పెట్టుదురు. ఆవల నాఁడు గుంటిగంగయొద్ద—ననఁగా పాలేరును నేరెళ్ళ వాగును గలియుచోట—పూర్వము ప్రాతగంగప్రతిష్ఠ యుండినచోట గయపిండములు జరగును. ఆ గుంటిగంగకే భగాదిగంగ యనికూడఁ బేరు. పాలేరులో నుండి యొక కాలువ చీలి ప్రాఁతగంగ దేవాలయము మీఁదుగాఁ బ్రవహించి యా దేవాలయమును, నెఱ గడ్డపాడు అను గ్రామమును ముంచి శిథిలము చేసి పోయినట్లు ప్రతీతి. దానినే రక్తపుటేరు అని పిలుతురు. ప్రతిసంవత్సరమును నయిదవదినమున పొంగళ్ళ సమయమున కాకాలువకుఁ గ్రొత్తనీరు వచ్చి ప్రవ

* ఈ తిరునాళ్ళను గూర్చిన వివరములను దెలిపిన కనిగిరి వాస్తవ్యులు శ్రీ ఆర్. ఎ. పద్మనాభరావు గారికిఁ గృతజ్ఞుఁడను.

హించితీరునని ప్రతీతి. దాని నొక గొప్ప మహాత్తుగాఁ బరిగణింతురు. చుట్టుపట్టుల మఱికొన్నిచోటులఁగూడ నీ కాటమరాజు తిరునాళ్ళు జరుగుచుండును కాని సంప్రదాయము రీతిగాను, జరగియుండు వ్యవహారముల తీర్పునుబట్టియుఁ గోట్టురిశాల్యమునగూడ నసలు స్థల మిదే యని నిశ్చయింపఁబడినది. ఎచ్చటఁ దిరునాళ్ళు జరగినను నక్కడి బలిదానములన్నియు నిచ్చటికే తెచ్చి యందఱును చెల్లింతురు.

ఎఱ్ఱగడ్డపాడు అను గ్రామము ప్రాఁతగంగ రొమ్ముద్దనే యుండి శిథిలమైపోయినదని కొందఱును, ప్రక్కనే యున్న వెంగళాపురము గ్రామమే పూర్వపు ఎఱ్ఱగడ్డపాడు అని కొందఱును ననుచున్నారు. మూఁడవదినమునందు వెంగళాపురము గ్రామములో బోల్లావులను పూజించి యుత్సవముతో గంగరొమ్ముద్దకుఁ దోలుకొని వత్తురట!

## కాటమరాజు - గొబ్బి

నెల్లూరు మండలమందును, రాయలసీమలోను గొబ్బిదేవి యారాధనమునుగూర్చిన యొక యాచారము వాడుకలో నున్నది. దానిగూర్చి యొక వింతకథయుఁ జెప్పుదురు.

గొబ్బిదేవి కాటమరాజుగారి యింటి యాడుపడుచట! అత్తవారింటనున్న తన సోదరికిఁ గొంతభూమి నీయవలయునని కాటమరాజు తలఁచుచుండినాఁడు. అందుకై కొంత భూమిని నామెకయియే ప్రత్యేకించినాఁడు. కాని పాపము! అది యామె కీయకయె యతఁడు చనిపోయినాఁడు. ఇది యెఱిఁగిన గొబ్బిదేవి తన సోదరుని కోరిక నెఱవేర్చుటకై ప్రతిసంవత్సరము దనకై తనసోదరుఁ డీయఁదలఁచిన యా బీడున వెలసి పుట్టింటివా రొసఁగిన విందుసుకుపుల నారగించి తిరిగి యత్తవారింటికిఁ బోవును.

గ్రామములలో నేఁటికిని 'కాటమరాజు బీడు' అని కొంత ప్రదేశము ప్రత్యేకింపఁబడియుండును. ఆ ప్రదేశములలో నెవరయినను పంటలు పండించుకొనవచ్చును. అందులకు సుంకములుగాని, కవులుగాని యెవరికి నీయనక్కఱలేదు. కాని సంక్రాంతిపండుగు నాఁటి కాబీడులోని పైరుకోఁతలు ముగిసి యాబీడు పరిశుభ్రముగా నుండవలయును. అందుఁ గొంత ప్రదేశములో నొక బొమ్మరిల్లు గట్టి యందు మట్టితో కాటమరాజు, గొబ్బివిగ్రహములు చేసి యుంతురు. సంక్రాంతి పండుగు మూఁడుదినములును తొలుత గొబ్బికి పొంగిళ్ళు నైవేద్యము పెట్టి పిదప కాటమరాజునకు నైవేద్యము పెట్టుదురు. తన సోదరి యగు గొబ్బి భుజించినపిదపఁగాని కాటమరాజు భుజింపఁడట! పిదప నా నివేదనము చేసినపొంగిళ్లను 'పొంగలో పొంగలి' యని కేకలు వేయుచు నా బీటిలోనికిఁ దెచ్చియున్న పసువులకుఁ జల్లుదురు.

ఇది కట్టుకథయే కావచ్చును. కాని యీసంప్రదాయముమాత్రము నేఁటికిని కొనసాగుచు నేయున్నది. దానిని మనము కాదనలేము. పసువుల పండుగ జరపుకొను రైతుప్రజానీకమునకు గొప్ప పశుసంపదతో రాజ్యమేలిన కాటమరాజారాధ్యుఁడగుట వింతకాదు. ఇంటఁబుట్టిన యాడుపడుచులను బుట్టింటికిఁ బిలుచుకొనివచ్చి యాదరించుటయు మనకుఁ గ్రొత్తకాదు. తెలుఁగునాటనున్న యీ యాచారములకుఁ బూర్వు లెవ్వరో యీ కథలో నొక సంగతి కుదిర్చి గొబ్బిదేవిని కాటమరాజునకు సోదరియని చెప్పి గొబ్బి యారాధనము దేశీయము చేసిరి. ఇందుచే గొబ్బిదేవికిఁ బ్రజాసామాన్యములో నొక విశిష్టస్థానము లభించినది. ఈకథకు సంబంధించినదయి సంప్రదాయము లోకములో రూఢమయిపోయినది.

## ముగ్గురు మహావ్యక్తులు

కాటమరాజు కథను గూర్చి వ్రాయు సందర్భమున నా గ్రంథము విషయమై ప్రత్యేకాదరము చూపిన ముగ్గురు మహావ్యక్తుల పరిశ్రమమును గూర్చి వ్రాయకుండుట యపచారమగును. వారు మువ్వురు మెకంజీ దొర, బ్రౌను దొర, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారలు. కాటమరాజు కథ విషయమున మెకంజీ దొర సలిపినసేవ యపూర్వమయినది. స్థానిక చరిత్రల నాయా గ్రామములందలి పెద్దలచే వ్రాయించి యొక గొప్ప జాతీయ జీవననిధిని తరువాతి తరముల వారికి నందించినట్లే మెకంజీ దొర జానపద సాహిత్యమునం దాదరము లేని యానాళ్ళలోనే వాని విలువను గుర్తించి తత్సంబంధి రచనములను సేకరించుట యందు విశేషాదరము చూపుట గమనార్హమయిన విషయము. నేఁడు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునం దుండు కాటమరాజు కథ వ్రాఁతప్రతులు మెకంజీ దొర సంపాదించినవియు, వాని పుత్రికలను గన్నచో నతఁడు గావించిన విశేష పరిశ్రమము వెల్లడి కాఁగలదు. బ్రౌను దొర వ్రాయించిన పుత్రికలలో నా విషయము బ్రౌను దొర స్వహస్తలిఖితముగా నిట్లు కలదు.




డాల్డాతో వండబడిన ఆహారమును మీ కుటుంబమునకు ఇచ్చినచో ప్రతి మనిషికి ప్రతిదిన ఆహారములో తప్పకుండ నుండాలని డాక్టర్లచే చెప్పబడు శక్తినిచ్చు క్రొవ్వు పదార్థమును వారు పొందుచున్నారని మీరు నిశ్చయముగా నుండవచ్చును. డాల్డా గాలికూడ చొరవకుండ సీలుచేయబడిన టిన్నులలో మిక్కిలి శుద్ధముగాను, క్రొత్తగాను, ఆరోగ్యకరముగాను ఉండును. దానిని వాడుటవలన మిక్కిలి తక్కువ ఖర్చగును.

మన ఆహారములో విటమినులు ఎందుకు ఆవశ్యకము ?
ఉచిత సలహాకు ఈవేళే ఈ క్రింది అడ్రసుకు వ్రాయండి :
ది డాల్డా అడ్వైసరీ సర్వీస్, పోస్ట్ బాక్సు నంబరు 353,
బొంబాయి 1




# డాల్డా

ఆరోగ్యకరముగానుంచే వంటక్రొవ్వుపదార్థము

10 పౌన్లు, 5 పౌన్లు, 2 పౌన్లు మరియు 1 పౌను టిన్నులలో దొరకును

HVM 190-30 TL

## కుష్ఠు ★ బొల్లి

వగైరా మేహ మచ్చలు, సెగ, నవాయి వ్యాధులకు గ్యారంటీ చికిత్స. క్యాటలాగు ఉచితము.

---

**జి. వి. రెడ్డి అండ్ కో**

(రిజిష్టర్డు)

"భాస్కరాశ్రమము"

గోపాలపురం, తూ. గో. జిల్లా

లోకప్రసిద్ధిపొందిన

## పి. వి. రాజన్ అండ్ కంపెనివారి




శ్రేష్ఠమైన మదరాసు నశ్యం

**R. S. సుగంధ ముక్కుపొడి**

అన్నిటిలో సాటిలేనిది.

ధర వివరములకు వ్రాయుడు.

తయారుచేయువారు:—

**పి. వి. రాజన్ & కంపెని,**

అర్కోణం, Arkonam, N. A. Dt.

## ఆర్యరసాయనశాల
## ముక్త్యాల, కృష్ణా

స్థాపితము 1925.

ప్రశస్తాయుర్వేదౌషధములకు నిలయము. ఏ మందు కావలసినను మాకు వ్రాయుడు. నమ్మకమైనవి లభింపగలవు

ఆయుర్వేదభూషణ

**వేటూరి శంకరశాస్త్రి,**

ఎ. ఎం. ఎ. సి.

Consulting Physician

## ప్రాణసుధ



క్షీణించిన వీర్యశక్తిని పెంపొందించును. నరములకు పటుత్వమును, కండ పుష్టి నిచ్చును.

మెదడుతో పని చేయువారికి ఆప్తమిత్రము.

పశుపాతమునకు అమోఘమయిన ఔషధము.

**క్షీరబల** (101 సార్లు ఆవర్తితము)

**అయవీరము**

వాడిచూడుడు, తృప్తిచెందుడు.



**మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు**

నెం. 107-108, బ్రాడ్వే, మదరాసు.

భావాన్నైనా స్ఫూర్తికి తీసుకురావడంలో, నీకవి ఉపయోగించే శిల్ప మిదొక్కటే. ఇంతకుమించి ఏశిల్పం ఈకవి ఉపయోగించడు.

ఉక్తివైచిత్ర్యం కవి ప్రతిభనుబట్టి లక్షవిధాలుగా నుంటుంది. అలంకారాలనుండీ — సామెతలనుండీ—మాట విఱుపులనుండీ—ఇంకా ఎన్ని మార్గాలుగానైనా భాసిస్తుంది. దాని స్వరూపం, ఇలా ఉంటుందని చెప్పలేము.

"నీవు చరాచరంబేర్పడి దారి దప్పెదవుగాదా భానుడే తెంచినన్" గబ్బిలానికి పగలు కన్నులు కనపడవు, అనే విషయాన్ని భంగ్యంతరము చేత చెప్పడమిది.

"ప్రాక్తనంబైన ధర్మదేవతకుకూడ
నులికిపడు జబ్బు గలదు నీయున్నచోటు"

అంత్యకులజుని హీనంగా చూస్తున్నారన్న భావమే యిలా త్రిప్పి చెప్పబడింది. ఈ కవియొక్క ఏ పద్య భావాన్ని చూచినా, ఏదో చమత్కారం యుక్తి వైచిత్ర్యంమీదుగా తిరిగి కనుపిస్తూనే యుంటుంది.

"పక్షిసుందరి నీ చిన్ని కుక్షినిండ
నిన్ని నీరంబు ఫలహారమున్న జాలు
నెన్ని దేశాలు తిరిగిన నేమినీకు
నీవు నావలె బుట్టు బానిసవు కావు"

చిన్ని కుక్షి — ఫలహారం — మొదలైనశబ్దాలు చమత్కారంగా ఉండి పద్యానికి అందం వచ్చింది.

"ఏనికవంటి సానువు
గణేశుని నున్నని బొజ్జమీద కా
లూనగలేదు తుమ్మెద"

అక్కడ శిల్పం, వర్ణనాతీతమని చెప్పటం కవి ఉద్దేశ్యము. చెప్పటంలో చమత్కార మున్నది. భావములో గడసరితన ముంది. అంతే. దాన్ని మించి ఏమీలేదు. ఇంకా ఈ కవి ఖండకావ్యాలలో, "గిజిగాడు" "సాలీడు" "శ్మశానం" మొదలైన ఖండాలన్నీ యుక్తివైచిత్ర్యానికి పట్టుగొమ్మలు. అవన్నీ ఉదాహరిస్తే వ్యాసం పెరుగుతుంది. స్థూలంగా జాషువా కవిత్వం, ఇది — ఇది అని చూపించడమే నా ఉద్దేశ్యము. అన్నీ ఉదాహరణలు చూపించడం గూడా అంత న్యాయం కాదు.

"ముక్కు మొగమున్న చీకటి ముద్దవోలె
విహారణము సేయసాగె గబ్బిలమొకండు"

ఇక్కడ ఉత్ప్రేక్ష నాశ్రయించుకొని ఉంది చమత్కారం. ప్రతిభ యిలాంటిచోటే బయట పడుతుంది. అంత స్వతంత్రముగ నుత్ప్రేక్షించుటకు కావలసినంత ప్రతిభ కావాలి.

"వార్ధక్యముల్ దాపై పెంజెడ దెల్లనైనది నిశీధస్త్రీకి"

తెల్లవారుతుంది అనే భావాన్ని ఇట్లు చెప్పడం సొగసుగా నుంది.

"వాడు చేసికొన్న పాపకారణమేమొ
యింతవరకు వాని కెఱుక లేదు"

ఇక్కడ వాక్యాన్ని మలచి చెప్పడములో ఉంది చమత్కారం.

"వానితలమీద ఫలిమిన పంకిలమును
కడిగి కరుణింపలేదయ్య గగనగంగ"

ఇదిగూడా భంగ్యంతరేణ చెప్పడమే. ఇలా లక్ష చూపించవచ్చు. ఎంత లౌకిక భావానికైనా ఎక్కడో ఒకచోట పదును పెడుతూనే ఉంటాడు.

"త్రొక్కుడుబండిపై, నవక
క్రొత్తగ నేర్చిన కోకిలా రొుకం
డెక్కడినుండియో, అచటికేగుచు
నంకెకురాని భార్యతో
చిక్కులనందు భర్తవలె
చేతులపట్టు దొలంగి ప్రేల్మిడిన్
ముక్కున నెత్తురొల్క
పడిపోయె సుభిల్లున పేదరాలిపై"

ఈ పద్యములో సొగసంతా ఉపమాలంకారాన్ని చుట్టుకొనియుంది. ఆ ఉపమానం, ఆ నేక స్ఫూర్తులు పోతుంది. కవిప్రతిభ మూడువంతులు ఉపమ, ఉత్ప్రేక్షలను, కొంత అతిశయోక్తిని ఆవరించియుంటుంది. మిగిలిన అలంకారాలకు ఇంత నిండుతనం ఉండదు. ఉపమానాన్ని లోకములోనుంచి తీసికోవడం ఒక పద్ధతి. ఈ కవిలో నా పద్ధతి కనిపిస్తుంది. ఆ ఉపమానం తెలుగుతనాన్నిగూడా వ్యక్తం జేస్తుంది.

"మగడు కొట్టిన రోదించి మానుకొన్న
పెద్ద గయ్యాళివలె వాన వెలసిపోయె."

పై పద్యములో సామాన్య జీవితములో ఉండే సంఘటన ఉపముగా గ్రహించబడింది. ఆ పోలిక కవిలోని మాధుర్యానికి పరిపోషకంగాగూడా ఉంది. ఈ కవికి కొన్ని అలంకారాలమీద మాత్రమే మొరవడి యున్నట్లు కనుపించదు. అలంకారాలను అప్ర

యత్నంగా వాడతాడు. అలంకారాలను శిల్పవిద్యగా వాడడు. కవికి ప్రతిభ ఉంది. దాని సహాయముతో, తోచినట్లు, వాడతాడు. అందుచేత అలంకారాల శిల్పాన్ని గురించి, ఈ కవిపై వ్రాయుట మనవసరం.

కొందరి కవుల కవిత్వం ఆలోచించిన కొద్దిగా అతిశయంగా ఉంటుంది. కొందరి కవిత్వం ఆలోచించకుండా ఉండిన కొద్దిగా రమ్యంగా ఉంటుంది. జాషువా కవిత్వం ఎంత తేలికగా ఉందని చెప్పినా ఆలోచించకుండా మాత్రం స్ఫూర్తికిరాదు. ఉక్తి వైచిత్రి ప్రధానంగా కలిగిన కవిత్వం ఎప్పుడూ ఇవతలి వాడి ఆలోచన మీదే ఆధారపడిఉంటుంది. ఏ కవిత్వమైనా ఆలోచనమీదే ఉన్నప్పటికీ, ఈ ఆలోచనకు నొకవిధమైన చురుకుదనం కూడా అవసరం. అసలు కవిత్వం తేలిగ్గాఉండాలి అనే వాదానికి అర్థము లేదు. కవిత్వముయొక్క ప్రయోజనం విషయాన్ని బోధించడంగాదు. మనస్సునకు అలౌకిక సుఖానందం కలగజేయడం. దానికని కవి అనేక మార్గాలవలంబిస్తాడు. ఒకప్పుడు తేలిగ్గానే వ్రాయాలి. ఒకప్పుడు సమాసాలు గుంఫితంచేయాలి. ఒకప్పుడు క్లిష్టబంధంగానే వ్రాయాలి. ఇదంతా కవితా శిల్పం. గొప్ప కవి ఎప్పుడూ వీటి నొక ప్రయోజనంకొఱకు కూరుస్తాడు. విషయబోధకొఱకు చేసే గద్యరచన, ఎప్పుడూ తేలికగానే యుండాలి. కవిత్వం ప్రజలందరికీ అర్థముగావాలనే వాళ్ళకి రహస్యం తెలియదు. కాళిదాసు శాకుంతలాన్ని కష్టంగా ఉందని మనం తేలిగ్గా వ్రాస్తే, ఆ నాటకం గొప్పతనం పోతుంది. అంతేకాదు, ఆ నాటకాన్నే పదాలను స్థానభ్రష్టము నొందించి భావము వచ్చేటట్లు వ్రాసినా, అస్ఫూర్తి రాదు. ఈ రహస్యం కనీసం కవులని పిలువబడే వారికన్నా అర్థముగావాలి. జాషువా కవి కవిత్వంలో అర్థవ్యక్తి గుణమెక్కువ. ఏ పద్యం చదివినా దాని ముద్ర కనుపిస్తూఉంటుంది. ఈయన కవిత్వంలో ఒక అర్థముంటూ ఉంటుంది. దానికి తగినంత వ్యక్తీకరణ ఉంది. కాబట్టి ఆలోచించిన కొద్దిగా నిగ్గుతేరక పోయినప్పటికీ, నిలువకుండా మాత్రంపోదు.

కొందఱు కవులు మెత్తనిపదాలు వ్రాస్తారు—అదోకవిధంగా నాజూకుగా వాక్యం పొదుగుతారు. అర్థాన్ని ఆలోచించకూడదు. ఈ జాతికవులు నూటికి తొంభైమంది మనదేశములో నున్నారు. ఆ మిగిలిన పదిమందిలో జాషువా ఒకడు. పై వారందఱూ ఆ లోపాన్ని, వారి కవిత్వానికి గుణంగా చెబుతారు. దాన్ని విమర్శిస్తే ఆ విమర్శ నూతనంగా లేదంటారు. విమర్శ నూతనంగా ఉండటమంటే శబ్దార్థవిచారణ చేయకుండా, కృతకంగా "ఓహో" అని తలూపాలి. శబ్దార్థాల పొందికే లేనప్పుడు, — భావవ్యక్తీకరణ సామర్థ్యమే లేనప్పుడు, — అది కవిత్వం ఏమిటి? వాళ్ళవల్ల భాష, కవిత్వం, మలినాలౌతున్నాయి. కనీసం శబ్దార్థముల సాన్నిహిత్యం తెలియని కవి ఏ భాషలోనూ, ఏ దేశములోనూ, ఏ యుగంలోనూ, కవిగాడు. ఇట్టి రచనలు శ్లాఘింపబడుట మన భాషా దురదృష్టం. ఆర్థిక, రాజకీయ, సాంఘిక వాతావరణాల పరిణామాలలో, నలిగిపోయి, కవితారసికత చచ్చిపోయిన ప్రజల మనస్తత్వాన్ని, తమ స్వార్థానికి వీలుగా త్రిప్పికొని కృత్రిమంగా జీవిస్తున్నారీ కవులు. వీ రందఱూ కవులుగాదని నిరూపించటానికి జాషువా కవిత్వమే యుదాహరణం. నేనీ వ్యాసములో సాహిత్యంలో జాషువా స్థానాన్ని నిరూపించడంలేదు. ప్రస్తుతం కవులని పిలువబడే వారిలో జాషువా స్థానాన్ని నిరూపిస్తున్నాను. కవిత్వానికి జనసామాన్యానికి అందుబాటులో నుండడమే—వారి కర్థము గావడమే—ప్రయోజన మనను. ప్రౌఢంగా నుండడం ప్రయోజనం కాదూ అనను. కవిత్వం ఉంటే రెండూ కవిత్వాలే లేకపోతే రెండూ కావు. కాని ఎందులోనైనా అర్థంమాత్రం ఉండాలంటాను.

సాధారణంగా ఒక కవిశక్తి శబ్దాన్ని ఏరుకోవడము దగ్గరనుండీ ఉంటుంది. కొన్ని శబ్దాలువాడితేనే భావానికి కొన్ని వాతావరణా లేర్పడతాయి. శబ్దానికి అర్థమే గాకుండా, వాతావరణాన్ని సృష్టించుకొనే చాయ లనేకములుంటవి. సమర్థుడైన కవి వానిని తెలిసికొనును. అప్పుడు భావాన్ని వానిమీదుగా పోతపోస్తాడు. వాతావరణం సృష్టించుకోవడంలో కవి చూపే, అనేక మార్గాలలో నిదియొకటి. జాషువా కవి క్వాచిత్కంగా నీ మార్గాన్ని అవలంబిస్తాడు.

"క్రమమొప్పన్ సులతాను
మేడల నగారా మ్రోసె, నాహూత నా
దములన్ నిండె మశీదు,
లష్టనుల స్కంధావార సుందాట గు
జ్జము కెంజాలు విదిల్చె హేమలిడె."

ఇది ఉదయకాలవర్ణన. నగారామ్రోసె—అహూత—మశీదు—అష్టనుల స్కంధావారము—అటగుజ్జము—కెంజాలు—హేద—ఈ మొదలైన శబ్దాలన్నీ మహమ్మదీయ వాతావరణాన్ని, ఉదయకాలంలో నుండి కళ్ళకు కట్టిస్తున్నాయి. పై పదాలు లేకుండా ఆ భావాన్ని వేరువేరు పదాలతో సాధిస్తే అంతరక్తి

కట్టరు. పెద్దనగారి "పారశీపల్లంబు పట్టమయము...
.........తళుకుల కోరీల తిరకసమ్ము" — అన్న పద్యముగూడా దీనివంటిదే.

ఉపమ, ఉత్ప్రేక్ష, అతిశయోక్త్యాదులు కవి యొక్క భావనాపాటవమును వ్యక్తంజేస్తవి. స్వభావోక్తి కవి పరిశీలనాజ్ఞానమును వెల్లడిజేస్తుంది. ఈ కవికి భావనాశక్తితోపాటు పరిశీలనా శక్తిగూడా నున్నది. పదిమాట లెందుకు! గొప్ప కవికి కావలసిన సర్వలక్షణములున్నవి. కాని వ్యుత్పత్తిలేదు.

దెసలు బీటలువాఱ వసపట్టి పోరాడు
        కోడెను సింగములకు చెదరిపడుచు
క్రొత్త టితోపుల కల్లుక్రొవ్వు ఛిల్లుకముల
        గుటు గుట ధ్వనులకు కుదులుకొనుచు
ఊహింపరాని దేవో క్రుక్కిడి మృగాల
        వెఱ్ఱికూతలకు తబ్బిబ్బు పడుచు
కొలవిదయ్యముల టక్కరి దివ్వియలు చూచి
        యూరు డిగ్గెననుచు నూరడిలుచు
కొసరి నివ్వరిధాన్యముల్ కొఱికి నమలు
నెలుక మునిపంటి సవ్వడి కులికిపడుచు
త్రోవ గమియించు వాటి పాంథులనదేమొ
అదరి బెదరించె నొక యెండుటాకు గూడ.

అడవిని ఎంతో పరిశీలించినవాడైతే తప్ప అట్లా అన లేడు. "చణుకు చణుకున తోణికి నిష్వనము సేయ"గా నొక స్త్రీ నీరు తెచ్చుచున్నదట. ఇలాంటి భావాలను సునాయాసంగా కవి వాడటం, కవి పరిశీలనా శక్తిని తెలియజేస్తుంది.

ఈ కవి కొన్ని శబ్దాలు వాడతాడు. చలామణి, —అచోకీ—పూటాపడ్డది—మొదలైనవి. ఈ శబ్దాలు కవిలోని భావానికి ఏమాత్రం పరిపోషకంగా నుండవు. ఆ శబ్దాలలోని రూఢ్యర్థములు తావన్మాత్రముగానే భాసించి తావన్మాత్రముగా విని వృత్తము లౌతవి. అందుచే ఆ శబ్దము లంత ప్రయోజనకారులు కావు. జనసామాన్యమంతా జాషువా విశిష్టత వానిలో నున్నదనుకొందురు. ఆ పదాలు జాషువాకు సామాన్య జనులలో పేరుగూడా తెప్పించి పెట్టినవి. ఆ పదాలను తన భావానికి ఉపపోషకంగా వాడుకొనే శక్తి జాషువాకు లేదు.

ఈ కవిలో శబ్దదోషము లుంటవి తప్ప, వాక్యదోషము లుండవు. శబ్దదోషముకంటే వాక్యదోషం పెద్దది. శబ్దదోషం కవికి వ్యుత్పత్తి లేకపోవడమువలన కలుగుతుంది. వాక్యదోషం ప్రతిభ లేకపోతేనే వస్తుంది. వాక్యదోషాలను ఆధునిక కవిత్వానికి గుణంగా చెప్పడం ప్రతిభ లేకపోటాన్ని ఒకగుణంగా భావించడమవుతుంది. దోషం అంటే భావాన్ని వ్యక్తం చేయలేక పోవటమన్నమాట. జాషువాలో ఆ లోపమేమీలేదు. ఈనాడు పెద్ద, పెద్ద సన్మానాలు చేయించుకొనేవారిలో, మహాకవుల మనుకునేవారిలో, యూనివర్సిటీ ప్రొఫెసరులని పిలువబడేవారిలో, పీఠాధిపతులైన వారిలో నీ దోషములు కుప్పతిప్పలుగా నున్నవి.

జాషువా పద్యాలయెత్తుగడలు — సీసపద్యపు నడకలలో తీవి—అంతా శ్రీనాథుని ముద్ర కనిపిస్తుంది. ఏ పద్యాన్ని ముట్టుకొన్నా అర్థవ్యక్తి కలుగుతూంది. దానికితోడు కవి పలుకులో కావలసినంత మాధుర్యముంది. ఏ పద్యమైనా హాయిలుపోతుంది. రచన సర్వమూ గుణప్రధానంగా కనుపిస్తుంది. కవికి సరస్వతీ దేవిప్రసాదం కావలసినంత ఉంది.

"ఆకాశ రామ నీళ్ళాకు చక్కదనాల
        బుఱుత చుక్కలకెల్ల పురుడుపోసి"

"ముదుదుకోయిల కంఠమున నివాసము సేయు
        కొసరింపు కూతల గుట్టు తెలిసి"

ఇట్లా పద్యరచన చేయమంటే ఎంతవఱకైనా చేసుపోతాడు. "ఖండకావ్యాలు" "గబ్బిలము" "స్వప్నకథ" "ఫిరదౌసి"—ఈ కవికి గొప్ప పేరు సంపాదించిపెట్టినవి. ముఖ్యంగా పేర్కొనదగిన గ్రంథములు గూడా అవేయని చెప్పవచ్చును. ఖండకావ్యాలలో జాషువా రచన పారమ్యం పొందింది.

"చిక్కు చీకటి కుంకుడు చెట్లనీడ
నిదురబట్టెనదా తల్లి సేదు నీకు"

        "సమాధి పెట్టిరోగన్
పూని భుజాన దాల్చితిమి
        పున్నెము మూట వహించులీల నీ
మానస మోర్చునాజనని
        మాకు నొకించుక భారమైన అం
భోనిధు లెన్ని పెల్లగపి
        ద్రోసినవో, మముగన్న కద్బువన్"

ఈ భావాలు హృదయాన్ని స్పృశిస్తాయి. ఇవి "కన్నతల్లి" అనే ఖండములోనివి. ఇక్కడ రసచ్ఛాయ ఉన్నదిగదా అంటే, ఆమాత్రం ఛాయ ఏ వాక్యలోమునైనా ఉంటుంది. కాని దీనిలో భంగ్యంతరేణా చెప్పడంలోనే ప్రాబల్యముంది.

ధనానికి ఆశపడి రచించే రచనలూ—ప్రతిష్ఠ కొరకు పార్టీల బురఖాలు తగిలించుకోవడములూ— ఈ కవికి సుతరామూ ఇష్టము లేదు. కవి తన స్వయం శక్తిచేత నిలువాలంటాడు. ఈ నాటి కవులు దేశములో ఎప్పుడు ఏది ప్రాబల్యంలో ఉంటే దాని నాశ్రయించి పేరు తెచ్చుకుంటారు. జాషువా వీ రెండి టినీ తీవ్రంగా నిరసించినాడు.

"ఏ కవి పిచ్చిగా నడుచు
పృథ్వికి లోబడి కీర్తికోసము
ద్రేకము సంహరించుకొని
దేశము పోయిన ద్రోహపోవునో
ఆ కవి పేరుమాత్ర మగపెం
బుజగర్భుని రాణిగారికిన్
సాకుడు బిక్షదాక్షిగల
సామికి చేరసిక ప్రదాతకున్॥

ఇట్లా వెల్లడించిన కవి యభిప్రాయాలు కొన్ని సక్రమంగానే యున్నవి. కాని ఈ కవి విషయము తెలియక వెల్లడించిన యభిప్రాయము లెక్కుడుగా నున్నవి. ఈ కవికి కవితారీతిత్వము తెలియదు. కవిత్వం వ్రాయడం వేఱు. దాని పద్ధతి తెలియడం వేఱు, ఆ అభిప్రాయాలు వెల్లడి అయినప్పుడెల్లా, కవిశక్తి కొంచెము సలితపడుతుంది. ఆ అభిప్రాయాలు లోకములో ఆలోచనా శక్తిలేని కొందఱు నిర్మించినవి. అవి ఈనాడు నరనరాలలో వ్యాపించిపోయి, సత్యాన్ని తెలిసికోనీయవు. ఈ అభిప్రాయాలవల్ల మన కవిత్వానికి తీరని అపచారం జరిగింది. ఈ కవి వెల్లడించిన ఒక అభిప్రాయాన్ని సూచిస్తున్నాను.

"అదుది లేకయున్న, కృతి
కందము లేదని నమ్మి, ఎన్నడో
పాడి రసుత్తమ ప్రణయ
బంధురగీతము, లర్థతృష్ణవె
న్నాడ కవుల్"

ఈనాడు ప్రతి ఉపన్యాస వేదికమీద ఈ భావం మారుమ్రోగిపోతుంది. శృంగారమే ప్రధానముగా నుండవలెనని చెప్పినది ఆలంకారికులు. ఆలంకారికులు రాజులకొలువులోని వారు కారు. వారే సిద్ధాంతమునైనా నిష్కపటముగా వెలిబుచ్చురు. శృంగారములో నుండే ఉదాత్తతవారి నట్లా అనుపించింది. అంతే కాని ఆనాటి పరిస్థితులు కావు. రాజుల కొలువులూ కావు. ఆలంకారికు లెప్పుడూ తాము రసములోనుండే ప్రపంచాన్ని చూస్తారు. కవి ఎప్పుడూ రసములో నుంచే ప్రపంచాన్ని చూడాలని వారి ఆశయం. ఈనాటి కవులు రాజకీయాలలో నుంచి కవిత్వాన్ని చూస్తున్నారు. దానితో రసమార్గం దెబ్బతింటున్నది. వారికి శబ్దాలూ అవసరం లేదు. అర్థాలూ అవసరం లేదు. తమ పార్టీకి అనుకూలమైన వస్తువై తేచాలు. వారికి పది తెలుగుపదాలు, నాలుగు ఇంగ్లీషుపదాలు, రెండు వ్నర హిందీ పదాలువచ్చి ఉంటవి. వారి జ్ఞానం ఆ అవధిలో ఉంటుంది. కాబట్టి, ప్రపంచమంతా ఆ అవధిలోనే ఉండాలంటారు. అయితే ఇక నవశంకా నచోత్తరం. జాషువా కవి అభిప్రాయాలలో వీరి పద్ధతి కొంచెముపడింది. అందుచే అభిప్రాయాలను వెల్లడించినప్పుడెల్లా, తేలిపోతాడు. జాషువా పండిత లోకంలో కొంత దెబ్బతినడాని కిదే కారణం. శృంగారరసమే ప్రధానముగా నుండటానికి కారణం, దాని స్థాయిభావమైన రతి సర్వజంతు సామాన్యమైనది. శృంగారరసము పరమాహ్లాద హేతువైనరసము. మిగిలిన రసము లట్టివి కావు. శృంగారరసములో అనుభావ, సంచారి భావముల సామగ్రి మిగిలిన వానికంటే ఎక్కువ. ఏ భావాన్నైనా తనలో నిమిడించుకొనేశక్తి దానికిఉంది. అది ఎంతైనా పరిపుష్టి పొందదగిన రసం. రౌద్ర, కరుణ, బీభత్సాదులకా సామర్థ్యములు లేవు. ఈ సత్యాన్ని గ్రహించనంతవఱకూ మన కవిత్వానికి మోక్షం లేదు. శృంగారం కావ్యములో రసదృష్ట్యా జొన్పింపబడినది. అంతే కాని రాజుల మెప్పులకు కానేకాదు. ప్రతికవి ఉపన్యాసవేదిక నెక్కి "తా నిదివరలో శృంగారరసం వ్రాశానని, ఇప్పుడు కరుణ, వీర, రసాలను వ్రాస్తున్నానని" చెబుతాడు. తా నిదివరకు వ్రాసింది శృంగారసరమైనట్లు. తన ప్రేయసిమీద వ్రాసిన గీతాలన్నీ శృంగారరసమైతే యిక దాని ఔదాత్త్యం చస్తుంది. పూర్వకవిత్వాలలో ఔచిత్యం తెలిసి, యౌదాత్త్యం చెడకుండా పోషించిన శృంగారరసమున్న గ్రంథములే గొప్పగా పరిగణించబడినవి. మిగిలిన వానిని వారు క్షుద్రప్రబంధములనిరి. పాఠకు లీ సత్యాన్ని తెలిసికోవాలి. శృంగారరసాన్ని తీసేస్తే మానవజీవితంలోని, ఆయువు పట్టుపోతుంది.

జాషువా కవిలోకంలో పట్టినంత కవియని నేను చెప్పడం లేదు. ఆధునిక కవులలో లేని సంప్రదాయము — విస్పష్టమైన భావవ్యక్తీకరణ, — ఉక్తివైచిత్ర్యం —జాషువాలో నున్నవి. మిగిలిన భావా

లన్నీ వదలి పట్టి కవితాశక్తిగా చూస్తే, ఈయనలో కవితాపారమ్యం గోచరిస్తుంది. జనసామాన్యములో నుంచి వస్తువు నేరుకొని దానిని తీర్చే పద్ధతిలోగూడా ఈ కవికి ఈ కవి యేపాటి. నేటి "అభ్యుదయ" కవు లందరూ, ఈయన యెుగవడిక్రింద నడిస్తే, కొంత వఱకు బాగుండేది. సహృదయులు మన్నిస్తే ఒకమాట చెబుతాను. ఆధునిక కవులలో నింత కవితాశక్తిగల కవి లేడు.

నేను విమర్శలు వ్రాయడంలో ఉద్దేశ్యం, కవి కున్న శక్తిని యథాతథంగా చూపించడమే. అంతే కాని ఒకరిని పొగడటానికీ గాదు—ఒకరిని దూషించ టానికీ కాదు. పాపం లోకంలో కొందటికి తమశక్తిని మించి పేరువచ్చింది. నా విమర్శలు వారందరికీ కష్టము గలుగజేసినవి. దానికి నేనేమి చేయలేను. నా విమర్శకలన వారి పేరు ప్రతిష్ఠలు ఉంటాయా – ఊడతాయా—అనే దానితో నాకు ప్రమేయంలేదు. సత్యాన్ని జంకకుండా చెప్పడమేనా ఆశయం.

నా విమర్శ పురాతనంగా ఉందని, పాశ్చాత్య ధోరణిలో లేదని కొందరంటున్నారు. శబ్దార్థజ్ఞానం, భావవ్యక్తీకరణం, ఉండవద్దని ఏ విమర్శా చెప్పదు. వీరందఱూ పాశ్చాత్య విమర్శను చదివే చెబు తున్నారా లేక గాలిమాటలు పల్కుతున్నారా. ఈ గాలిమాటలే జనసామాన్యాన్ని వంచించాయి. వంచిస్తున్నాయి. ఆలోచించేవారికి సత్యం తెలు స్తుంది. నా విమర్శలు లోకములో ఆలోచించేవారికి మాత్రమే. ఆలోచించే శక్తి లోకంలో ఇంకా చావ లేదు. కవిత్వం ఎప్పుడూ చర్వణాస్వాదువు. చర్వణ అంటే ఆలోచన.



# చావు బ్రతుకులు



శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

"నువ్వు చచ్చిపోతావు"

గుండె దడదడ కొట్టుకుంది. చెవులు నిక్కబొడుచుకున్నాయి. ఒళ్లంతా ముచ్చెమటలు పోశాయి. ముందుకు వంగి వణుకుతున్న గొంతుతో అడిగాను. "నిజంగా నా స్వామీ?"

స్వామి వారు నా వంక తీక్షణంగా చూశారు. ఆ చూపుకి తట్టుకోలేక తలవంచుకున్నాను.

"అవును బిడ్డా. నేటికి సరిగ్గా పదిరోజుల తర్వాత. నీ జీవితరేఖ అంతవరకే వుంది. ఆ తర్వాత అంతా అయోమయంగా కనబడుతున్నది. అది ఒక గండం అని కూడా చెప్పలేం. పదిరోజుల తర్వాత నువ్వు జీవించటానికి అవకాశం కనబడటం లేదు. దాని అర్థం. చావు. అంతకు మినహా యింకొకటి కావటానికి వీల్లేదు" అన్నారు కరుణాపూరిత స్వరంతో స్వామి.

గజగజమని వణికిపోతున్నాను. ఎంత సమర్థించుకుందామన్నా వీల్లేకపోయింది. అయితే స్వామీ. ఇక నేను జీవించనా? అంతమయి పోవల్సిందేనా?" అన్నాను పుట్టెడు దుఃఖంతో.

స్వామివారు ప్రేమతో నా భుజంమీద తట్టి అన్నారు. "భయపడకు బిడ్డా. మనమందరం భూమ్మీద శాశ్వతంగా నివాసం ఏర్పరుచుకోలేదు. ఏర్పరుచుకోవటానికి హక్కు లేదు. ఏనాటికయినా యిక్కడినుంచి వెళ్ళిపోవల్సిన వాళ్ళమే. అలా అని దుఃఖించక మానం. ఎంతయినా మనం మానవులమే కదా."

నేను దీనంగా వారివంక చూశాను.

స్వామివారి పెదవులమీద చిరునవ్వు చిందులాడింది. "నామాటయందు నీ కెంత నమ్మకం వుందో నాకు తెలుసు బిడ్డా. నే నన్నమాట జరగక తప్పదు. అయితే నువ్వు విచారించి చేయగలిగింది కూడా ఏమీ లేదు. నీ గడచిపోయిన జీవితాన్ని నెమరు వేసుకో. మానవుడిగా పుట్టినందుకు నీ విధుల్ని నువ్వు ఎంతవరకూ నిర్వర్తించుకున్నావో స్మరించుకో. నీవు చేసిన తప్పు లేమయినా వుంటే పశ్చాత్తాపపడు. దీని వల్ల మలినపూరితమైన జీవితాన్ని సుభ్రపరుచుకోటానికి వీలవుతుంది. అంతకు మించి నువ్వు చేయగలిగింది ఏమీ లేదు" అన్నారు నా వీపు నిమురుతూ.

ఎంత ప్రయత్నించినా నా దుఃఖం ఆగలేదు. హృదయంలోని ఆవేశం, దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికినయి. కన్నులవెంబడి నీరు కట్టలు తెంచుకు ప్రవహించింది. స్వామివారి వొడిలో వాలిపోయి బావురుమన్నాను.

వారి మాటకు తిరుగులేదని తెలుసు. చిన్నతనం నుంచే వారు చెప్పినట్లే ఆచరిస్తూవస్తున్నాను. మనసులోని మాటను బయటకు విప్పిచెప్పే మనిషి స్వామివారు. సరిగ్గా యీ రోజు యిక్కడికి రమ్మనమని ఆదేశించారు ఉత్తరంద్వారా. ఎందుచేతనో తెలీదు, నా భవిష్యత్తు పదిరోజులు ముందుగానే తెలియబరిచారు.

"స్వామీ. నా భార్య...పిల్లలు వీళ్ళంతా ఏమయిపోవాలి? వీళ్ళను విడిచి నేను దూరమయిపోవాలా? ఇందుకు దారి ఏదయినా వున్నదేమో చెప్పండి స్వామీ" అంటూ వెర్రివాడిలాగా ఏడ్చాను.

స్వామి వారు చెక్కు చెదరలేదు. నా వంక సానునయంగా చూస్తూ "లాభంలేదు బిడ్డా. నీ భవిష్యత్తును గురించి ముందుగానే చెప్పవల్సి వచ్చినందుకు ఎంతగానో విచారిస్తున్నాను. పదిరోజుల తర్వాత, సరిగ్గా రాత్రి పన్నెండు గంటల అనంతరం నీకు శాశ్వతంగా చీకటి. ఎటుచూసినా చీకటి! దాని అర్థం...మరణమే" అన్నారు.

ఇక ఏం చూసుకుని ఆశపెట్టుకోను? పూర్తిగా హతాశుణ్ణయిపోయాను.

స్వామి వారు నా కెన్నో ఓదార్పు మాటలు చెప్పారు. నా జ్ఞాననేత్రం విప్పారేందుకు ఎంతగానో ప్రయత్నించారు. మానవజీవితాన్ని గురించి విపులంగా విప్పిచెప్పారు. కాని నేనా మాటలు ఒక్కటీ వినలేకపోయాను. విన్నా ఆ మాటల్లోని సారం ఆస్వాదించలేకపోయాను. తీరని వ్యథతో, అంతులేని పరితాపంతో కృంగిపోతూ పడివున్నాను.

*　　*　　*

ఆ రోజు సాయంత్రమే యింటికి చేరుకున్నాను. శ్రీదేవిని చూసి, పిల్లల్ని చూసే నా గుండె పగిలిపోతుందేమో ననుకున్నాను. హృదయం భోరున ఏడ్చింది.

గుమ్మంలోనే ఎదురయింది శ్రీదేవి చిరునవ్వు ముఖంతో. "మీకోసం గంటసేపట్నుంచీ ఎదురు చూస్తున్నాను. అయిదున్నరకే గా రైలు రావలిసింది. అన్నది మృదుమధుర స్వరంతో.

అతి కష్టంమీద దుఃఖం ఆపుకున్నాను. మరి అంతికష్టంతో చిటవు తెచ్చుకున్నాను.

"ట్రెయిను లేటయింది" అని చెప్పి లోపలకు నడిచాను.

నా ఉబ్బరించిపోయిన ముఖమూ, ఎర్రబడిపోయినకళ్ళూ, రేగిపోయిన జుట్టూ ఆవిడను ఆశ్చర్యపరిచి వుంటాయి. "అలా వున్నారేం!" అ నడిగింది వంటిమీద చెయ్యివేసి.

"తల నొప్పిగావుంది" అబద్ధం చెప్పి తప్పించుకున్నాను. ఊరికివెళ్ళిన పనేమయిందని ఆమె అడగలేదు. నేను అసలు విషయం కప్పిపుచ్చి స్నేహితుణ్ని కలుసుకోవటానికని ముందుగానే బొంకబట్టి.

"అమృతాజనం రుద్దేదా?"

"వద్దు" అన్నా యీజీ ఛైరులో కూలబడుతూ.

"కాఫీ తెచ్చేదా?"

"ఊఁ"

శ్రీదేవి కాఫీ తెచ్చేందుకని లోపలకు పోబోయింది. "మాట" అని పిల్చి "పిల్లలేరి?" అని అడిగాను.

"ఆడుకునేందుకు పోయారు" అని చెప్పి లోపలకు పోయింది. తల పట్టుకు కూచున్నాను. ఎలా యీ దుఃఖాన్ని సహించటం? ఈ ఉద్వేగాన్ని ఆపుకునేది ఎలా? ఇంతికాలం సుఖంగా బ్రతికి, భార్యను చూస్తూ, పిల్లల్ని చూసుకుంటూ ఆనందతరంగాల్లో తేలిపోయిన నా జీవితం, యికముందు అయ్యో మయాంధకారంలో బడి, ఘోర క్షయానికి దారి తీస్తుంటే నే నెలా భరించేది?

నా ముప్ఫయి అయిదేళ్ళ జీవితంలో చావును గురించి ఏ కొద్దిసార్లో ఆలోచించివుంటాను. ఆలోచించినా భయపడివుండను. ఈనాటికి గాని, ఆ ఆవశ్యకత రాలేదు.

చావంటే ఏమిటి? ఏ రూపంలో వస్తుంది? ఏ విధంగా మనిషిని కబళించి వేస్తుంది?

ఎంతో భయంకరంగా తోచింది. ఈ పది రోజులూ యీ దారుణమానసిక వేదనతో కుళ్ళిపోవాలా? శాంతి, సుఖం అనే మాటలనే మరిచిపోవాలా? భార్యని, బిడ్డల్ని చూస్తూ నా వేదనని బయట పెట్టుకోలేక మనసులో వుంచుకుని బాధపడుతూ, వ్యసనతో కుమిలి, కృశించిపోవాలా!

శ్రీదేవి కాఫీ తెచ్చింది. నా చేతి కందిస్తూ "ఏమిటి ఆలోచిస్తున్నారు?" అని అడిగింది.

"ఏమీలేదు" అని కాఫీగ్లాసు అందుకున్నాను. నోటిదగ్గర పెట్టుకున్నాను గాని రుచించలేదు. రెండు గుక్కలు మాత్రం తాగి బల్లమీద పెట్టివేశాను.

"అయ్యో. అలా వదిలేశారేమిటి అంతా?" అనడిగింది శ్రీదేవి ఆదుర్దాగా.

"మనసేం బాగుండలేదు శ్రీదూ" అన్నాను. అంతా కన్నా యింకేం అనలేక.

"ఇవ్వాళ, మీ రదోవిధంగా వున్నారు." అన్నది నా వంక చూస్తూ.

నే నేం చెప్పేది? తలవంచుకుని ఆలోచిస్తున్నాను.

శ్రీదేవి పాపం అక్కడ చాలాసేపు నిలబడింది. నా ప్రవర్తనని గురించే అనుమానిస్తూ నిల్చున్నది కాబోలు. ఎంతసేపటికి మాట్లాడక పోయేటప్పటికి చేసేది లేక లోపలకు పోయింది.

నేను తలపట్టుకు కూచున్నాను. ఈ రహస్యాన్ని మనసులో దాచుకోలేను. అది నాతరంగాదు. ఎవరితో నన్నా చెప్తేకాని కొంతవరకయినా శాంతి లభించదు అనుకున్నాను ఒకసారి.

నా పిచ్చితనానికి నవ్వువచ్చింది. ఎవరితో చెప్పకుంటాను? శ్రీదేవితో యీ విషయం చెప్పగలనా? ఆమె గుండె బ్రద్దలయిపోదూ?

చావును గురించి ఆలోచించాను. తుదీ మొదలూ కనిపించ లేదు. మరణాన్ని అనేక రూపాలుగా వూహించుకున్నాను. చనిపోయిన నా ఆప్తుల్నీ, మిత్రుల్నీ గుర్తుకు తెచ్చుకున్నాను. వాళ్లంతా యిప్పు డెక్కడవున్నారు? చచ్చిపోతుంటే ఎలావుంటుంది? వాళ్ళ ప్రాణం ఎంత గిజగిజ లాడిపోతుంది. చచ్చి పోయిం తర్వాత యిన్నాళ్ళనుంచీ ప్రేమగా చూసిన ఆ వ్యక్తి తాలూకు శరీరాన్ని, యిన్నాళ్ళు ప్రాణ ప్రదంగా చూసుకున్న శరీరాన్ని వూరిబయట స్మశాన వాటికలో...చితి పేర్చి...కాల్చి...

భయంతో వణికిపోయాను. గుండె తటతటమని వేగంగా కొట్టుకోసాగింది. అయినా ఆలోచించక వూరుకో లేక పోయాను.

కాల్చి...తర్వాత చివ్వరికి మిగిలే దేమిటి? ఎము కలు, బొమికలు, బుగ్గి. ఈ రక్తమాంసాలతో కూడిన శరీరం సమిసిపోయి అస్థిపంజరం మిగులుతుంది... మృత్యుదేవత వికటాట్టహాసంతో, వివిధస్వరూపాల్లో కళ్ళముందు నాట్యం చేసింది. కళ్ళుమూసుకున్నాను భిగుసుకుపోతూ.

"నాన్నా"

ఒక్క ప్రయత్నాన కళ్ళు తెరవలేక పోయాను.

"నాన్నా!"

కళ్ళు విప్పిచూశాను. చిన్నారి మధు పిలు స్తున్నాడు నన్ను బల్లమీద కూచుని. నా హృద యంలో ఏమూలనో ఆనందం తళుక్కుమని తొంగి చూసింది. వాడిని దగ్గరకుతీసుకుని "ఎక్కడకు పోయావు బాబూ" అనడిగాను జుట్టు నిమురుతూ.

"ఆడుకుందికి పోయా నాన్నా!"

"అలాగా బాబూ. మరి అక్కయ్యేదీ?"

"అమ్మదగ్గిరకి పోయింది. మరి నాకు బిళ్లలు తెచ్చావు నాన్నా?" అన్నాడు మధు నావంక ఆశగా చూస్తూ.

మనస్సు చివుక్కుమంది. "అరెరె. మరిచి పోయాను బాబూ. రేప్పొద్దున తెస్తాను. సరేనా?" అన్నాను సముదాయించబోతూ. వా డప్పుడే ఏడుపు ముఖం పెట్టాడు. బ్రతిమిలాడాను కొంచంసేపు. గారాబం చేశాడు. బుజ్జగించాను చాలా సేపటికి వూరుకున్నాడు.

"నాన్నా" అంటూ వచ్చింది సుధ.

"ఏం తల్లీ?"

"అమ్మ భోజనానికి రమ్మంటుంది" అన్నది. సుధ, మధు కన్న రెండేళ్ళు పెద్ద.

"నా కాకలి లేదమ్మా. మీరుపోయి తినండి" అని మధునుకూడా పంపించివేశాను. తర్వాత శ్రీదేవి వచ్చి బలవంతం చేసేంది. "మీ రివ్వాళ ఏదోయిదిగా వున్నారు. భోజనం చెయ్యకపోతే ఎలాగ? ఇంకొంచం ఎక్కువవుతుంది నీరసం. అంటూ బ్రతిమి లాడింది. ఆవిడను ఒప్పించేసరికి నాతల ప్రాణం తోకకు వచ్చింది. వెళ్ళిపోయింది శ్రీదేవి.

మిగిలింది నా దుఃఖం, ఆవేదన. ఎవరు గుర్తి స్తారు నా బాధ?

ఆ రాత్రల్లా ఏడ్చాను ఎవరూ చూడకుండా. ఏం చెయ్యాలి, యీ కుటుంబగతి యికముం దేమయి పోతుంది? అన్నది నన్ను మితంగా బాధించింది. ఆలో చనతో కుమిలి కుమిలి ఏ అర్థరాత్రప్పుడో కళ్ళు మూశాను.

* * *

మరునాటి నుంచీ కాలం నిస్సారంగా గడవ సాగింది. ఏపని చేద్దామన్నా మనసుకు స్థిమితం లేక పోయేది. ఎంతసేపూ యింట్లో భార్యనీ, పిల్లల్నీ చూస్తూవుండి పోవాలనిపించేది. నేను బతికేది యింకా కొద్దిరోజులు. నా ప్రాణప్రదంగా చూసుకున్న భార్య, ప్రాణానికి ప్రాణంగా చూసుకున్న పిల్లలూ వీళ్లనువదిలి ఆ పాడు ఆఫీసులో నిమిషాలు లెక్క పెట్టుకుంటూ ఎంతసేపని వుండేది?

"ఏమిటోయి వున్నట్టుండి అలా మారిపోయావు. మరీ అంత డీలా పడిపోయా వేం?" అనడిగారు ఒక రిద్దరు స్నేహితులు. వాళ్లకేదో సమాధానం చెప్పి తప్పించుకున్నాను.

నాలోని భయాన్నీ, విచారాన్నీ ఒకమూలకు నెట్టి నా కుటుంబగతి చూసుకోటానికి నిశ్చయించు కున్నాను. రెండో రోజు సాయంత్రం తీవ్రంగా ఆలోచించాను. అయితే నేను భయపడినంతగా జరగ బోతున్నట్లు కనిపించలేను. నా జీవితాన్ని అయిదు వేల రూపాయలకు యిన్స్యూరెన్స్ చేసుకున్నాను రెండేళ్ల క్రితం. ఇప్పటికి కట్టింది రెండువేలే. నేను చచ్చిపోయిం తర్వాత ఆ అయిదువేలూ భార్యాపిల్ల లకు చెందుతాయి. నే నిప్పుడున్న యిల్లుకూడా స్వంతమే. ఈ రెండిటితో వాళ్ళ జీవితాన్ని ఎలాగో ఒకలాగు వెళ్లబోసుకోవచ్చు. అయినా శ్రీదేవి అంత

"మరి...మరి" నా గుండె వడిగా కొట్టుకుంది. "మరి ఒకవేళ నేను చచ్చిపోతే నువ్వేం చేస్తావు?" అని అడిగేను వణికే గొంతుకతో.

వాడు ఒకనిమిషం దీర్ఘంగా ఆలోచించి "నువ్వు చచ్చిపోవు. ముసిలివాళ్ళు చచ్చిపోతారు" అన్నాడు.

"ఊహూ. ఒకవేళ చచ్చిపోతే?..."

"ఏడుస్తాను"

నా హృదయం చెయ్యిపెట్టి కెలికినట్లయింది. ఎంతో నిర్విచారంగా వాడు చెప్తున్న మాటలు నాలో తుపాను లేవదీశాయి.

"ఇంతేనా మరి. మగవాళ్ళు ఏడవకూడదు" అన్నాను తేరుకుని.

"క్షూ?"

"సహించాలి. సహించి పెద్దచదువు చదివి అమ్మావాళ్లను పోషించాలి ఏం?" అన్నాను.

"సరే"

"మరిచిపోవుగా"

"ఇదంతా చచ్చిపోతేగా?" అని పకపక నవ్వేశాడు వాడు. శ్రీదేవి ఎక్కడ వింటుందోనని భయపడ్డాను. మనసులో యిష్టం లేకపోయినా సంభాషణ మార్చక తప్పిందికాదు. నా పిచ్చిగాని యికముందేం ఘోరం జరగబోతుందో ఆ చిన్న హృదయానికేం తెలుస్తుంది.?

ఆ రోజు భోజనం చేసేటప్పుడు అంది శ్రీదేవి. "మీరు బొత్తిగా అన్నం తినటంలేదు."

జవాబేమని చెప్పను. ఒకమూల దిగులు. మరో మూల భయం నన్ను వహించి ఉక్కిరి బిక్కిరి చేసివేస్తుంటే నాకేదిమాత్రం సహిస్తుంది?

చిరునవ్వు నవ్వాను. జీవం లేకుండా.

"నేను చూస్తున్నానుగా. నవ్వటం కాదు. అసలు మీతరహాసే మారిపోయినట్లయింది. ఏమిటో ఎప్పుడూ ఆలోచిస్తూనే వుంటారు" అంటూంటే శ్రీదేవిగొంతులో కొంచంగా గీర ధ్వనించింది.

"అదికాదు శ్రీదూ...వంట్లో ఎలాగోవుంటుంది" అన్నాను ఏమీ చెప్పకుండా వూరుకోక.

"డాక్టరుదగ్గరకు వెళ్ళి మందు పుచ్చుకో కూడదూ?"

"ప్రతిస్వల్పవిషయానికీ మందులూ, మాకులూ ఏమిటీ పోనిద్దూ" అని త్రోసివేసి "మజ్జిగ పొయ్యి" అన్నాను.

"అప్పుడేనా? ఏమీ తినందే?"

"దయవుంచి నన్ను చంపబోకు శ్రీదూ, యింకేం అనలేను అన్నాను. అమె మాట్లాడకుండా మజ్జిగ తెచ్చిపోసింది. నాలుగు మెతుకులు తిని లేచి వచ్చేశాను.

మనిషికి ఆలోచించటం అనేది తెలియకుండా వుంటే ఎంతో బాగుండేది. కనీసం ఆలోచించటాన్ని అరికట్టే శక్తినయినా ప్రకృతి యివ్వగలిగితే యింతకన్నా ఎన్నో రెట్లు వికాసవంతంగా గడుస్తుంది జీవితం.

ఆలోచించకుండా వుండటానికి నేను చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయినయి. మనసు పరిధులు దాటి విహరించింది చావు ... ఎముకలు ... భయంకరంగా కళ్లముందు గోచరించినై. అందరిమానవుల్లాగానే నేనూ ఒక ఏదోరూపంలో మృత్యుదేవత ఒడిలో యిమిడిపోయి, స్మశాన వాటికలో, మట్టిలో, నా తాలూకు రక్తమాంసాలు మినహా మిగిలిన చలనం లేని అవయవాలు మట్టిలో పొర్లాడుతూ వుండగా... యిక పైకి పోలేక ఒక నిట్టూర్పు విడిచాను.

నేనున్న పరిస్థితిలో మనశ్శాంతి ఎంతో అవసరం అనిపించింది. ఏదయినా సినిమాకు సాయంత్రం పోదామనుకున్నాను. శ్రీదేవిని పిలిచాను.

"పిలిచారా?" అంటూ వచ్చింది ఆవిడ.

"అవును. ఇవేళ సినిమాకి పోదామా మరి?"

"దేనికి?"

"దేనికో ఓదానికి. ఏం?" అన్నాను.

"నాదేముంది? మీ యిష్టం?"

"సరే. పిల్లల్ని సాయంత్రానికల్లా రెడీచెయ్యి" అంటూ, శ్రీదేవి వెళ్ళిపోయింతర్వాత నిద్రపోవటానికి ప్రయత్నం చేశాను. ఎంతో ప్రయత్నం చేశాక ఒక అరగంటసేపుమాత్రం కలత నిద్ర పట్టింది.

సాయంత్రం సినిమాకి వెళ్ళాను భార్యాపిల్లలతో. మొదట బండిలో పోదామనుకున్నాను. కాని నడిచేపోతే బాగుంటుం దనిపించింది. తల్లిచేయీ మధూ, నా చెయ్యి సుధా పట్టుకుని నడుస్తూ బయలుదేరాము. అలా నడిచిపోతుంటే నా మనస్సెందుకో సంతోషంతో ఉరకలు వేసింది. ఈ ఆనందం

ఎందులో లభిస్తుంది అనుకున్నాను. మధు వేసే చిట్టి ప్రశ్నలకు జవాబులు చెప్తూ నడుస్తుంది శ్రీదేవి. ఎందుకో తెలీదుగాని నన్ను గర్వం ఆవహించింది. ఆదర్శదాంపత్యం అంటే ఏమిటో యీనాటివరకూ నాకు సరిగ్గా అర్థం తెలీదు. మా జీవితం, మాసంసారం అలాంటిదే నేమో ననుకున్నాను. మనస్సును బాధ పెట్టే సమస్య లేమీ లేకుండా వుంటే ప్రపంచంలో యింతకంటే ఆనందకరమైన అనుభవం వేరే ఏముంటుంది? అనిపించింది. రోడ్డుమీద పోయేవాళ్ళలో చాలామంది మావంక ముగ్ధత్వంతో చూడటం కని పెట్టి లోపల ఎంతగా సంతోషించానో చెప్పలేను. మధు ప్రశ్నలకు జవాబు చెపుతూ ముందుకు నడుస్తున్న శ్రీదేవి అమాయకమైన ముఖంలోకి చూశాను. ఆమె అందాన్నిగురించి నేలపోయక తప్పిందికాదు.

"శ్రీదేవికేం? బంగారు బొమ్మ!"

జవాబు చెప్పుకున్నాను. తర్వాతపోయి సినిమా చూశాము. సినిమా చూడటంలో నేనెక్కువగా లీన మయిపోకపోయినా, అందులో లీనమయిపోయి క్షణ క్షణానికి ముఖభంగిమలు మారుస్తున్న శ్రీదేవినీ, పిల్లల్నీ చూడటంలో లీనమయిపోయాను.

*  *  *  *

ఈ విషయం గడిచిపోయిన మూడురోజుల తర్వాత నేను యీజీచైర్ లో కూర్చుని వుండగా, నా చొక్కా గుండీలు సవరిస్తూ "రేపు మధు పుట్టిం రోజు" అన్నది శ్రీదేవి, ఉదయం ఎనిమిది గంటల వేళప్పుడు.

స్వామివారు చెప్పినతర్వాత అవాళ్టికి ఎనిమిది రోజులు గడిచాయి. సమయం దగ్గరకొద్దీ నాలోని భయం, ఆవేశం ఎక్కువవుతూ నే వున్నాయి. అయితే నాకు ఒక్కటే అనుమానం పట్టుకుంది. నాకింతవరకూ రోగం, రొష్టూ ఏం రాకపోవడమే కారణం. జబ్బూ, అదీ ఏంలేకుండా, హఠాత్తుగా చనిపోతానా?

"రేపేనేనా?" అన్నాను ఆనందాశ్చర్యాలతో శ్రీదేవిమాటకు జవాబుగా.

"ఊ"

ఆమె ముఖంవంక చూశాను. ఉత్సాహం కన బడుతూన్నా, నే నేమంటానోనన్న ప్రశ్న భయంకూడా అస్పష్టంగా అగుపించింది. దానికి కారణం లేక పోలేదు. నిరుడు శ్రీదేవి నన్ను యిలాగేఅడిగినప్పుడు, ఆర్థికసమస్యమూలంగా పుట్టినరోజు ఘనంగా జరుపు కు నేందుకు ఒప్పుకోలేకపోయాను.

"అయితే ఏమిటికి?" అన్నాను.

"పండగ...చేద్దామనీ...అన్నది నసుగుతూ,నసు గుతూ. ఇన్నేళ్లనుంచీ కాపురంచేస్తున్నా ఏదయినా విషయం చెప్పాలంటే ఆమె సంకోచించేవిధమూ ఆ ముఖభంగిమలూ చూస్తూంటే ఏమనుకోవాలో అర్థం కాలేదు. ఆమె చేతుల్ని నా చేతుల్లోకి తీసుకుని హృదయానికి హత్తుకుని "నీ యిష్టానికి వ్యతిరేకం చెప్తానా? అలాగే కానియ్యి శ్రీదూ" అన్నాను. ఆమె చెక్కిళ్లు సిగ్గుతో ఎర్రబడినై. ముందుకు వంగి దగ్గరకు లాక్కోబోయాను.

"అబ్బా" అంటూ నన్ను వదిలించుకుని పారి పోయింది. క్షణకాలం ముగ్ధుడనయిపోయాను.

ఆ సాయంత్రం ఆఫీసునుంచి వచ్చేటప్పుడు బజారుకుపోయి కావలిసినవన్నీ తీసుకున్నాను. వచ్చాల షావుకారుతో కావల్సినవిచెప్పి యింటికి పంపించ మన్నాను. మధుకు రెండు జతల చొక్కాలాగూలూ తీసుకున్నాము. సుధకికూడా ఖరీదైన బట్టలు తీసు కున్నా మంచివి. శ్రీదేవికి రెండు చీరెలు తీసు కున్నాను. అందులో ఒకటి మైసూరు సిల్కుచీర. ఎన్నాళ్ళక్రిందటనో అడిగింది శ్రీదేవి అటువంటిది కావాలని. కాని డబ్బు విషయం ఆలోచించే కొన లేకపోయాను.

వీటన్నిటితో బాటు అంతకు క్రితంరోజులే నా స్నేహితులతోగాని, యింకెవరితోగాని నాకున్న లావాదేవీలన్నీ తీర్చేసుకున్నాను. నా అనంతరం నాకుటుంబానికి ఎటువంటి చిక్కులూ వుండకూడదని నా అభిప్రాయం.

ఇంటికి చేరేసరికి శ్రీదేవి నాకోసం ఎదురు చూస్తూ నిల్చుంది గుమ్మంలో. ఆ రోజు ఎందుకో చెప్పరాని ఆకర్షకంగా కనబడింది. ఆనందంతో నిండిన ఆమెకన్నుల్ని చూసి ఏలోకంలోనో విహ రించాను. లోపలకి అడుగు పెడుతూండగానే పిల్ల లిద్దరూ వచ్చేసి చుట్టు ముట్టారు.

"ఏమిటో చాలా తెచ్చారు! ఏమాత్రం ఖర్చు పెట్టారేమిటి?" అనడిగింది నా చేతిలోంచి అందు కుంటూ.

"ఎంత ఖర్చు పెడితే నేం? తెచ్చానాలేదా?" అన్నాను కూచుంటూ సుధను దగ్గరకు తీసుకుని.

శ్రీదేవి అన్నీ విప్పిచూసి ఆనందాశ్చర్యాలలో మునిగిపోయింది. "ఇదిగో చూడ్రా మధూ. ఇవన్నీ నీకే. రేప్రొద్దున తలంటిపోసుకుని యివి తొడు

క్కుండువుగాని. ఇవ్వి దాచుకోనేం?" అంది ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతూ. "ఇదిగో నే సుధా. యివ్వి నీవే నే. ఈగౌను తొడుక్కుని చూసుకో" అన్నది సుధకు అందిస్తూ. "అరె. ఇంత ఖర్చు పెట్టి యిప్పుడీ సిల్కుచీరెందుకు తెచ్చారు? యిప్పుడు నేనడిగానా మిమ్మల్ని?" అనడిగింది నావంక చూస్తూ. ఆ చీరెను చూసినతర్వాత ఆమె ముఖంలో వ్యక్తమైన ఆనందంచాటున వున్న కొద్దిపాటి విచారం, పొదుపరితనం నా కళ్ళబడింది.

"నీ కిష్టమేగా."

"అయితేనూ! యిప్పుడేనా దానికి సమయం, ఇన్ని ఖర్చులతో పాటు..."

"ఇంక చాలిద్దూ" అన్నాను నేను. "నువ్వెప్పట్నుంచో మనసుపడ్డావా యి దీన్ని గురించి. తీసుకొద్దామంటే ఎప్పటికప్పుడు వీల్లేకపోతున్నది. ఆమాట లిక మానేసి చక్కా కట్టుకో" అన్నాను సలహా రూపంలో.

శ్రీదేవి మారుమాట్లాడలేదు.

మధు, సుధ వాళ్ళబట్టల్ని చూసుకుంటూ వాళ్ళ ధోరణిలో వాళ్లున్నారు. హఠాత్తుగా శ్రీదేవి నావంక చూసి అడిగింది. "అరె. యిదేమిటి? మీకేం తెచ్చుకోలేదేం?"

నేను తెల్లబోయి చూశాను. "ఎందు నాకు? నాకిదివరకే చాలా వున్నాయి" అన్నాను.

ఆమె ముఖం చిన్నబోయింది. "ఇదివరకటి సంగతెందుకు యిప్పుడు. మాకుమాత్రం లేవా? పండగ మాకొక్కళ్ళకేనా? మీకు లేకుండా మాకేనా కావల్సింది" అన్నది రుద్ధకంఠంతో.

"అదికాదు శ్రీద్దూ..." అని యింకా ఏమో చెప్పబోయాను.

"మీరు యింకా ఏమీ చెప్పక్కర్లేదు. మా అందరికీ తెచ్చి మీరు వుత్తగావుంటే మాకు సంతోషంగా వుంటుందా ఏమన్నా? మాట్లాడరేం?" అంది యిందాకటి స్వరంతోనే. నాకూడా మనస్సులో లాగా కలికి వేసినట్లయింది. ఈ చిన్న విషయంవల్ల ఆమె కింత కష్టం, బాధ కలుగుతాయని అనుకోలేదు. అయినా ఎందుకు నాకు: ఇవ్వాళా, రేపటి భాగ్యానికి...

హృదయం రోజూ ఏడుస్తూనేవుంది. ఇప్పుడూ ఏడ్చింది. శ్రీదేవి సంతోషానికి ఆరాత్రి నాకో జత పంచ, చొక్కా కొనుక్కోక తప్పలేదు.

*                *                *                *

మరునాడు యింట్లో పండుగ ఘనంగా జరిగింది. మధు ముఖంలో ఆనాడు ఎంత ముగ్ధత్వం వెల్లి విరిసిందో చెప్పలేను. వాడిమీద వాత్సల్యం పెల్లుబికింది. వాడు ఆరోజంతా కలకల్లాడాడు. చనిపోతూ చనిపోతూ భార్యా బిడ్డల ముఖాల్లో యింతఆనందం చూసినందుకు నా భాగ్యానికి ఎంతగానో అభినందించుకున్నాను. అమ్మలక్కలంతా వాడిని ఆశీర్వదించారు. హృదయపూర్వకంగా, కన్నీళ్ళతో నేనూ ఆశీర్వదించాను. డాక్టరువికమ్మని.

ఆరాత్రి స్నేహితులకి డిన్నర్ ఏర్పాటు చేశాను. చాలా సంతోషంగా గడిచింది. నన్నాశీర్వదించారు కొందరు మిత్రులు, త్వరలో యింకో పాపను ఎత్తుకొమ్మనమని. ఏడుపులో నవ్వు వచ్చింది.

అంతా అయిపోయేటప్పటికి పదకొండయింది. స్నేహితులంతా వెళ్ళిపోయారు. పిల్లలు పడుకుని నిద్రపోసాగారు. శ్రీదేవికూడా పడుకుంది. నాకెంత ప్రయత్నించినా నిద్ర రాలేదు. ఎంత అపుకుందామన్నా ఉద్వేగం ఆగలేదు.

ఇంకా ఒక్కరోజు బ్రతికేది. నేను జీవితంలో ఏం అనుభవించినా, ఏం చూసినా యీ కొద్దికాలంలోనే. ఆ తర్వాత—యింకో యిరవై నాల్గు గంటల తర్వాత...?

తిరిగిబుర్ర వేడెక్కిపోయింది. లేచిఅటూ, ఇటూ తిరిగాను కాసేపు. నిద్రపోతున్న పిల్లలవంక తనివితీరా చూశాను. వంగి యిద్దర్నీ మనసారా ముద్దు పెట్టుకున్నాను. నా కన్నీరు చెంపలమీంచి జారి వాళ్ళమీద పడినప్పుడు వాళ్ళకెక్కడ మెలకువ వస్తుందోనని భయపడ్డా సమితంగా.

శ్రీదేవివంక చూశాను. నిర్మలంగా నిద్రపోతూంది. ఆమె కంఠంలో దాక్కుని తొంగి చూస్తున్న మాంగళ్యం బెడ్‌లైటు వెలుగులో కంటబడగానే నాకు దుఃఖం ఆగలేదు.

"ఏడుస్తున్నారా?" అని శ్రీదేవి అడిగేటప్పటికి ఉలిక్కిపడ్డాను. నా కన్నీరు జారి ఆమెకు నిద్రాభంగం చేసినట్లు అప్పటికిగాని తెలియలేదు.

నాకేం జవాబు చెప్పాలో తెలీక తడబడపడి "అబ్బే...ఏం...ఏంలేదు" అన్నాను ఆమె ప్రక్కన కూచుంటూ.

శ్రీదేవి నా ముఖంవంక పరిశీలనగా చూస్తూ "అబద్ధం చెప్పకండి. మీ రెందుకో అదోవిధంగా వుంటున్నారు. మీ పరిస్థితిచూసి అర్థంగాక నాలో నే నే కుమిలిపోతున్నాను. చెప్పరా?" అంటూ నా ముఖం తనవంక తిప్పుకుని దీనంగా చూసింది.

కరిగిపోయాను మంచులాగా. ఆ క్షణంలో నాలో దాగున్న సర్వస్వం, యిన్నిరోజులు అట్టి పెట్టుకున్న నా దుఃఖం పూసగ్రుచ్చినట్లు చెప్పే యాలన్నంత ఆవేశం కలిగింది. అతికష్టంమీద నన్ను నేను నిగ్రహించుకున్నాను.

"ఏంలేదు శ్రీదూ. ఎందుకో మనశ్శాంతి లేకుండా వుంది" అన్నాను అబద్ధం చెపుతూ.

"ఎందుకూ శాంతి లేకపోవటం? మీమనస్సులో ఏదో బాధ భరిస్తున్నారు. ఇటు చూడండి. నిజంగా?" అంటూ అడిగింది నా కళ్ళవంక సూటిగా చూస్తూ.

"నీతో అబద్ధం చెబుతానా శ్రీదూ?" అన్నాను బాధపడుతూనే.

నమ్మింది పాపం. "ఎందు కనవసరంగా అలా బాధపడతారు? హాయిగా పడుకోండి" అన్నది నా చెంపలు నిమురుతూ.

"శ్రీదూ!"

"ఊ"

"నేనంటే... నీకు... ప్రేమేనా?"

"అమ్మో. ఇదేమిటండి? ఇన్నాళ్ళనుంచి మీతో సమంగా వుంటున్న నన్ను యింకా అర్థం చేసుకోలేకపోయారా? మీకంటే, పిల్లలకంటే నాకొక్కవాల్సింది ఏముందింక?" అన్నది గద్గదిక కంఠంతో.

"అమ్మో శ్రీదూ" అనుకున్నాను మనసులో.

"శ్రీదూ. అబ్బ" అంటూ ఆమెను నా హృదయానికిదగ్గరగా, మరెప్పుడూ విడిచిపెట్ట వద్దన్నంత దగ్గరగా, రెండు హృదయాలు ఏకమై పోవాలన్నంత దగ్గరగా ఆమెను హత్తుకున్నాను.

* * * *

మరునాడు వచ్చింది.

ఆరోజు ఒక్కొక్క నిమిషం నాపాలిటి యమ దూతలాగే కనిపించింది. ఆఫీసుకు పోయేందుకుకూడా భయం వేసింది. దార్లో ఏమవుతుందో ఏమో. సెలవు రాసి పంపించాను.

ఆరోజు నేను చేసిన ప్రతిపనీ పిచ్చిపనిలాగా కనిపించిందంటే ఆశ్చర్యం కాదు. భార్యా పిల్లలు కంటికి కనిపిస్తుంటే నేను మనిషిలాగా వుండలేక పోతున్నాను. అందుచేత నా గదిలోకివచ్చి కూచుని పుస్తకాలన్నీ పిచ్చిగా తిరగవేయసాగాను.

"ఇవాళ ఆఫీసుకుపోలేదేదమని" అడిగితే "ఇంట్లో వుండిరాయవలసింది బోలెడంత వుం"దని జవాబు చెప్పాను శ్రీదేవికి. అంచేత గదిదగ్గరకు ఎవ్వరూ రాలేదు.

సెకన్లు, నిమిషాలు, గంటలు గడిచిపోతు న్నాయి. ... నా ప్రాణం తల్లడిల్లిపోతూంది.

రాత్రి భోజనందగ్గిర బంగాళదుంపల కూర వేసి "మీకిష్టమని చేశాను" అన్నది శ్రీదేవి. చిరునవ్వు న్నాను. ఔను. ఇకముందు తినలేనుగా. కడుపారా తృప్తిగా తిందామనుకున్నాను. కాని ఎంత ప్రయ త్నించినా ముద్ద మింగుడు పడలేదు. పీకమీద కత్తి పెట్టి తినమంటే ఎంత యిష్టమైనదిమాత్రం ఏం తిన గలుగుతాం?

రాత్రి పదయింది. శ్రీదేవి పక్కలు వాల్చింది. కళ్లారా ఒకసారి అందర్నీ చూసుకుని "నే నాఫీసుకు సంబంధించినది రాసుకోవాలి శ్రీదూ. అప్పుడే పడు కోను. మీరు నిద్రపోండి" అన్నాను శ్రీదేవితో.

"నిద్ర పాడుచేసుకొని రాత్రిపూట ఎందుకు? రేపొద్దున చూసుకోకూడదా?" అంది.

"కాదులే. అర్జంటయినపని" అనిచెప్పి గదిలోకి వెళ్ళిపోయాను. చాలా సేపటివరకూ శ్రీదేవి కదులుతూనే వుంది. నిద్ర పోయిందని నిశ్చయం చేసుకున్న తర్వాత గది తలుపులు గడియవేసుకుని గోడనున్న గడియారం వంక చూశాను.

పదకొండయింది.

ప్రాణాలు ఉగ్గబెట్టుకుని అటూ యిటూ తిరుగు తున్నాను. ఏరోగం రొష్టు లేకుండా నాకు చావు ఏవిధంగా వస్తుందో అని ఎదురుచూడసాగాను.

దుఃఖాన్ని నానుండి దూరం చేసుకున్నాను. కాలం ఎలానూ సమీపించింది. దుఃఖపడుతూ కూర్చుంటే ప్రయోజనం ఏముంది? స్థిరచిత్తంతో కొంతసేపు పరమేశ్వరుణ్ని ప్రార్థించాను. తర్వాత సాధ్యపడలేదు. కాగితం, కలంతీసి శ్రీ దేవి పేరిట ఒక

ఉత్తరం రాశాను. ఇలా చనిపోతున్నట్టూ, వాళ్ళ అభివృద్ధికోసం నేను చేసిన ఏర్పాట్లూ, మధును డాక్టరు చదివించమనీ పిల్లల్ని ప్రాణప్రదంగా చూసుకొమ్మనీ రాసి డ్రాయరులో పెట్టాను.

తిరిగి ఆలోచన్లు కొల్చుకు తిన్నాయి.

ఎలా వస్తుంది చావు? ఏ కాలకూట విషసర్పమో యీగదిలో పొంచివుందా? లేక హఠాత్తుగా గుండె ఆగి చనిపోతానా?

స్వామివారు చెప్పినమాటలు నా వీనుల్లో ప్రతిధ్వనించాయి. "పదిరోజులతర్వాత రాత్రి పన్నెండు గంటల అనంతరం నీకు శాశ్వతంగా చీకటి. ఎటు చూసినా చీకటే."

అదురుతున్న కళ్ళతో గడియారంవంక చూశాను. పావు తక్కువ పన్నెండు.

హృదయం బద్దలయేటట్లు కొట్టుకొంటున్న నాగుండె వడిని ఆపుదామని రొమ్ముమీద గట్టిగా చెయ్యివేసి నొక్కుకున్నాను. ... ఒళ్లంతా వెచ్చగా వుంది. భయంచేతనా? సరిగ్గా ఊపిరిపీల్చుకో లేక ఉక్కిరిబిక్కిరి అవుతున్నట్లుగావుంది. కిటికీ తలుపులు కూడా మూసివున్న కారణంచేతనా?

కళ్ళముందు ఏడుస్తూ ఆలుబిడ్డలు గోచరిస్తున్నారు. గుండెలు బ్రద్దలయేటట్లు ఏడుస్తున్నారు. భయంతో గట్టిగా కళ్ళుమూసుకున్నాను.

ఉన్నట్టుండి గదంతా వెచ్చగా మారిపోతున్నట్లు అనిపించింది. ఏదో ఉక్కిరిబిక్కిరిచేసే వాసన నన్ను అశక్తుడ్ని చేసివేస్తూంది. దూరంగా ఎక్కడో ఏడుపులూ, అరుపులూ చెవుల్లో చిన్నగారొద పెడుతూ కృంగదీస్తున్నాయి.

ఇవన్నీ మరణానికి ముందు లక్షణాలా?

అతి ప్రయత్నంమీద కళ్లు తెరిచాను. గడియారం వికటాట్టహాసం చేస్తూ ప్రత్యక్షమయింది. ఒక్కసారిగా ఆనందంతో అరవబోయి తట్టుకున్నాను. పన్నెండు దాటింది. బ్రతికానా? స్వామివారిమాట అబద్ధమయిందా?

సంతోషంతో ఎగిరి గంతు వేద్దామనుకున్నాను. కాని యిదేమిటి? గదంతా తెల్లగా ఏదో వ్యాపిస్తుందేమిటి? ఏమి టలా వేడిగా? బ్రతికివుండి యిలా ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నా నేమిటి?

ఎక్కడనుంచో భయంకరంగా అరుపులు వినిపించాయి. ఏం జరుగుతుందో తెలుసుకోటానికికూడా అశక్తుడ్నయాను. ఒక్క ఉదుటున వెళ్ళి తలుపులు తీశాను. వెంటనే కెవ్వుమని కేకతో క్రింద పడిపోయాను.

మంటలు. ఇల్లంతా మంటలు. ఉవ్వెత్తున వికటాట్టహాసంతో ప్రజ్వరిల్లుతున్నాయి. ఏనుగుబలంతో లేచి నిల్చున్నాను. నా భార్య, బిడ్డలు, వాళ్లేమయిపోయారు! నావళ్ళు నాకు తెలిసేస్థితిలో లేను. ఒక్క విసురున మంటల్లోకి దూకాను.

నా శక్తికొద్దీ మంటల్ని అటకాయించాను. పిచ్చిగా కేకలువేస్తూ పిల్లల్ని పిలిచాను. మంటలు నన్ను నిలవనివ్వలేదు. బయటకి తరిమికొట్టాయి? ఏమయిపోయారు నాపిల్లలు? ఎలా నిల్చునేది అక్కడ?

నేనెలా బయటకు చేరుకున్నానో తెలీదు. నన్నెవరో గట్టిగా పట్టుకున్నారు. ఆ తర్వాత ఏమయిందీ తెలీదు.

కళ్ళు తెరిచి లోకంలో పడేటప్పటికి కాలిపోయి వికృతరూపంలోవున్న మూడు స్వరూపాలు పడివున్నాయి. వాడిమీదపడి హృదయం బ్రద్దలయేటట్లు ఏడిచాను. ఏంచేస్తే నా దుఃఖం తీరుతుంది? ఏంచేస్తే వాటికి తిరిగిజీవం వస్తుంది? ఏడ్చిఏడ్చి నాగుండె పగిలిపోతే బాగుండు ననిపించింది. అయ్యో. ఇక నేనేం చూసుకుని బ్రతికాలి?

తలఎత్తి చూశాను. నాయింటి గోడలు మాత్రం ఏడుస్తూ కనిపించాయి. నలుగురూ నన్నోదార్చారు. వాళ్ళ మాటలు నేను వినలేదు. స్వామివారు చెప్పిన మాటే నాకు పదేపదే వినిపించింది. "ఆమీదట శాశ్వతంగా చీకటి. దాని అర్థం...?"

* * * *

బ్రతుకుతున్నాను — చచ్చిపోయి.

# ఇటలీ తొలి చిత్రకారులు



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

యూరపు చిత్రకళకంతకూ ఇటలీయే జనస్సీమ. కాదన్నా, అవునన్నా ఫ్రాంసులో వచ్చిన ఇంప్రెషనిజము, పోస్టు ఇంప్రెషనిజము – ఇంగ్లండులో వచ్చిన ప్రీరఫేయలిటిజమే కాక, ఈనాటి క్యూబిజము, ఎక్స్‌ప్రెషనిజమువరకు ఉన్న అన్ని సజీవమైన కళావిధానాలు ఇటలీ తొలి చిత్రకారుల కృషిలో బీజప్రాయంగా ఉన్నవే!

సింధునదీ, నైలునదీ నాగరికతలవలెనే ఇటలీ పురాప్రాభవముకూడ చరిత్ర కందదు. క్రీస్తు పూర్వము 4వ శతాబ్దానికే గ్రీకు శిల్పము ప్రఫుల్లమై సౌందర్యావధులు విరియబూసింది. సుప్రసిద్ధులైన గ్జియోక్సిస్, ఎపెలిస్ చిత్రాలు ఇప్పుడు ఒకటీ కనపడకపోయినా, తరువాతివైన పాంపే కుడ్యచిత్రాలు, అలెగ్జాండ్రియా రూపచిత్రాలు ఆనాటి క్లాసిక్ చిత్రరచన ఎంత ఉన్నతస్థాయినందుకున్నదో తెలియజేస్తాయి. గ్రీకులతరువాత ప్రాబల్యం సంపాయించుకున్న రోమనుల హయాంలోకూడ చిత్రకళ పోషించబడింది. కాని రోము పతనంతో లలితకళలన్నీ రూపరిపోయినాయి.

ఆ అంధయుగంలో కళలు పూర్తిగా విస్మరించబడ్డాయి. చర్చి తొలిరోజుల్లో ఫాదరీలు కళలు పాపభూయిష్టమైనవని అణచివేశారు. ఇహ జీవనమంతా అప్రసక్తముగా రాబోయే జ్యోతిర్లోకంకోసం ఎదురుచూడటమే అని వాళ్ళ ఆదేశం. ఇటలీ ప్రాచ్య సామ్రాజ్యానికి ఆనాటి స్టేట్ రిలిజియన్ అతినిరంకుశము, కర్కశము అయినది. ఏవిన్యాసము లేని, గాజుముక్కలు, గండశిలలూ పొదిగిన కర్రపడి బొమ్మలే ఆనాటి కాన్‌స్టాంటినోపిల్ చర్చి విహారాలంకారాలుగా చెలామణి అయినాయి. మతావేశపరుల పాషండ హృదయాల్లో సుకుమారమైన తూలికావిలసనానికి తావు లేకపోయింది.

క్రొత్తగా జయించిన గోతిక్ అనాగరికజాతులు ఇటలీలో స్థిరనివాసం ఏర్పరచుకొనేరోజుల్లో కట్టిన చర్చిలలో అలంకారాలు విన్యసించారు, వాళ్ళతో వచ్చిన బిజెంటిన్ చిత్రకారులు. బలిపీఠమువద్దా, కుడ్యచిత్రాలుగా ఇదివరకు మూర్తులే రేఖల్లో, వర్ణాల్లో రూపొందినాయి. విధానమే మారిందిగాని చిత్రితవిషయం ఒకటే. పసుపు పచ్చని బంగరు పూత మీద ఎరుపు నీలము ప్రధాన వర్ణాలుగా బిజెంటీను భంగిమల్లో మూర్తులు విన్యసించబడినాయి. వాటి విప్ఫారితకళ్లు తెరిచూస్తూ గంభీర ముద్ర కుదించుకు నుంటాయి. శిశు బాలమూర్తులలో ముసలిరేకలు, క్రీస్తు కరుణావలోకనాల్లో కర్కశత్వము, పత్తికాయల్లాంటి మెడోనో చూపుల్లో భావశూన్యత—ఇవి సర్వసామాన్యమైన లక్షణాలు ఆచిత్రాల్లో.

క్రిస్టియను సెయింట్లలో ఫ్రాన్సిసుకు ఒక విశిష్టమైనస్థానముంది. ఆయన ప్రభావంలోనే నవ్యకళాచరిత్రకూడ ప్రారంభమయింది. ఆయన చాల దయాస్వభావం కలవాడు. నిరంకుశమైన మతాహంకారం మాయించి ప్రేమపూరితమైన మతాన్నుపదేశించి దివ్యధామానికి దారిచూపిన మొదటివాడు. ఆయన అతిలోకమయిన త్యాగశీలంతో భగవంతుణ్ణి మనిషికే కాకుండా పశుపక్ష్యాదులకుకూడ చేరువగా తీసుకొచ్చాడు. నదీనదాలు, కొండలూ, లోయలూ—చెట్లు, చేమలూ—పిట్టలూ అన్నీ తనతో బాటు దేవప్రార్థనలో కలిసి రావాలని ఆయన ఆశించేవాడు. అవన్నీ తనతో పుట్టినవే అనేవాడు. ప్రకృతితో శ్రుతి కలిపాడు తన జీవన తంత్రులు ఫ్రాన్సిసు. దానితో కళలకూ ప్రకృతి చేరువయింది. ఈవిధంగా

ఫ్రాన్సిసు బోధించిన భూతదయ, ప్రకృత్యారాధన, మానవత-చిత్రాల్లో ప్రస్ఫుటమవడం ప్రారంభించినాయి. బొమ్మలవెనుక ఉండే బంగరుపూతపోయి ఆ స్థానంలో ఒక ప్రకృతి దృశ్యం ఆక్రమించింది. చిన్న-చిన్న మొక్కలు, పూవులు, చివుళ్లు — రంగురంగుల పిట్టలు, కూతలు — పిలపిలలాడటం ప్రారంభించినాయి చిత్రాల్లో.

మొట్టమొదటగా చిత్రాల్లో ఈవిధమైన మార్పు తీసుకువచ్చింది సిమాబ్యూ అనే ఒక ఫ్లోరంటేన్ చిత్రకారుడు. ఆయన 1240 లో పుట్టి 1302 దాకా ఉన్నాడు. ఆయనచిత్రాల్లో బిజాంటైన్ ఛాయలు విడవలేదు. కాని ప్రథమంగా మానవత, జీవం - భావం మొలకెత్తినాయి ఆయన చిత్రాల్లోనే. అందుకనే ఫ్రాన్సిసు చనిపోయినాక ఆయన భౌతిక దేహాన్నుంచిన చెర్చిని అలంకరించడానికి సిమాబ్యూను నియమించారు. ఈ సందర్భంలోనే ఆయన శిష్యుడైన గయాటో సిమాబ్యూకు సాయంగా పనిచేసి ప్రసిద్ధుడైనాడు. జీవకారుణ్యాన్ని బోధించి, సర్వభూతసముడై, దీనబంధువైన సెయింట్ ఫ్రాన్సిసు భావాలు చక్కగా జీర్ణించుకున్న గయాటో యూరపు చిత్రకళాచరిత్రకు మూలపురుషుడయ్యాడు.

గయాటో ఒక గొఱ్ఱెలకాపరి కుఱ్ఱవాడు. తను కాచే గొఱ్ఱెలు చూచి పలకమీదరాస్తుంటే ప్రసిద్ధచిత్రకారుడు సిమాబ్యూ ఆదారిని పోతూ చూశాడు. కుఱ్ఱవాడిలో ఉన్న కళాభినివేశానికి ఆశ్చర్యపోయి తండ్రి అనుమతితో తనవెంట తీసుకుపోయాడు ఫ్లోరెన్సుకు. ఆసెసిచర్చిలో సెయింట్ ఫ్రాన్సిసు జీవితగాథలు చిత్రించేప్పుడు కొన్ని కుడ్యభాగాలు గయాటో చిత్రించడానికి ప్రత్యేకించాడు సిమాబ్యూ. అందులో గయాటో నిరర్థకము, నిర్జీవము అయిన సంప్రదాయాల్ని లెక్క చేయకుండా ప్రకృతి సహజము, అతిలోకము అయిన స్వీయ రచనాప్రాభవముతో ఫ్రాన్సిసు దివ్యగాథలు రమణీయంగా చిత్రించాడు. ఆసెసిచెర్చిలోనేకాక రోములోకూడా "ఫ్రాన్సిసు నిర్యాణము", "హెరాడ్ జన్మదినోత్సవము" మొదలైన ప్రఖ్యాత చిత్రాలు రచించాడు. అన్నిటికంటె ప్రసిద్ధమైనవి ఆయన అరినాచాపెల్ కుడ్యచిత్రాలు. పాడువాలో ఆచిత్రాలు చిత్రించింది 1306 అని నిర్ధారించవచ్చును. ఏమంటే ఆ సంవత్సరమే డాంటె కవి గయాటో అతిథిగాఉండి చిత్రవిషయసేకరణలో సలహాలు యిచ్చినట్టు నిదర్శనాలున్నాయి. పెట్రార్క కవికూడ గయాటో మిత్రుడు.

సిమాబ్యూ చిత్రాలు, గయాటో చిత్రాలు చూస్తే రచనావిధానాల్లో శిష్యుడు ఎంతపురోగామిగా ఉన్నది ద్యోతకమవుతుంది. అయితే సిమాబ్యూ తెచ్చిన కొత్తదనము, లాలిత్యము అర్థం చేసుకోవాలంటే అతనికి పూర్వీకులైన చిత్రకారుల కృషితో పోల్చాలి. వికృతములు, నిర్జీవములు అయిన బిజాంటేను చిత్రాలకన్న అనేకవేల రెట్లు సౌకుమార్యం, సౌందర్యం సాధించినాయి. అందుకనే ఆనాటి జనం ఆయనకంత బ్రహ్మరథం పట్టారు. సెంటుమేరియా నోవెల్లా కోసం చిత్రించిన "మెడోనా" చిత్రం పురవీథుల్లో తప్పెటలు, తాళాలతో మహోత్సాహంతో ఊరేగించి తీసుకు వెళ్లారు. సిమాబ్యూదే తనకాలానికి ఎంతో ముందడుగు. గయాటో అంతకంటె ముందడుగు వేశాడు.

గయాటో మూర్తి కల్పనలో ఎక్కువ స్వతంత్రత, మానవత — చిత్రకల్పనలో వినూత్నమైన వాస్తవికత, నాటకీయత ద్యోతమానమవుతాయి. సిమాబ్యూకంటె గయాటోలో రంగుల మార్దవము, రంజకత ప్రకృతి సహజంగా ఉంటాయి. గయాటో రచించిన పాడువా కుడ్య చిత్రాలు చూస్తే 14 వ శతాబ్దం ఊహలు, కళాకౌశలం ఏస్థాయిలో ఉన్నది ద్యోతమవుతుంది. పాశ్చాత్యకళలో వాస్తవికత అంటే వాళ్ల దృష్టి వేరు. ఆ పద్ధతుల్లో చూస్తే గయాటో చిత్రాలు ఇంకా నిలవవు. ఆయన చిత్రాల్లో పర్‌స్పెక్టివ్ ఉండదు. మనుష్యులకంటె చెట్లు కొండలు చిన్నవిగా ఉంటాయి. చెట్లకు లెక్కకు పదిఆకు లుంటాయి. అయినా ఆరోజుల్లో పొలాలు, చెట్లూ, పూవులు బొమ్మల్లోకి రావడమే అబ్బురం, బొమ్మల్లో కదలిక, జీవం మొట్టమొదట విన్యసించి, చిత్రితవిషయం విస్తృతం చేసినవాడు గయాటో. చలనరహితమైన గంభీరముద్రలోంచి కళకు జీవసంచలనం కల్పించాడు. ప్రసిద్ధుడైన బొకాషియో తన గ్రంథంలో గయాటో ప్రతిభనురించి వక్కా

ణించాడు. ప్రకృతిలో ఆయన చిత్రించలేనిది లేదనీ, ఏది చిత్రించినా అచ్చంగా ఆ వస్తువులాగానే ఉంటుందని ప్రశంసించాడు.

గయోటో చిత్రకారుడే కాక వాస్తునిర్మాత. ఆయన డిజైను చేసి కొంతవరకు మలచిన బెల్ టవరు ఆయన శక్తిని ఇప్పటికీ వేనోళ్ల చాటుతుంది. దాని మీద చెక్కి ఉన్న "కళలు, వృత్తులు" అన్నది ఆయన శిల్పించిందే! అంతటితో 1337 లో గయోటో చని పోయాడు.

15 వ శతాబ్దంలో గయోటో తీసుకు వచ్చిన ప్రకృతి వాదం రెండు దారులు తీసింది. ఒకటి భావ ప్రధానమైనది, రెండవది భౌతికవాదం. చిక్కని భావావేశంతో, రాగరంజితమైన అంగవిన్యాసాలతో చిత్రణ సంకల్పించింది ఒకస్కూలు. రెండవది వాస్తవికదృక్పథంతో బాహ్యరూప రచనావిన్యాసాలు పరిశీలిస్తూ వచ్చింది. ఈ స్కూలు యధార్థవాదాన్ని పురస్కరించుకొని కళాసంవిధానానికి సంబంధించిన అనేక సమస్యలు పరిష్కరించింది. 'పర్ స్పెక్టివు', 'ఎనాటమీ', 'నూడ్ స్టడీ' అన్నవి ఈ స్కూలుకు సంబంధించినవే. ఇక అప్పటినుంచీ ఈనాటివరకు ఈ రెండుశాఖలూ పాశ్చాత్య కళాలోకంలో అంతర్భాగాలుగా ప్రవర్ధమానమౌతూనే ఉన్నాయి. ఆ ఆకాశాల్లో నవజీవం పోసుకుని, పునరుద్ధరణలు పొందే సమయాల్లోకూడా ఈ రెండురకాలయిన వాదాలు బలం పొందినాయి. రెండురకాల చిత్రకారులు ఉంటూ వచ్చారు ప్రసిద్ధులుగా.

ద్విధావిభిన్నమైన యీ కళాపథాల్లో ఒకదానికి హృదయము, ఒకదానికి మేధస్సు ప్రధానమనుకుంటే ఏనాటి కళాచైతన్యంలోనూ ఈ రెండురకాలయిన ప్రసిద్ధులైన చిత్రకారులు కనిపిస్తారు. మొన్న మొన్నటి ఫ్రెంచి విప్లవకళలో విసెంటు వేంగో హృదయవాది. సిజనె, మేనెట్ శాలూకు కృషి మేధస్సుకు సంబంధించింది. ప్రీరేఫియలైట్ లలో రోజెట్టి హృదయవాది. మిలియాసు, హంటుచిత్రాలు మనస్సుకు సంబంధించినవి. ఇక ఈనాటి చిత్రకారులలో పికాసో మేధస్సు పొలిమేరలు పారమాస్తే, మార్కు చాగల్ అగాధ హృదయగాథలు తవ్వి పోశాడు. అయితే ఈ రెండువిధానాలూ అనాటి చిత్రకారుల్లో ఎల్లా వర్ధిల్లినాయో విచారిద్దాము.

గయోటో సన్నిహిత అనుయాయి ఆండ్రియా ఆర్కాగ్నా. ఆయన రచించిన 'వర్జిను కొరనేషన్' నేషనలు గాలరీలో ఉన్నది. ఆర్కాగ్నా కవి, చిత్రకారుడు, శిల్పి, వాస్తునిర్మాత. గయోటోలో ఉన్న ప్రపంచానుభవము లేదు. అచ్చము సాత్త్విక జీవి. ఈయన చిత్రాల్లో గయోటో ఆధ్యాత్మికాంశ మాత్రము ప్రకాశమానమయింది. చిత్రాలు ప్రత్యేకము మతావేశము ప్రధానముగా గంభీరముద్ర వహిస్తూ బిజైంటీను లక్షణాలు చూపించినాయి మళ్ళా.

ఆర్కాగ్నా తరువాత ఫ్లోరెన్సులో ప్రవర్తిల్లిన గొప్ప చిత్రకారుడు ఫ్రాయాంగిలికో. ఈయన భావ చిత్రకారులకోవకు చెందినవాడు. వివిధమైన భౌతిక చ్ఛాయలు లేని ప్రకృతిశోభాసమంచితమైన రమణీయ కల్పన ఆయన చిత్రాల్లోని విశేషము. మనోహరము, స్వాదువు అయిన విషయమే ఆయన స్వీకరించేవాడు. జుగుప్సాకరమైన భూతాలు అసుర ప్రకృతులుకూడా అందంగానూ, అమాయికంగానే చిత్రించేవాడు. ఇది ఆయనలో ఒకలోటే అన్నాడు రస్కిను. కాని అనుకూలనుయిన విషయము చిత్రించినప్పుడు ఆ చిత్రము అతి పవిత్రంగా, ప్రశాంతంగా పసివాని ప్రార్థనవలె అమాయికంగా ఉంటుంది. దూరపు కొండలు, పచ్చిక మైదానాలు, రంగురంగుల పూవులు, పిట్టలు—వికసించిన వేకువ పూవుల్లా ఉంటాయి ఆయన చిత్రాలు. చిత్రంలో భావమార్దవము, సౌకుమార్యము అంటే ఏమిటో తెలియాలంటే ఆయన "ఎనన్సి యేషను" చూడాలి.

ఫ్రాయాంగిలికో తరువాత అనుభూతి ప్రధానమైన భావవ్యక్తీకరణలో ప్రసిద్ధుడైనవాడు ఫ్రాలిప్పో లిప్పి. ఫ్రాయాంగిలికో చిత్రాల్లో ఆత్మోన్నత్యాన్ని అందుకోలేకపోయినా లిప్పో చిత్రాల్లో మానవత, మనోహరత ఉన్నాయి. ఈయన "మెడోనా"లు దివ్యభావ విలసితాలు కాకపోయినా, అతి లోకమయిన స్త్రీ సౌందర్యమంటే ఆయనకున్న పూజ్యభావము వ్యక్తమౌతుంది వాటిల్లో. ఆయనకు పూవు

లన్నా ఇష్టమే. గులాబీలు, కలువలు లిప్పోలా ఎవరు చిత్రించలేదు. ఫ్రాలిప్పో తరువాత బోటిసెల్లి గులాబీలు అంత చక్కగా చిత్రించాడు గాని కలువలు చింత్రించలేకపోయాడు. లిప్పికూడ 'ఎనన్సియేషను' అన్న విషయం చిత్రించాడు. వీ రిద్దరి చిత్రాలతో నే ఆ స్థాయిని అందుకున్న రోజెట్టి "ఎనన్సియేషను" కూడ పోల్చిచూడ తగింది.

ఇక వాస్తవిక దృక్పథంతో గయటో తరువాత చిత్రరచన సాగించింది పావులో అక్సెల్లో, పియరోడెల్లా ఫ్రాంచెస్కా. కళా సంవిధానానికి సంబంధించిన పర్‌స్పెక్టివు మొదలైన అనేక క్లిష్ట సమస్యలు అక్సెల్లో తన చిత్రాల్లో పరిష్కరించాడు. ఆనాడు ఫ్లోరెన్సు గాలిలోకూడ విజ్ఞానవీచికలు తరంగితమయివాయి. గణితశాస్త్రం, శరీరశాస్త్రం మొదలైన అన్ని శాస్త్ర విషయాల్లోనూ నిష్ణాతులైన ప్రజ్ఞానిధులు ఆనాడు ఫ్లోరెన్సు అంతటా ఉన్నారు.

లౌకిక విషయమైన యుద్ధచిత్రం మొట్టమొదట చిత్రించింది అక్సెల్లో. స్వభావ చిత్రణకన్న కళా సంవిధానంలో అక్సెల్లో శాస్త్రీయదృష్టి ఎక్కువ ప్రదర్శించేవాడు. ఆయన గుఱ్ఱాలు సిందూరం రంగులో చిత్రించాడు. గయటో తన చిత్రాల్లో ఊరికే స్పృశించి వదలిన ప్రాదేశిక నిర్మితికి సంబంధించిన సమస్య లెన్నో అక్సెల్లో జయించి సాధించాడు. పూవులు, కాయలుకూడ శాస్త్రసమ్మతమైన వాస్తవికతతో చిత్రించాడు. అక్సెల్లో చిత్రించిన "జాన్ హాక్ వర్డు" అనే సైనికోద్యోగి రూపచిత్రం యూరపు వాస్తవిక కళాపథానికి మొదటి మైలురాయి. ఇక పియరోడెల్లా ఫ్రాంచెస్కా చిత్రాల్లో ఈనాటి క్యూబిజము బీజాలు పుష్కలంగా ఉన్నాయి. మేధస్సు ప్రధానమైన ఆధునిక దృక్పథానికి ఫ్రాంచెస్కా చిత్రాలు చాల సన్నిహితంగా ఉంటాయి.

ఫ్రాయాంగిలికోతో మొగ్గకట్టిన రొమాంటిక్ మిస్టిసిజము ఫ్రాలిప్పోలిప్పిలో ప్రవర్ధమానమై, అతని శిష్యుడు బొటిసెల్లి చిత్రాల్లో తీయని సౌందర్య సీమల్లో తేలియాడి సహస్రదళాలు విరియించింది. బొటిసెల్లి 1447 లో ఫ్లోరెన్సులో పుట్టాడు. మొదట్లో ఒక బంగారు పనివానివద్ద ఆ విద్య నేర్చుకునేందుకు ప్రవేశించాడు. తరువాత చిత్రకళలో మహోన్నతుడైనప్పటికి చివరిదాకా బొటిసెటి రంగుల్లోనే చెక్కడం పనివాడనిపించుకున్నాడు.

భావప్రధానమైన ఫ్రాయాంగిలికో, ఫ్రాలిప్పొ లిప్పి, చిత్రాలకు బోటిసెల్లి చిత్రాలకు ఒక తేడా ఉన్నది. మిగతా అనేక గుణాల్లో సమానత్వం ఉన్నా, ఉత్కటమైన ఆత్మాశ్రయత బోటిసెల్లి చిత్రాల్లో విశిష్టత, బోటిసెల్లి చిత్రించిన దేవుళ్ళు, దేవదూతలు —వాళ్ళ ముఖభావాలు చిత్రకారుని ప్రత్యేక ఊహల్లోవే కాని ఆ దేవదూతలవి, దేవుళ్ళవి కావు. పైగా ఆ మూర్తులు మానవసహజమైన సుఖదుఃఖాలు, ఏ ఆశ, ఆశయాలు లేని ఈ దేవతాత్వము ఎందుకా అని విచారిస్తున్నట్లు కనబడతారు.

బోటిసెల్లి నాటి ఇటలీ, ఫ్రాయాంగిలికో నాటి ఇటలీ కాదు. అందము నేడి మతముచెప్పు చేతల్లో లేదు. చర్చీ, చర్చిగోడలే కళకు ఆలంబనము కాదు ఆ రోజుల్లో. అప్పుడు కళాపోషకులైన కాసిమొ మెడిసి గాని, లోరెంజో గాని చిత్రకారులను మతవిషయాలే చిత్రింలచాని పట్టుపట్టటము లేదు. వాళ్ళకు కావలిసింది అందం. 1467 లో ఫ్రాలిప్పొ ఫ్లోరెన్సువదలి స్పోటిలోలో చిత్రనిర్మాణానికి వెళ్ళిపోయినాక బొటిసెల్లి స్వతంత్రంగా చిత్రకల్పన చేయసాగాడు. అప్పటికి చిత్రించిన "మాగీ ఎడొరేషను" లో కూడ లిప్పో ఛాయలున్నాయి. లిప్పొ వెళ్ళినాక సమకాలికులైన పాలియోలివంటి ప్రముఖ చిత్రకారులతో కలిసి పనిచేశాడు. లిప్పో కన్న పాలియాలికి ఎక్కువ ఎనాటమీ తెలుసు.

దుష్టుడైన హోలిఫెర్నెసు తలనరికి పట్టించుకు వస్తున్న జూడిత్ చిత్రం ఆయన మొదటి ఉత్తమ చిత్రం. హోలిఫెర్నెసును వధించి దేశాన్ని రక్షించింది జూడిత్. ఆ వీరవనిత ముఖభంగిమల్లో కోమలత్వం, ఆవిన కాల శిరఃఖండాన్ని తెస్తున్న పరిచారికలో అంగచాలనం చక్కగా తీర్చిదిద్దాడు బోటిసెల్లి. జూడిత్ ముఖరేఖల్లో తరుచు తన స్టూడియోకు వస్తూండే ఒక ఫ్లోరెంటైను పడుచు పొందికలు

రూపొందించాడు. ఆ వెనుక పారిపోతున్న సైన్యమంతా సహజంగా చిత్రించాడు.

బోటిసెల్లీని పోషించేది లోరెంజో రాజు కాదు. ఆ పేరుగల అతని బంధువు. ఈ లోరెంజోకు సంబంధించిన కాస్టెల్లో విల్లాకే అనేకమైన చిత్రాలు రచించి ఇచ్చాడు బోటిసెల్లి. అందులో చాల ప్రసిద్ధమైనది "వసంతము" ఒకటి. ప్రాకృత శక్తులను మానవ రూపాలతో ఊహించి అంత చక్కగా చిత్రించిన చిత్రం ఇంకొకటి లేదు. చిత్రం మధ్యగా ప్రణయాధిదేవత సవిలాసంగా వసంతాన్ని ఎదురుచూస్తూ నుంచుంటుంది. మన్మథుడు దానిపైన బాణం ఎక్కుపెట్టి ఉంటాడు. కుడివైపున దేవదూత మెర్క్యురి, ముగ్గురు వయ్యారులూ ఉంటారు ఎడమప్రక్క ఋతువుల రాణి, పూల చెలికత్తె—వీళ్ళని చలింపచేస్తూ మలయానిలం, ప్రాకృతిక శక్తులన్నీ మనుష్యాకృతులుకట్టి ఆ శతాబ్దానికి లక్షణమైన సౌందర్య లాలసతలో శృంగార మూర్తులుగా రూపొందిన ఉత్తమోత్తమ జగద్విఖ్యాత చిత్రమది. ఈ చిత్రము, ఇంకా కొన్ని బోటిసెల్లి చిత్రాల తాలూకు ప్రసిద్ధి, రోముదాకా పాకింది. 1481 లో పోప్ సిస్టైన్ చాపెలులో కుడ్య చిత్రాలు నిర్మించడానికి బోటిసెల్లిని ఆహ్వానించాడు. ఇక్కడ రచించిన "మోజెసుగాథ," "జీససు ప్రలోభనము" మొదలైన వాటిల్లో బోటిసెల్లి ప్రజ్ఞసౌందర్య సంవిధాన కౌశల్యాది నైదగ్ధ్యం ప్రస్ఫుటమవుతాయి.

రోములో రెండు సంవత్సరాలుండి మళ్ళా ఫ్లోరెన్సు వచ్చాడు బోటిసెల్లి. ఆ రోజుల్లోనే ఆయన ప్రసిద్ధమైన "మెడోనా" తయారయింది. బోటిసెల్లి మంచి రోజులు చేరువకొచ్చినాయి. రాజైన లోరెంజో చనిపోయిన తరువాత అతని కొడుకు పియరోపాలనలో ఫ్లోరెన్సు అంతా అల్లకల్లోలమయింది. పియరో చాల అసమర్థుడు. ఆ అరాచక పరిస్థితుల్లో బోటిసెల్లి కళాపోషకుడైన లోరెంజో ఫ్లోరెన్సునుండి తరిమివేయబడ్డాడు. ఈ సంక్షోభ సమయంలోనే బోటిసెల్లి. డేంటి కవితలో మునిగిపోయి అద్భుతమైన చిత్రాలు వేశాడు. అవన్నీ వాటికాన్ లైబ్రరీలో, బెర్లిన్ మ్యూజియములో ఉన్నాయి.

ఆ తగాదాల రోజుల్లోనే ఫ్లోరెన్సుకు గిరొలామొ సావనరోలా అనే ప్రఖ్యాత మత బోధకుడు వచ్చాడు. ఆయన ఉపదేశించడము బోటిసెల్లి వినడము. ఇల్లా కొన్నాళ్ళు గడచింది. కాని మతప్రసక్తి లేని తన చిత్రాలు మాత్రం అందరిలాగ బోటిసెల్లి తగలబెట్టలేదు. మతిలేని మూఢజనం సావనరోలాను బ్రతికుండగా తగలబెట్టిచంపారు. దాంతో బోటిసెల్లి చాలా దుఃఖించి, చలించిపోయాడు. ఆ ఆవేగంలోనే "సత్యము—అసత్యము" అనే చిత్రం రచించాడు. వల్లనిముసుగుతో అసత్యము క్రుంగిపోతూంటే సత్యము ప్రకాశిస్తున్నట్లు చిత్రించాడు. చివరి రోజుల్లో వేసిన మతచిత్రాలు చాలభాగం శిష్యులు పూర్తిచేశారు. ఆయన ప్రసిద్ధమైన "క్రీస్తు జననము" నేషనల్ గాలరీలో ఉన్నది.

గయోటో తరువాత అక్సెలో, పియరో డెల్లా ఫ్రాన్సిస్కా వాస్తవిక దృక్పథంతోనూ, ఫ్రాయాంజిలికో, ఫ్రాఫిప్పొలిప్పి, బోటిసెల్లి భావప్రధానంగాను రెండు దారులుత్రొక్కి ఈనాటికీ పాశ్చాత్య కళకు ఆ ఆ మార్గాల్లో ధ్రువతారలైనారు.



# తరంగ సంగీతము



శ్రీ సూరంపూడి భాస్కరరావు

[ఒకానొక వెలనాగ, తరంగ సంగీతము నంత
రంగ సంగీతముతో మేళవించుకొనుచున్నది.]

ఈ నవచైత్రరాత్రి హృదయేశ్వరు డెందులకో ప్రసన్నుడై
గానము సేయలేని చిరుకన్నియ గుండియ సిగ్గునించి, యీ
మౌన నదీతరంగ మణిమాలిక పోలిక మ్రోగ జేసి న
ల్లాను గళఘుళగ్గళలళక్కని మాటలు రాని పాటలన్.

తారక లుజ్జ్వలమ్ములయి తారిన నేటి నిశీథమందు శృం
గారపు తీపి నా హృదయ కందరనాళ మృణాళపంక్తిలో
ఏరులు కట్టిపోవ, హృదయేశుని చక్కిలిగింత లో తులన్
జారు తరంగమాలికల చప్పటులట్లు హసించు నెవ్వరో!

తొలిరే కూటమి దాటలేదుకద, నాథుండింక నాలోన కాం
తులు రేకెత్తగ సేయలేదుకద, శాంతోదార కాంతార ప్రాం
త లతాంతాగమ కాలసీల తటినీతారంగ మన్నట్లు లీ
కలకంఠ స్వనకేళి దేలు పసిరాగాలాపి యెవ్వండొకో?

రాతిరి రాతిరెల్ల మధురమ్ముగ వీణెలమెట్లపైని సం
గీతము లేగిపోయెను వికీర్ణ మనోహర రాగ విశ్రుతిన్ ;
ఈతరి రాగముక్తమయి ఏలనొ కేవలమూట తాళపున్
మ్రోతలు నందెగుమ్మమున మ్రుగ్గులు దిద్దు పడంతియందెలన్.

శ్రావణ మేఘరాశి దిగజార్చిన కుండలనీటిపోతలో
నావలపుంబసిండి వలినవ్వులతే డరుదెంచు బాటలన్
పూవులు నావలై యెదురుపోయెడినో? ఇపుడీ మదశ్రువాః
ప్రావృడ నంతగీతి దిగబ్రాకునో యీ కెరటాలుగా దిశల్.

నీలాకాశ విశాలఫాలతటిపై నేలా మహాకాళిమల్?
ఏలా క్రుంగును తారకావళి భయాదేణీకులమ్మట్లు, నే
డేలా యీ భయపెట్టు కాంతు లుద్యుపీఠిన్ దుఃశ్మశానమ్ముగా,
చాలుంజాలు మహాపగాశ్రుతులు ఝంఝాభీకరార్భాటమై.

# 'సౌందరనంద' సమీక్ష



శ్రీ పి. గణపతిశాస్త్రి

ఇటీవల సౌందరనందకావ్యంమీద చాలా పెద్ద గాలిదుమారం రేగింది. ఈ కావ్యం విమర్శించిన శ్రీ పొట్లపల్లి సీతారామారావుగారు దీనిలో పద్యరచన ఒక్కటీమాత్రం పరమరమణీయంగా ఉన్నదనీ ఇక మిగిలిన అన్నివిషయాలలోను ఈ కావ్యం వట్టి అసంర్భాలపుట్ట అనీ తేల్చివేశారు.

వీరి ప్రతివిమర్శకులు శ్రీ 'సురభి' గారు గొప్ప అభినివేశంతో వీరివాదం విమర్శించి శ్రీ సీతారామారావుగారు వ్రాసిన ప్రతివిషయము దుర్విమర్శనమే అనీ, సౌందరనందంవంటి ఉత్తమకావ్యంమీద ఇలాంటి దుర్విమర్శచెయ్యడం అన్యాయమనీ ఉద్ఘోషించారు. ఆపైన శ్రీ పొట్లపల్లిసీతారామారావుగారికావ్యంమీద, శ్రీ సురభిగారిమీద మరింత తీవ్రమైన విమర్శనాగ్నివర్షం కురిపించారు. వీరిద్దరు వివరించిన ఆయా ప్రత్యేక విషయాలలాగ ఒకపక్కన పెట్టి మొత్తంమీద స్థూల దృష్ట్యా వీరి విమర్శన ప్రతివిమర్శనలు పరిశీలించిన వారికి — శ్రీ సీతారామారావు గారి దృష్టిలో ఇక సౌందరనందంవంటి పాడుకావ్యం లేదనీ, శ్రీ సురభి గారిదృష్టిలో ఇంతటి ఉత్తమ కావ్యం లేదనీ — స్పష్టపడింది.

ఇంతగా ఈ కావ్యాన్నిగురించి వాదప్రతివాద ధూళి రేగినతరవాత సౌందరనందానికీ, విమర్శకుల వాద ప్రతివాదాలకు, న్యాయ్యమైన సాహిత్యవిమర్శకు సంబంధించిన కొన్ని ముఖ్యవిషయాలిక్కడ పేర్కొనడం సముచితమనేదృష్టితో ఆ విషయాలిక్కడ కొంచెం వివరించి వ్రాస్తాను.

సంస్కృతవాఙ్మయంలో సౌందరనంద మనే ఒక కావ్య మున్నప్పుడు ఆ కావ్యానికీ, ఆంధ్రకావ్యానికీ గల స్వరూప స్వభావాలు, లక్ష్యాలు స్పష్టంగా అవగాహన చేసుకోవడం న్యాయ్యం.

## సంస్కృత సౌందరనందం

సంస్కృత సౌందరనందం 18 సర్గల సుదీర్ఘ కావ్యం. ఈ కావ్యం రచించిన అశ్వఘోషుడు బౌద్ధ సంప్రదాయంలో ప్రామాణికాచార్యశ్రేణికి చెందినవాడు. బౌద్ధధర్మోపదేశ ప్రధానమయిన కావ్య రచనమే ఇతని లక్ష్యం. ఈ విషయం ఇతడు కావ్యాంతంలో రచించిన శ్లోకంలో స్పష్టంగా ప్రతిపాదించాడు. ఆ శ్లోకం ఇది:

"ప్రాయేణాలోక్యలోకం విషయరతిపరం
మోక్షాత్ప్రతిహతం
కావ్యవ్యాజేన తత్త్వంకథితమిహ
మయా మోక్షః పరమితి
తద్బుద్ధ్వా శామికం య త్తదవహిత
మితో గ్రాహ్యం నలలితం
పాంసుభ్యో ధాతుజేభ్యో నియత
ముపకరం చామీకరమితి."

సామాన్యంగా లోకం విషయాభినివిష్టమై మోక్షవ్యతిరేకమై ఉన్నదనీ, అందుచేత కావ్యమనే మిషతో మోక్షమేపరమార్థమనేతత్త్వం ఈకావ్యంలో ప్రతిపాదింపబడిందనీ, కనక పాఠకు లీ విషయమే పరమలక్ష్యంగా స్వీకరించాలిగాని ఆనుషంగికంగా వచ్చిన శృంగారాదిప్రసక్తి స్వీకరించకూడదనీ, గనిలో దొరికే ధూళిలోనించి బంగారంపలుకులు స్వీకరించినట్లే ఇందులో సర్వాత్మనా మోక్షతాత్పర్యం స్వీకరించవలసిందనీ అశ్వఘోషు డీశ్లోకంలో ముక్తకంఠంతో ఉద్ఘోషించాడు.

సంస్కృత సౌందరనందంలో చివరి ఏడుసర్గల లోను ఉన్నవిషయంఅంతా కేవలము బౌద్ధధర్మోపదేశ ప్రాయమే. ఇందులో కావ్యానికి సంబంధించిన కథ చాలా స్వల్పం ఈకావ్యం మొదటిసర్గలలో ప్రధాన

విషయంగా కనిపించేది కపిలవస్తునగర వర్ణనం. రెండో దానిలో దానికి ప్రభువైన శుద్ధోదనునివర్ణనము, మూడో దానిలో బుద్ధుని కపిలవస్తు పురప్రవేశము, బుద్ధవర్ణనము ప్రధాన విషయాలు. నాలుగో సర్గలో సుందరీనందుల శృంగార వర్ణనము, బుద్ధుని భిక్షాచరణము, నందుని గృహనిర్గమనము వస్తాయి. ఇక అయిదో సర్గలో బుద్ధుడు నందునిచేత బలాత్కారంగా సన్యాసం స్వీకరింపజేసిన కథ వస్తుంది. ఆరో సర్గలో సుందరి నందుని గూర్చి దుఃఖిస్తుంది. ఏడవసర్గలో నందుడు సుందరిని తలుచుకుని విచారిస్తాడు. ఇలాఉండగా ఒక భిక్షుకుడు వచ్చి నందునికి అనేకవిధాలుగా బోధచేసి స్త్రీవైముఖ్యము, భార్యావైముఖ్యము కలిగించడానికి ప్రయత్నిస్తాడు. ఇది ఎనిమిదో సర్గలోను తొమ్మిదో సర్గలోను నడిచే కథ. భిక్షుకుని ఉపదేశంవల్ల ఏమీ లాభంలేకపోయేసరికి అతడావిషయం బుద్ధునికి నివేదిస్తాడు. అప్పుడు బుద్ధుడు నందుణ్ణి స్వయంగా వెంట తీసుకునివెళ్ళి స్వర్గసౌందర్యము, అప్సరఃసౌందర్యము సందర్శింపజేస్తాడు. దీనితో పదో సర్గ ముగిసి పోతుంది. అక్కడ అప్సరః స్త్రీ సౌందర్యం దర్శించగానే నందునికి వారిమీద వ్యామోహం కలిగి వారి కోసం తపస్సు ప్రారంభిస్తాడు. అప్పుడు బుద్ధుడతనికి 'స్వర్గభోగాలుకూడా నశ్వరములేసుమా' అని చెప్పి అతని మనస్సు మళ్ళింపజేస్తాడు. దీనితో పదకొండో సర్గ ముగిసిపోతుంది.

ఇక మిగిలిన సర్గలలో బుద్ధుడు ఈవిధంగా విరక్తుడైన నందునికి వివిధమైనధర్మోపదేశాలు చేస్తాడు. క్రమంగా ఆయా ఉపదేశాలవల్ల, సాధనలవల్ల నందునికి లక్ష్యసిద్ధి కలుగుతుంది. ఇక చిట్టచివరిసర్గలో నందుడు విముక్తుడై బుద్ధునికి తన కృతజ్ఞత వెల్లడించేసందర్భంలో బుద్ధుడాతనితో 'నీ భార్యకూడా నీవలెనే ధర్మప్రబోధంచేస్తూ కృతార్థురాలగుగాక' అని దీవిస్తాడు. ఈ దీవనతో నందు డక్కడినించి కదిలి భిక్షాజీవియై అర్థులకుధర్మోపదేశం చేస్తూ సంచరించాడని సంస్కృత సౌందరనందం చెబుతున్నది. ఈ ఉదంతంతో మూల కావ్యం సమాప్తమై పోతుంది. సంగ్రహంగా సంస్కృత సౌందరనందంలోని ఇతివృత్తం ఇది.

ఈ ఇతివృత్తంలోని కథాభాగం స్వల్పంగా తీసుకుని ఆంధ్ర సౌందరనందకర్తలు స్వతంత్రంగా తెలుగులో సౌందర నందకావ్యం రచించారు. అంతే గాని మూలానికిది అనువాదంగాని, అనుసరణంగాని కానేకాదు.

అయితే మూలకావ్యానికీ, దీనికీ లక్ష్యాలు వేరు. మూల సంస్కృత కావ్యానికి బౌద్ధ ధర్మోపదేశమే ప్రధానలక్ష్యమని అశ్వఘోషుడే ఉద్ఘోషించాడని వెనకే వ్రాశాను.

తెనుగు సౌందరనందకర్తలీ బౌద్ధధర్మఘోష అంతా విడిచి కథ అంతా తొమ్మిది సర్గలలో కుదించుకున్నారు. మూలం కామప్రవృత్తులయిన సుందరీనందు లిద్దరు క్రమంగాపరిణతులై ధర్మప్రవృత్తులయినారని ప్రతిపాదించింది. తెలుగు సౌందరనంద కర్తలకు కేవలం బౌద్ధధర్మప్రచారం లక్ష్యం కాక పోవడంవల్ల పరస్పర వ్యక్తిగరిమయిన సుందరీనందుల ప్రేమ బౌద్ధధర్మస్వీకరణంద్వారా విస్తృతమై, పునీతమై విశ్వతోముఖమయిన విధం వీరభివర్ణించారు. సూక్ష్మంగా పరిశీలిస్తే సంస్కృత సౌందరనందంలో కూడా జరిగిందింతే. అయితే సంస్కృత సౌందర నందలక్ష్యం వేరు కాబట్టి దానిలో బౌద్ధ సంప్రదాయము, ధర్మాలు బాగా విస్తరించి చాలావరకవే కావ్య శరీరం అంతా ఆక్రమించాయి. తెలుగులో అది లేదు. రెండిటికీ ఉన్న ప్రధాన విభేదం ఇంతే.

ఇక శ్రీ సీతారామారావుగారీ తెనుగుకావ్యంలో ఏదో ప్రేమసిద్ధాంతమనే పెనుప్రళయం వచ్చిపడిందనీ దానితో ఇదంతా చాలా అయోమయంగా తయారయిందనీ వ్రాశారు. అదంతా వారి విమర్శనంలోనే కనిపిస్తున్నదిగాని కావ్యంలోమాత్రం మరి అది ఎక్కడా కనబడడమే లేదు !

## రసనిరోధము

ఈరోజుల్లో అలంకార శాస్త్రం పేరుతోను, రసం పేరుతోను జరుగుతున్న పరాత్మవంచనల కిక అంతూదరీ కనబడడం లేదు. ప్రపంచంలో సువిస్తృత మయిన విమర్శనమార్గా లనేకం బయలుదేరిన ఈ రోజులలో ఇంకా ఈ అలంకారశాస్త్రమార్గం పట్టుకుని ఇక అందులో ఉన్నదే వేదమనీ, తద్విరుద్ధమయినదంతా అపమార్గమనీ వేళ్ళాడడం ఎందుకో తెలియడం లేదు.

ప్రాచీనాలంకారికులు చెప్పిన ప్రధాన రసాదిసిద్ధాంతాలు కొన్ని నేటికికూడా చాలావరకు శిరోధార్యాలుగా ఉంటే ఉండవచ్చును. అయితే ఈ సిద్ధాంతాలలో కొన్ని నేటికాలానికి నప్పవు. ఇవి కాలానుగుణంగా సమన్వయించాలి. ఉదాహరణకు అలంకారికుల రసాభాస నిర్వచనం తీసుకుందాము. ఈ నిర్వచనప్రకారం అనురాగం పరస్పరనిష్ఠం కాక ఏకవ్యక్తినిష్ఠమే అయినప్పుడుగాని, తిర్యగ్జంతుగతంగాను, మ్లేచ్ఛగతంగాను వర్ణింపబడినప్పుడుగాని, స్త్రీకి బహుపురుషాసక్తి కలిగినప్పుడుగాని రసనిష్పత్తి జరగదనీ అక్కడ రసాభాసమే ఏర్పడుతుందనీ తేలుతుంది. ఆశ్లోకం ఇది. "ఏకత్రైవానురాగశ్చేత్, తిర్యక్ మ్లేచ్ఛగతోపివా, యోషితో బహుసక్తిశ్చేత్ రసాభాసస్త్రిధామతః"

అయితే అధునాతన ప్రపంచవాఙ్మయంలో ద్విథాభూతమైన స్త్రీప్రణయము,తత్పరిణామాదులు వర్ణిస్తూ మహోత్తమైన కావ్యాలుగా, నవలలుగా, నాటకాలుగా వెలిసినరచన లెన్నో కనిపిస్తున్నాయి. అలాగే కేవలము ఏకత్రానురాగం సూచించే ఖండకావ్యాది రచనలు కొల్లలుగానే ఉన్నాయి. ఇంక తిర్యగ్జంతుగతమైన అనురాగం అనేకవిధాలుగా మన ప్రాచీన కావ్యాల్లో అక్కడక్కడ ప్రకృతివర్ణనలలో కనిపిస్తూనే ఉన్నది. ఇక ప్రాచీనులకు ఆకాలంలో మ్లేచ్ఛులమీద ఉండే ఈసడింపువల్ల వారి అనురాగం కేవలం రసాభాసంగానే కనిపించింది! ఇది ఆ కాలానుగతమైన తాత్కాలికాభిరుచినిబట్టి వ్రాసిన శ్లోకం. అంతేగాని దీనిలో నిశితమైన విమర్శన సిద్ధాంతం ఏమీలేదు. ఇల్లాగే అలంకారశాస్త్రంలో నేటి కాలాన్నిబట్టి సవరించుకోవలిసిన వెన్నో ఉన్నాయి. ఇక ఇవ్వన్నీ వేదవాక్యాల్లాగ వల్లిస్తూ నేటి కావ్యాలకు సమన్వయించాలంటే ఆ విమర్శన తప్పుదారిని పడితీరుతుంది.

రసవిరోధాన్ని గురించి ధ్వన్యాచార్యుడు మొదలైన ఆలంకారికులు సూత్రప్రాయంగా కొన్ని నిర్వచనాలు చేసి,దిఙ్మాత్రంగా వాటినివారణోపాయాలు సూచించారు. అంతేగాని అవి మక్కికి మక్కిగా అన్ని కావ్యాల్లోను, అన్ని కాలాల్లోను అనుసరించాలని వారెక్కడా చెప్పలేదు. ఒకవేళ అలాగ చెప్పారని అపార్థం చేసుకుంటే—అవి అలాగే అనుసరించేవారు అంధప్రాయంగా నమూనా కావ్యాలుమాత్రమే సృష్టించగలరుగాని స్వతంత్రకావ్యాలు వ్రాయలేరు. అసలు అలంకారశాస్త్రం దిక్సూచకమైన విమర్శనశాస్త్రంగాని వ్యాకరణంలాగ విధినిషేధాలు చెప్పే శాస్త్రం కానేకాదు. ఈ ప్రాచీన శాస్త్రకారులుకొన్ని ఉత్తమమైన కావ్యాలు పరిశీలించి, వాటి లక్షణాలు వివరించి స్థూలంగా ఆ మార్గాలలో రచించినవి ఉత్తమ కావ్యాలు కాగలవని దిఙ్మాత్రంగా ప్రదర్శించారు. అంతే! వాఙ్మయలోకంలో ముందు లక్ష్యం బయలుదేరినతరవాత లక్షణవివేచనం జరుగుతుంది. ఆలక్షణం పట్టుకుని ఇకముందు బయలుదేరిన కావ్యాలన్నీ సరిగా ఆ లక్షణమార్గంలోనే నడవాలని విమర్శించడము కేవలం కావ్యవిమర్శన సంప్రదాయం ఈషణ్మాత్రంగానైనా అవగాహన చేసికోలేనివారు చెప్పేమాట.

శ్రీ సీతారామారావుగారు అలంకార శాస్త్ర ప్రకారం శాంత శృంగారాలకు విరోధమున్నదనీ, ఆ విరోధం ఈ కావ్యకర్త లా శాస్త్రంలో ఆజ్ఞాపించినప్రకారం పరిహరించలేదనీ అంటున్నారు!

సరిగ్గా శాస్త్రప్రకారం చెప్పినట్లే మక్కికి మక్కిగా చేసి ఊరుకుంటే కేవలం కుక్కపిల్లలు పుట్టి ఊరుకుంటాయి! పైగా శాస్త్రంలో చెప్పినట్టే చేస్తే, ఇందులో కేవలం శాస్త్రంలో చెప్పినట్లుంది గాని వీరి కవితలో ప్రతిభో, వ్యుత్పత్తో ఏదో లేదనే ఘాటయిన విమర్శ ఒకటి బయలుదేరుతుంది కూడాను!

ఇది ఇలాగ ఉండనిద్దాము. ఈ ఘట్టంలో శ్రీ సీతారామారావుగారు "అంగరస మంగిరసమును మ్రింగివేయుచున్నది" అన్నారు. ఒకవేళ ఆ అంగరసం అంగిరసాన్ని "మ్రింగివేయుచున్న"దేమో అని కావ్యం పదేపదే పరిశీలించినా, అంగిరసం అలాగ గంగావమ్మలాగ నోరు తెరిచి మింగుతూన్న జాడ ఎక్కడా ఈకావ్యంలో కనబడలేదు! మరి అది ఆవిధంగా వీరికెందుకు కనబడిందో ఆ పరమాత్మునికే తెలియాలి!

ఈ ఘట్టంలోనే వీరు మరిఒకచోట సుందరీనందుల శృంగారం ఉత్తమ ప్రకృత్యుచితంగా లేదని

అన్నారు. దంపతులిద్దరు పగటివేళ సరససల్లాపాది పరిహాసప్రసంగంలోకి దిగినంతమాత్రాన అమాంతంగా అథమప్రకృతులైపోతారా? ఇది చాలా విచిత్రమైన విమర్శనపద్ధతి! ఇలాంటి తాడూ బొంగరమూ లేని దోషారోపణ లీ విమర్శనంలో అడుగడుగునా కనిపిస్తాయి. దీనికి శ్రీ సురభిగారు వ్రాసిన సమాధానమే తగినసమాధాన మనుకుంటాను!

## కథాకల్పనం

అలంకార శాస్త్రప్రకార మేదో ప్రమాదం జరిగిపోయిందని అంటూండడము ఇటీవల కొందరు విమర్శకుల కొక పరిపాటిగా తయారయింది. ఈ జాతి విమర్శకులలో చాలామంది ఆశాస్త్రం తిన్నగా చదవరు. ఒకవేళ చదివినా ఆ శాస్త్రతత్త్వంగాని, దృక్పథంగాని, ఆ శాస్త్ర దృక్పథంలో గల సహజ లోపాలుగాని, పరిమితులుగాని వీరు తిన్నగా అవగాహన చేసుకోరు! ఇక ఏవేవో సంస్కృతోదాహరణాలు దొర్లిస్తూ గడబిడచేసేసరికి ఎలాంటి పాఠకులకయినా కొంత గాభరాకలిగి ఇదేదో గొప్ప విమర్శనమనే భ్రాంతి కలగడం సహజం!

సౌందరనందంలో కథాకల్పనలో బొత్తిగా ఔచిత్యంలేదని శ్రీ సీతారామారావుగారంటున్నారు. పైగా దీనిలో సంధిసంధ్యంగఘటనంలేదని మరిఒక అభాండం వేశారు. మూలంలో గల కథకు, ఆంధ్రసౌందరనందంలో గల కథకు గల విభిన్న లక్ష్యాలు, తారతమ్యాలు ఇదివరకే నిరూపించాను. ఆంధ్రసౌందరనందకర్తలు సంస్కృతకావ్యదృష్ట్యా కేవలం విభిన్నమయినదృష్టితో తమ కథ మలుచుకున్నారు. వీరి లక్ష్యం వేరుకావడమే దీనికి కారణం. ఈ దృష్ట్యా చూస్తే ఈకథ ఇంతకంటె మరొకవిధంగా నడిపించడమే కష్టం. సౌందరనందం మొదటినించి చివరిదాకా చదివినవారికందరికీ ఈ విషయం సుస్పష్టంగానే గోచరిస్తుందని అనుకుంటాను.

ఇక సంధులు సంధ్యంగాలు మొదలయినవాటికి కావ్యంలో అసలు ప్రసక్తే లేదు. ఆలంకారికులు రూపకలక్షణాలు నిర్వచించే సందర్భంలో వీటిని ప్రతిపాదించారు. పైగా ఆనందవర్ధనుడు ఈ సంధి సంధ్యంగాలు కేవలం రసాభివ్యక్తిదృష్ట్యా సమకూర్చుకోవాలిగాని కేవలం శాస్త్రంలో ఉన్నాయిగదా అని అలాగే ప్రవేశపెట్టగూడదని స్పష్టంగా నిర్వచించారు కూడాను.

ఇది ఇలాగుఉండగా శ్రీ సీతారామారావుగారు తమ విమర్శనంలో "పంచసంధి ప్రతిపాదనము శ్రవ్యకావ్యములలోగూడ పాటింపవలయును." అని నిర్వచించారు. ఇది కేవలం పచ్చి బుకాయింపు! అలంకారికు లెవరైనా కావ్యాలలో పంచసంధులు కూర్చవలెనని విధించిన సూత్రం ఏదైనా వీరు పేర్కొనగలరా? పోనీ సుప్రసిద్ధవ్యాఖ్యాతలైన మల్లినాథాదు లెవరైనా కొల్లలుగా ఉన్న తమ కావ్యవ్యాఖ్యానాలలో ఎక్కడైనా కావ్యాలకు పంచ సంధిలక్షణ సమన్వయం చెయ్యడంగాని, ఇది ఆయా కావ్యాలలో సరిగా సమన్వయం కాలేదని విమర్శించడంగాని జరిగిందా? అలాంటి ఉదాహరణ ఏదైనా ఒక్కటైనా వీరు చూపించగలరా?

పోనీ సంస్కృతకావ్యవ్యాఖ్యాతలు కాకపోతే సుప్రసిద్ధమైన తెలుగు ప్రబంధాలకు వ్యాఖ్యానాలు రచించిన ప్రాచీనులుగాని, అధునాతనులుగాని ఎవరైనా తమ వ్యాఖ్యానాలలో మన కావ్యలకు సంధి సంధ్యంగ సమన్వయం చేస్తూ వ్యాఖ్యానాలు రచించారా? అలాంటి సమన్వయం లేకపోయినా, ఆయాసంధ్యంగాలు లేకపోవడంవల్ల ఆయా కావ్యాలలో ఆయాదోషాలు వచ్చాయని ఎక్కడైనా ఎత్తి చూపించారా? ఇలాగ ఎక్కడా లేని అభాండం ఒకటి కొత్తగా కల్పించి సౌందరనందంనెత్తిన పడవేయడం చాలా ఘోరమైన అన్యాయం!

## బౌద్ధ వాతావరణం

సౌందరనందంలో బౌద్ధవాతావరణం బొత్తిగా రాలేదని మరిఒక అభాండం పడింది. ఈ వాతావరణం కల్పించడం చాలా సూక్ష్మమైన విషయం. ఎలాంటి మహాకవులకైనా కావ్యరచనలో ఇది సూక్ష్మమైన వ్యంగ్యధోరణిలోనే సాధ్యపడుతుందిగాని మక్కికి మక్కిగా కావ్యంలో వాతావరణం కల్పించడం మనుష్యమాత్రులకు సాధ్యమయ్యే పనిగాదు. ఒకవేళ ఎవరైనా అలా చేసినా అది చాలా అసందర్భంగా తయారవుతుంది. మన తెలుగు భారతంలో పాత్రలన్నీ

అచ్ఛమయిన తెలుగు పలుకుబడితో సంభాషణలు జరుపుతూంటాయి. అసలు భారతవీరులు అచ్ఛంగా తెలుగు పలుకుబడి ప్రకారం మాట్లాడి ఉండరు కనక ఆవిధంగా దీనిలో మూల భారత వాతావరణమే రాలేదంటే మన భారతకవిత్వమంతా ఒక దెబ్బతో ఎగిరిపోతుంది! శ్రీ సీతారామారావుగారి వాతావరణ విమర్శనం ఇంచుమించుగా ఇలాంటి పద్ధతిలోనే నడిచింది.

సంస్కృత సౌందరనందకర్తకు కేవలం ధర్మోపదేశమే ప్రధానలక్ష్యం కాబట్టి అతడు శ్రీ సీతారామారావుగారు పేర్కొన్న బౌద్ధ సిద్ధాంతాలు మొదలైన తతంగం అంతా అందులో ప్రవేశపెట్టుకోవడం సహజమే కావచ్చును. అంతేగాని బౌద్ధధర్మంతో అంతగా ప్రమేయం లేని సౌందరనందానికీ ఘోష అంతా ఎందుకో తెలియడం లేదు. సూక్ష్మంగా సౌందరనందకర్తలు కల్పించిన బౌద్ధ వాతావరణం వారి అభ్యాసానుగుణంగా సముచితంగానే కనిపిస్తున్నది గాని శ్రీ సీతారామారావుగారూహించినంత విడ్డూరమేమీ ఇందులో కనబడడంలేదు.

## బలాత్కార సన్యాసం

సౌందరనందంలో నందునికి బలాత్కార సన్యాసం ఇప్పించడం ఏమీ బాగాలేదని ఒక విమర్శ వచ్చింది. అయితే బౌద్ధ సంప్రదాయాభిజ్ఞుడయిన అశ్వఘోషాచార్యుడే తన కావ్యంలో ఈ పద్ధతి ప్రవేశపెట్టాడు. దీనికి ప్రత్యేకంగా ఒక శ్లోకం వ్రాసుకుని అశ్వఘోషుడు సమర్థించుకున్నాడనీ, అల్లాగ ప్రత్యేకంగా తెలుగు కావ్యంలో ఒక పద్యం వ్రాయకపోవడంవల్ల ఏదో మహాపచారం జరిగిపోయిందనీ శ్రీ సీతారామారావుగారు విమర్శించారు. తెలుగులో కవులీ విషయం వ్యంగ్యంగా సర్వజ్ఞుడయిన బుద్ధుని సంకల్పబలానికే విడిచిపెట్టారనుకుంటే ఈ దోషం తొలగిపోతూనే ఉంది. అశ్వఘోషుడు తన రచనలో అది అతివాచ్యంగా ఉద్ఘాటిస్తే తెలుగుకవులీ విషయం వ్యంగ్యంగా సూచించడంవల్ల-న్యాయ్యంగా వీరు మూలానికే మెరుగుపెట్టారని అనాలి. అదిలేదు సరిగదా! ఇది ఒక పెద్దదోషంగా ఎత్తిచూపడం చూస్తే మొత్తంమీద ఈ విమర్శ అంతా కేవలం తప్పులెత్తి చూపడానికే వ్రాసిందా అనే గట్టి అనుమానం కలుగుతున్నది.

## శబ్దదోషాలు

ఈ కావ్యంలో శబ్దదోషాలు కొన్ని దొర్లాయని శ్రీ సీతారామారావుగారు చాలా తీవ్రంగా విమర్శించారు. ఈ శబ్దదోషాలు, వ్యాకరణ దోషాలు విమర్శించే అధికారం గల వ్యక్తులు ఆంధ్రదేశంలో చాలా అరుదుగా ఉన్నారు. ఇక తెలుగు వ్యాకరణాలు చూద్దామా అంటే ఇవి ఇంకా స్థిరమైన నడవడి సంపాదించలేదు. ఏవో తప్పులు పట్టుకోవాలని గట్టిగా ప్రయత్నిస్తే ఆ విధంగా ఒకటో, అరో తప్పులు పడని ఆధునిక కావ్యాలు మృగ్యాలే. సుప్రసిద్ధులయిన వెనకటి తరం కవులలోను, నేటి కవులలోను గిడుగు రామమూర్తి పంతులు వేలకొలది తప్పులు చూపించడం మొదలుపెట్టేసరికి కవులనేకులు కిక్కురుమనకుండా మాట్లాడ కూరున్నారు! రామమూర్తి పంతులు విమర్శవల్ల మొట్టమొదటగా ఆంధ్ర విద్వజ్జనానికి మన తెలుగు వ్యాకరణాల లోపాలు, వీటిని నమ్ముకుని తప్పులుపట్టే వారి లోపాలు తెలిసి వచ్చాయి. నేనీ వాక్యాలు సౌందరనంద కర్తలొక్కరినీ ప్రత్యేకంగా సమర్థించడానికి వ్రాసిన వాక్యాలు కావు.

సౌందరనందంలోకూడా పట్టుకుందామని ప్రయత్నిస్తే ఎక్కడైనా ఒకటీ, అర శబ్దదోషం దొరక వచ్చునేమో! నేనా దృష్టితో ఎప్పుడు ఈ కావ్యం చదివి ఉండకపోవడంవల్ల నా కది స్ఫురించలేదు. నిజంగా శబ్దదోషాలున్న కావ్యమేదీ కావ్యగౌరవం అందుకోలేదు. ఈ దోషాలున్నప్పుడు తప్పకుండా వీటి విషయం వేలెత్తిచూపించి ఖండించవలసిందే! అందులో సందేహం ఏమీ లేదు.

అయితే శ్రీ సీతారామారావుగారు పట్టుకున్న 'ప్రాథమిక' శబ్దము 'విశేషక' శబ్దము అపశబ్దాలు కానేకావు.

"పుష్పబాణాగమాధ్యేతృ ప్రాథమికుండవై" అనే పద్యపాదంలో ప్రాథమికుడవై అనేది తప్పనీ ప్రథముడవై అనే ఉండాలనీ శ్రీ సీతారామారావుగారన్నారు. దానిమీద శ్రీ సురభిగారు ఈ శబ్దం అపశబ్దం కాదని సోపపత్తికంగా నిరూపించారు. దాని మీద శ్రీ సీతారామారావుగారిది రూఢ్యర్థం కాదని బుకాయించారు!

ఆప్తనిఘంటువువంటి ప్రామాణిక నిఘంటువులో ఈ శబ్దం ఈ అర్థంతో కనిపిస్తున్నది. ప్రామాణికమైన ఆప్తనిఘంటువులో ప్రవేశించినప్పుడది రూఢ్యర్థం కాకపోవడ మెల్లాగ! ఊరికే బుకాయించిన మాత్రాన నిఘంటువులో కెక్కిన రూఢార్థం కూడా ఎగిరిపోతుందా?

ఇక విశేషక శబ్దం మాట. ఈ శబ్దానికి మకరికాపత్రమనే అర్థంకూడా ఉన్నదని ఆప్తనిఘంటువులో సోదాహరణంగా, స్పష్టంగా వ్రాసిఉంది. ఈ విషయం శ్రీ సురభిగారు కూడా వ్రాశారు. శ్రీ సీతారామారావుగారు తమ కీ పదానికి భిన్నగా అర్థం తెలియనపుడు ఒకసారి నిఘంటువు తేసిచూసిన పాపాన్నైనా పోలేదు. పైగా పాపం అన్యాయంగా అశ్వఘోషుణ్ణికూడా దులిపేశారు!

ఈ మాత్రం ప్రాథమికమైన సంస్కృతాంధ్ర శబ్దజ్ఞానంలేని ప్రభువులుకొందరు ఆధునిక కావ్యవిమర్శకు పూనుకోవడము, గుణాగుణ నిర్ణేతలు కావడము ఈదేశంలో జరిగే విచిత్రాల్లో ఒక విచిత్రం! వీరింతటితో ఊరుకోరు. ఏదో పాదక్రమమనీ, అర్థక్రమమనీ హంగామా చేసి, మధ్యమధ్య అర్థ కుసిగా చదువుకున్న అలంకార శాస్త్రశ్లోకా లుదాహరిస్తూ పాఠకులను హడలగొట్టేస్తూ ఉంటారు.

అసలు ఈ శబ్దాలంకార దోషాలు చాలామందిలో ఉంటున్నాయనీ ఇది అంతగా లోతుగా వెదకవక్కరలేదనీ శ్రీ సీతారామారావుగారే అన్నారు కాబట్టి ఈ విషయం ఇంతటితో విడిచిపెట్టేస్తాను.

అసలు గట్టిచిక్కు ఇంకొకటిఉంది. సామాన్యంగా నవలలు, నాటకాలు, కథలు విమర్శించడం దారివేరు. కావ్యవిమర్శన దారి వేరు. దీనికి నైశిత్యము, పాండిత్యము, సహృదయ దృష్టి, తారతమ్యపరిజ్ఞానము మొదలైనవి ఇంకా ఎక్కువగా ఉండాలి.

కవిత్వం అనేక మార్గాలలో అనేకమైన అంతరాలలో నడుస్తూంటుంది. కొందరు లలితాక్షర విన్యాసం చేస్తారు. మరికొందరు కొంచెం కఠినపద బంధంతోను, సుదీర్ఘ సమాస విన్యాసాలతోను, దూరాన్వయాలతోను కావ్యరచన చేస్తూంటారు. ఒక్కొక్క కవి ప్రతిభా సంపత్తినిబట్టి కావ్య రచన ఎప్పుడూ ఒక నూతన మార్గాన్ని పట్టి పోతూంటుంది. అయితే లలిత పద విన్యాసమార్గం ఒక్కటే కవితామార్గమని గాని, లేక కఠినపద బంధమార్గమే సర్వోత్తమమని గాని నిర్ణయించడానికి వీల్లేదు.

ఆ పైని కవుల జీవితాదర్శ వైవిధ్యాన్నిబట్టి కూడా అనేక విధాలయిన కవితా మార్గా లేర్పడుతూంటాయి. అయితే సామాన్యంగా స్థూలవిమర్శకులకు ఏదో ఒకే ఆదర్శము, ఒకేరకమైన మార్గంలో నడిచే కవిత్వము మాత్రం నచ్చుతాయి. మిగిలిన ఆదర్శాలు గాని, కవితామార్గాలు గాని వీరికి తెలియవు. పోనీ తెలుసుకుందామని కొంచెమైనా ప్రయత్నంకూడా చెయ్యరు. తమకున్న సంకుచితాభిరుచినిబట్టి ఇక మిగిలిన మార్గాలలో నడిచిన కావ్యాలన్నీ కావ్యాలే కావని — అసలు వాటి జోలికైనా పోకుండా — ముందుగానే ఒక నిర్ణయానికి వచ్చేస్తారు. ఆపైన అవిధమైన కావ్యాలు చదవడం ప్రారంభించేసరికి వారికి అందులో అన్నీ అసందర్భాలే గోచరిస్తూంటాయి. మొత్తంమీద కావ్యధోరణిమీద వైముఖ్యం కలిగినప్పు

డిక అందులో దోషాలు కుప్పతిప్పలుగా కనబడడంలో ఆశ్చర్యం ఏమి ఉంది?

విమర్శనకు పూనుకునే ముందు ప్రతీ విమర్శకుడు తన అభిరుచి పరిమితి, తానవలంబించే విమర్శమార్గంలో గల అవధులు, గుణదోషాలు అవగాహన చేసుకుని మరీ విమర్శనకు దిగాలి. ఆధునిక యుగంలో ఇది మరీ అవసరం. లేకపోతే ఆత్మవంచన, ఆపైని పరవంచన కలిసి వెరసి ఉభయవంచనలుగా పరిణమిస్తాయి!

సౌందరనంద విమర్శనలోనే కాక శ్రీ సీతారామారావుగారి విమర్శన లన్నింటిలోను ఈ లోపం గట్టిగా కనిపిస్తోంది.

అలంకారశాస్త్రం పేరెత్తి ఆపైని అస్పష్టంగా రసవిరోధమో ఏదో వచ్చిపడిందని చెప్పి శబ్దార్థాలంకారాల గుణదోషాలు పట్టుకోవడమే విమర్శనమనే అభిప్రాయం ఒకటి నేటికాలంలో ఏర్పడినట్లుంది. విమర్శనకూడా కావ్యరచనలాగ సృజనాత్మకమైనదిగా ఉండాలి. అస్పష్టమైన ప్రాచీనాలంకార శాస్త్రమార్గమే కాకుండా ఏదైనా ఒకమార్గం ఏర్పరుచుకుని, ఆ మార్గానికి అవధులుకూడా ముందే నిర్ణయించుకుని విమర్శనచేసి పాఠకులలో నూతనమైన కావ్యదృష్టీ, అభిరుచీ కలిగించవచ్చును. ఏ విమర్శనమైనా పాఠకలోకంచేత తల లూపించగలిగినప్పుడే దానికి సార్థకత ఏర్పడుతుంది. అంతేగాక, కేవలం అహంభావ పూరితములైన శుష్కవాదోపవాదాలలో కావ్యరహస్యం ఎన్నటికీ బయలుపడదు.

## పాఠక్రమం—అర్థక్రమం.

శ్రీ సీతారామారావుగారు కేవలం శుష్కతార్కిక దృష్టితోనే సౌందరనందంలోని పద్యాలు అవగాహన చేసుకున్నారు. అంతేగాని కావ్యపరిశీలనలో సముచితమైన స్వాదుభావయిత్రీ దృష్టి వీరి కలవడలేదు.

ఈ కేవల తార్కికదృష్టితో వీరు, సామాన్యంగా సహృదయదృష్టితో చూసినప్పుడు సులభంగా అవగాహన అయ్యే స్థలాల్లోకూడా ఏదో దోషం వచ్చిపడిందని ఎత్తిచూపించారు. ఈ శీర్షికలో వీరెత్తిచూపించిన దోషాల కన్నింటికీ శ్రీ సురభిగారు చాలా సముచితమైన సమాధానాలిచ్చారు. అయితే ఈ విషయంలో వీరిద్దరి వాదోపవాదాలు పరిశీలిస్తే — కేవలం తప్పులు పట్టుకోవాలనే అభినివేశంతో శ్రీ సీతారామారావుగారు ప్రయత్నించినట్లు కనబడిపోతున్నది. శ్రీ సురభిగారికి శ్రీ సీతారామారావుగారన్న దోషాలన్నీ గుణాలుగా నిరూపించాలని ప్రయత్నించినట్లు కనిపిస్తున్నది.

నిజానికి శ్రీ సీతారామారావుగారు చూపించిన ఒకటి రెండు దోషాలు దోషాలుగా అంగీకరించడమే న్యాయ్యమనుకుంటాను. ఉదాహరణకు వీరు వ్రాసిన 'సంసరణ మహోబ్ధిమగ్న మగు మానవకోటిపయిన్ కృపాఝురుల్' అన్నచోట కృపాఝురుల్ అనే రూపకం సరిగా లేదనడమే న్యాయ్యం.

'భవనిదాఘ సంతాపముల్ పరిహరించు
సత్యశాంతి దయాది నిర్ఝరులు పొడము
నీ విహార మహోహార్యమెక్కి యిటుల
కంట నీర్వెట్ట దగదు నీవంటి వాడు'

అన్న పద్యంలో మాత్రం 'కంట నీర్వెట్టదగదు నీవంటివాడు' అన్నదానికి కేవలం వాచ్యార్థం తీసుకోకుండా 'దుఃఖించ కూడదు' అనే అర్థం తీసుకుంటే ఇందులో వచ్చే పెద్ద విడ్డూరమేమీ లేదు. ఒకవేళ వాచ్యంగా తీసుకున్నా అంత వైగుణ్య మేమీ కనబడదు.

ఈ విషయంలో శ్రీ సురభిగారు వ్రాసిన సమర్థన సరిగానే ఉన్నది. ఇలాంటి స్వల్పవిషయాలలో ఈ విమర్శకు లిద్దరు అవలంబించిన వైఖరి ప్రదర్శించడానికే నేనీ ఉదాహరణ లిచ్చాను. నిజానికి శ్రీ సురభిగారు సౌందరనందంమీద ఉండే ఆప్యాయతవల్ల చిన్న చిన్న స్వల్ప లోపాలుకూడా అధిగమించి ఈ కావ్యం ఆస్వాదించగలిగారని తోస్తున్నది. సీతారామారావుగారు తా మవలంబించిన వైఖరినిబట్టి సామాన్య సహృదయుల దృష్టితోనైనా ఈ కావ్యం అవగాహన చేసుకోలేకపోయారని స్పష్టపడుతున్నది.

శ్రీ సీతారామారావుగారు చూపించిన మిగిలిన అలంకార దోషాలు, ఔచిత్య దోషాలు ఈ వైఖరితో చేసినవే. శ్రీ సురభిగారు వీరు చూపించిన వాటి కన్నిటికి సముచితమైన సమాధానా లిచ్చారు. అందుచేత నేనా ప్రమేయం విడిచిపెట్టివేస్తున్నాను. వాఙ్మ

యంలో కావ్యం అంతరువు నిర్ణయించబలసినప్పు డీ విధమైన విమర్శవల్ల ప్రయోజన మేమీ లేదు.

కేవల యథార్థ ప్రదర్శనదృష్టితో చేసిన ఈ విమర్శ అంతా విమర్శకులు సహృదయదృష్టితో అవగాహన చేసుకోగలరని ఆశిస్తున్నాను.

ఎంత తీసివేసినా సౌందరనందం అధునాతన కథాకావ్యాలలో ఒక అత్యుత్తమ కావ్యమని విజ్ఞులైన విమర్శకులందరు అంగీకరిస్తారని అనుకుంటాను. ఈ కావ్యంలో అత్యాశ్చర్యకరమైన గుణా లనేకం ఉన్నాయి. ఇది రచించిన కవులిద్దరు. అయినా దీనిలో 'ఇది ఒక్కరే రాశారా!' అన్నంత సంశ్లిష్టత ఏర్పడింది. వృత్తరచనలో ఒక విచిత్రమైన ప్రాచీనాధునాతన శైలీ సమన్వయం కనిపిస్తుంది. ఇది ఇంత స్వాదువుగా మరి ఏ ఇత రాధునాతన కావ్యంలోను జరగలేదు.

వీరు ఎత్తుకున్న కథ, తన్నిర్వహణము అధునాతన జీవితానికి సంబంధించినవి. అందుచేతనే దీనికొక వ్యంగ్యపూర్వకమైన అధునాతన జీవిత సమన్వయం ఏర్పడ్డది. ఒక ప్రాచీన కథ అవలంబించి దానికొక వినూతన వ్యాఖ్యానం కల్పించడంలో నైరుప్య మేమీ లేదు. వ్యాసుని శాకుంతలోపాఖ్యానం తీసుకుని కాళిదాసొక నూతన దృక్పథంతో రూపకం రచించుకున్నాడు. మన వాఙ్మయాల్లో ఇలాంటి ఉదాహరణా లెన్నైనా ఇవ్వవచ్చును. రచనలోను, రస నిర్వహణంలోను, కథలోను, ఈ కావ్యం నూతనమైన మార్గం అవలంబించినా, జాతీయమైన సాంప్రదాయికత చెడకుండా సంరక్షించుకుంటూ నవ్యతకు, సాంప్రదాయితకు ఒక మనోహరమైన అర్ధనారీశ్వర మూర్తిగా వెలిసింది!

ఇలాగ ఈ కావ్యగుణా లేకరువు పెట్టడంకంటె 'అద్యతనాంధ్ర కవిత్వ నిర్మాత లైన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి వంటి విద్వత్కవులు చేసిన ప్రశస్తి ఒక్కటే ఇక్కడ ఉదాహరిస్తే చాలుననుకుంటాను. ఇది చెళ్ళపిళ్ళకవి సౌందరనంద కృతి స్వీకరణసందర్భంలో వచించిన కృతిస్వీకారంలోని పద్యము.

'కృతికిన్ మీగురు వేమొసంగె' నని
　మిమ్మెవ్వరేని ప్రశ్నింప 'స
త్కృతి మా కిట్టు లొసంగె మాగురు'
　వటం చీ పద్యమున్ చూపుఁ, ష
త్ప్రతిమ ప్రజ్ఞలు సత్కవీశ్వరులు
　'విద్వాంస్తుష్ట' యన్ వాక్యమున్
సత్కృతి కెక్కించుక మిమ్ము మెత్తురిగ కష్టిన్
　మీ పున్ని కగ్గించుచున్.

# గ్రంథవిమర్శనము

## కాటమరాజు కథ

కర్త: గంగుల పినవెల్లయ, సంపాదకులు: కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి. ప్రకాశకులు గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ. మద్రాసు. వెల: అయిదురూపాయలు.

ఈ గ్రంథం పరిష్కరించి ముద్రించడానికి సిద్ధంగా తయారుచేసినవారు కీర్తిశేషులు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. అయితే గ్రంథముద్రణం కాకుండానే వారు దివంగతు లయినందువల్ల ప్రాచ్య తాళపత్ర గంథాలయంవారీ భారం శ్రీ మల్లపల్లి సోమశేఖర శర్మగారికి అప్పగించారు. వారీ గ్రంథానికొక విస్తృత పీఠిక రచించారు.

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారీగ్రంథ పీఠికలో గ్రంథకాల నిర్ణయాన్ని గురించి విపులంగా చర్చించి, ఈ నిర్ణయంలో బయలుదేరే క్లిష్టసమస్యలన్నీ విపులంగా విస్తరించి వ్రాశారు.

పీఠికా కర్తలు పీఠికలో సూచించినట్లే గ్రంథ క్రీస్తుశకం 17వ శతాబ్ది అంతిమ భాగంలో వ్రాసినదని నిశ్చయించవచ్చును. కథా రచయిత కథనడిచిన కాలానికి చాలా అర్వాచీనుడై ఉండడంవల్ల పల్లవ వంశరాజుల కీకథ అంటగట్టినట్టు కనిపిస్తుంది. ప్రసిద్ధుడైన తిక్కన నెల్లూరి చోళుల సేనానాయకుడు. అయితే పల్లవ వంశంలోను చోళవంశంలోను, కూడా నల్ల సిద్ధినాయకు లుండడంవల్ల ఈ సమస్య మరీ క్లిష్టమయి పోయింది.

పోనీ గ్రంథంలో ఇచ్చిన యుద్ధకాలాన్నిబట్టి ఈ యుద్ధకాలం నిర్ణయిద్దామా అంటే అదీ ఒక పెద్ద చిక్కుగానే తయారైంది. మొత్తంమీద యుద్ధకాలానికీ, నల్లసిద్ధికీ, ఖడ్గతిక్కనకు సరియైన చారిత్రక సమన్వయం కుదరకపోవడంవల్ల పీఠికా కర్తలు సూచించినట్టిది ప్రస్తుతానికొక చారిత్రకసమస్యగానే విడిచివెయ్యడం న్యాయ్యం.

పీఠికా కర్తలు ప్రస్తుతానికి లభించిన చారిత్రక విషయాలనుబట్టి ఏర్పడుతున్న సమస్యలన్నీ పాఠకుల యెదుటపెట్టి ఆ సమస్యల స్వరూప స్వభావాలు చక్కగా విశదపరిచారు. నిజానికి అస్పష్టంగా తెలిసిన విషయాలనుబట్టి ఏవేవో అభూత కల్పనలతో కూడిన నిర్ణయాలు చెయ్యడంకంటె శాస్త్రీయ దృక్పథంతో ఉన్న సమస్య లున్నట్టుగానే విమర్శించడం న్యాయ్యం. శ్రీశర్మగా రవలంబించిన సూదృక్పథం వాఙ్మయ చరిత్ర విమర్శకుల ందరికీ శిరోధార్యమైనది.

ఈ గ్రంథరచనమంతా మంజరీ ద్విపదలో నడిచింది. అయితే పామరజనుల నోళ్ళలోపడి కొంత వరకిది స్వస్వరూపం కోలుపోయింది. అనేక పాదాలలో ఛందస్సు సరిగా ఉండకపోవడానికిదే కారణం. అల్లాగే గేయభాషలో కూడా ఎన్నో వ్యావహారిక భాషా పదాలు, ఆ పదాల వ్యావహారికోచ్చారణలు దొర్లాయి.

కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారీ పదాలన్నీ యథామూలంగానే ఉంచివేయడంవల్ల ఆనాటి జానపదగేయ స్వరూప స్వభావాలు చక్కగా అవగాహన చేసుకోడానికి వీలుకలిగింది.

ఈ గ్రంథానికి పాఠాంతర స్వరూపంలోఉన్న భట్టు రాయబారము, కోటపాటి తాటివృక్షము తెచ్చే కథ, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట అనే మూడు అనుబంధాలు చేర్చడంవల్ల దీనికొక చక్కని పరిపూర్ణత వచ్చింది.

ఇది మన జానపదగేయ వాఙ్మయంలో ప్రముఖంగా పేర్కొనదగిన గ్రంథం. ఆనాటి భాషా స్వభావావగాహనకే గాక అనాడు ప్రచారంలోఉన్న

కొన్ని సాంఘికాచారాలు తెలుసుకోడానికి కూడా ఇది చాలా సహాయకారిగా గలదు.

కాటమరాజు కథలోని ఈ క్రింది ఉదాహరణ ననుబట్టి ఈ గ్రంథశైలి గ్రహించవచ్చును. ఇది బీరన్న యుద్ధానికిపోతూ మనస్సుకు ధైర్యం చెప్పుకునే ఘట్టం.

'యముని సన్నిధికి జీవాత్మ! యేగకుమి!
పరమాత్మలో నైక్య పడవలె మనస!
వీరుల బోడగని విరుగకే మనస!
మేరువుకంటెను మింతువు గాని
పగతుర బోడగని పారకు! మనస!
తెగువతో కోపంబు దీర్తువు గాని
యెదరకే యెూ గుండె యాయుధము జూచి!
యుక్కు గుండై పగర మడిగింతు గాని
చెదరకే యెూ మనస! పెల్లు ప్రోతలకు
ప్రోతలకు నెదురెక్కి ప్రోగవలె గాని
పారలకే యెూ ప్రాణి! పోర్బలము నూచి
జడియక కల్లుగా జంపుదు గాని
పగర గని యెూ కత్తి పదను దీయకుమి
మదగజంబుల బరిమార్తువు గాని!'

సంపాదకు లీ గ్రంథంలో కాటమరాజు కథాభాగా లభివర్ణించే ప్రాచీనచిత్రాలు కొన్ని చేర్చి గ్రంథం సర్వాంగసుందరంగా ముద్రించారు. జానపద ద్విపద వాఙ్మయాభిమానులందరికీ ఇది అవశ్యపఠనీయమైన గ్రంథం.

---

## గాలిమేడలు

[రూపకం]

అనిశెట్టి సుబ్బారావు, ప్రకాశకులు దేశికవితా మండలి, విజయవాడ 2. వెల: రూపాయి పావలా.

ఈ నాటకరచన ఒక కొత్త పంథా అవలంబించింది. దీనిలో పాత్రలు, ప్రేక్షకులు ఒకరొకరితో సంభాషించుకుంటారు. దీనివల్ల రూపక శిల్పంలో వచ్చిన పెద్ద మార్పేమీ లేదుగాని ఒకరిద్దరు ప్రేక్షకులు కూడా పాత్రలుగా మారిపోయేసరికి తటాలున ఆ ప్రత్యేక ఘట్టంలో ఒక కొత్త దృశ్యం ఏర్పడుతుంది. ఇలాంటి పద్ధతి ఒకటిరెండు పాశ్చాత్య రూపకాల్లో ఇంతకు పూర్వమే ప్రవేశపెట్టారు. ఇది ఈ రూపకంతో కొత్తగా తెలుగు నాటకరంగంలో ప్రవేశించినదని చెప్పవచ్చును.

నిరాశాపూరితమైన మాణిక్యాలరావనే బాంకు గుమాస్తా జీవితంతో ఈ రూపకం ప్రారంభిస్తుంది. తరవాత మూడు అంకాలలో అతడు తాను పనిచేసే బాంకులోనించి ధనం అపహరించి భాగ్యభోగాలతో తులతూగే జీవితం అనుభవిస్తున్నట్లు కలగంటూంటాడు. అలా గనుభవిస్తూన్నట్లు అతనికి అనేకమైన భీభత్స దృశ్యాలుకూడా కనబడుతూంటాయి. నాటకం చివర మళ్ళీ మాణిక్యాలరావు వాస్తవ జీవితానికి సంబంధించిన ఒక దృశ్యం వస్తుంది. దానితో రూపకం ముగిసిపోతుంది.

ఫ్రాయిడ్ ప్రతిపాదించిన అవ్యక్త మనస్సిద్ధాంతం ఆధారంగా తీసుకుని శ్రీ సుబ్బారావుగా రీరూపకం రచించారని విమర్శకు లొకరు వ్రాశారు. రచయిత దీనిలో మధ్యతరగతి జనం అనుభవించే యాతనలు,

వారి అంతర్మనః ప్రవృత్తులు, వాస్తవిక జీవితానికీ మానసిక జీవితానికీ మధ్య కలిగే సంఘర్షణలు విస్పష్టంగా చిత్రించారు. నిజానికి దీనిలో ఫ్రాయిడ్ సిద్ధాంతమేదో ఉన్నదనసంకంటె, స్వప్నజీవితానికీ, వాస్తవిక జీవితానికీ గల వైరుధ్య ప్రదర్శనమే దీని ప్రధానలక్ష్యమనీ అంత లోతుగా ఫ్రాయిడ్ సిద్ధాంతమేదీ దీనిలో లేదనీ చెప్పడం న్యాయ్యం.

ఏదైనా కేవలం సిద్ధాంతాల ప్రదర్శనం ఈ రూపకలక్ష్యం కానేకాదు. మన సమాజంలో కలిగే వివిధమైన సంఘ విద్రోహశక్తుల కన్నిటికీ అన్యాయ్యమైన నేటి మన సాంఘికవ్యవస్థే కారణమని ఈ రూపకం సూక్ష్మంగా ధ్వనిస్తున్నది.

రచయిత తలపెట్టిన ఈ లక్ష్యం ఈ నాటకం వల్ల స్పష్టంగా స్ఫురిస్తున్నది.

దీనిలో పాత్రల కంతగా సజీవత రాలేదుగాని మొత్తంమీద రూపక లక్ష్యసిద్ధికి కావలసినంత కదలిక మాత్రం వీటిలో కనిపిస్తున్నది.

సంభాషణలు, రంగ విభజనం, కథాగమనం మొదలైనవి రచయిత రూపక నిర్మాణశక్తికి తార్కాణాలుగా ఉన్నాయి.

ఆధునికాంధ్ర రంగాభిమానులందరు ఇది తప్పక పరిశీలించవలసిన రూపకం.

---

## వత్సరాజు

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ. ప్రతులకు: కవితాసమితి. విశాఖపట్టణము. వెల: రూపాయి పావలా.

ఇది భాసుడు రచించిన ప్రతిజ్ఞా యౌగంధరాయణ నాటకానికి స్వేచ్ఛానువాదమని కవయిత్రి పీఠికలో తెలియజేస్తున్నారు. కనకనే వీరు దీనికి ప్రత్యేకంగా వత్సరాజని పేరు పెట్టారని తోస్తున్నది.

దీనికి వత్సరాజని వేసే నామకరణం చెయ్యడానికి కావలసినంత స్వకపోల కల్పన గాని, లేక ప్రతిజ్ఞా యౌగంధరాయణమని అనడానికి కావలసిన యథామూలత గాని రాలేదు. అనువాదం యథామూలంగా చేసినప్పుడది తెలుగు పాఠకులకు మూల రచయిత శక్తి ప్రస్ఫుటం చేస్తుంది. కేవలం మూలం అలంబనంగా తీసుకుని రచించిన స్వీయ రచనగాని రచయిత శక్తి వెల్లడిస్తుంది. అందుచేత అనువాదకులీ రెండుమార్గాల్లోను ఏదో ఒక మార్గం అవలంబించడం సుకరము.

రచయిత్రి సంస్కృతే నాటకంలోని వచనాలకు, కొన్ని కొన్ని శ్లోకాలకు చక్కని అనువాదాలు రచించారు. ఈ క్రింది వృత్తాలు వీరి రచనాశైలికి తగిన ఉదాహరణాలు. ఇది ఈ నాటకంలో ద్వితీయాంకంలో మహాసేనుణ్ణి వర్ణించే పద్యం

"నీలతృణాంకుర స్థిమిత
 నీలమణీ రమణీయ రోచికా
జాలము, పీవరోన్నత
 భుజద్వయ హేమమయాంగ దమ్ములన్
గ్రాలగ వచ్చు నిద్దె
 ఘనకాంచన తాళవనమ్మునుండియు
ద్వేల్లత శెల్లునుండి
 చనుదెంచు పఢానను మాడ్కిని త్తరిన్."

యౌగంధరాయణుని యుద్ధోదగ్రత వర్ణించే ఈ క్రింది పద్యం వీరి సమాస పటిష్ఠమైన శైలికి తార్కాణంగా తీసుకో వచ్చును.

"సాదుల సైంధవమ్ములను
 సామజకోటుల మావటీల యో
ధాదుల జంపి భీకర సహస్ర
 శతాధిక సేన జొచ్చి, తా
నాది గరీంద్రదంత ముసలాహత
 భగ్న భుజచ్యుతాస్త్రుడై
పాదము దీయకేను
 పరిపంథులమీద కుదగ్ర వృత్తిమై."

---

## మదాలసీయము

[రూపకము]

త్రిపాఠి వెంకటశాస్త్రి. ప్రతులకు: మేనేజరు రాజర్షీంద్ర వైద్యాలయము, లింగాలవలస. కొత్తపల్లి బ్రాంచి పోస్టు. వయా టెక్కలి. శ్రీకాకుళంజిల్లా. వెల తెలియదు.

ఇది మార్కండేయ పురాణ ప్రసిద్ధమయిన ఋతధ్వజుని ఉపాఖ్యానం తీసుకుని వ్రాసిన నాటకం.

రచయిత దీనిలో తెనుగు నాటకాల్లో లేని కొత్త పద్ధతి ఒకటి ప్రవేశపెట్టి, నాంది అంతా సంస్కృత భాషలో రచించారు. ఇది కేవలం పాండిత్య ప్రకటనకే ఉపయోగిస్తుంది. ప్రేక్షకులకు గాని, పాఠకులకు దీనివల్ల కలిగే ఉపయోగం మృగ్యం.

ఈ నాటకంలోని సంభాషణలు సలక్షణమైన గ్రాంథిక భాషలో నడుస్తున్నాయి. అయితే ఇవి చాలాచోట్ల సుదీర్ఘంగా ఉండడంవల్ల రూపక గమనం వీటివల్ల కుంటుపడిపోతున్నది.

మొత్తంమీద ఈ నాటకానికి ప్రదర్శనయోగ్యమైన రూపకానికి కావలసిన గుణాలు తక్కువగా ఉన్నాయి.

రూపకంలో చాలాచోట్ల వాడిన పద్యాలు మాత్రం చక్కని సాంప్రదాయిక శైలిలో నడిచిపోతూ, వీరి సాంప్రదాయిక కవిత్వ శక్తికీ, పాండిత్యానికీ తార్కాణాలుగా ఉన్నాయి. ఈ క్రింది సీసపద్యం వీరి, పద్యరచనాశక్తికి తార్కాణంగా తీసుకోవచ్చును. ఇది ద్వితీయాంకంలో మదాలసా వర్ణన పరమైన సీసము.

"ఆజాను దీర్ఘమై యంజనస్నిగ్ధమై
యలరారునల శిరోజాళితోడ,
దరహాసయుక్తమై తారాధిపాభమై
కర మొప్పుచున్న ముఖంబుతోడ
శ్రీఫలతుల్యమై చిత్తజావాసమై
యొప్పుచుండిన కుచయుగముతోడ
గాంచీకలాపమై ఘనమార్గనిభమునై
తనరారునట్టి మధ్యంబుతోడ
భామినీ రత్నమీయన పరిఢవిల్లె
కాకతాళీయముగ నాడు కంటబడిన
ఈ సరోజాక్షి నిటవీడి యెట్టులేను
చనగజాలుదు నరయగా సర్వవిధుల."

---

## నవ్వని పువ్వు

సి. నారాయణరెడ్డి. ప్రకాశకులు రాజశ్రీ సాహిత్య కళాపీఠము. జనరల్ బజారు. సికింద్రాబాదు. వెల 10 అణాలు.

ఇది నవ్వనిపువ్వు, వలపురేడు, దగ్ధశాంతి, భిన్నస్వరాలు అనే నాలుగు గేయనాటికల సంపుటి.

కేవలం గేయనాటికలు వ్రాసేవారీ రోజుల్లో చాలా స్వల్పంగా ఉన్నారు. పెద్దలలో శ్రీ శివశంకర శాస్త్రిగారీ విధమైన గేయనాటికారచనకు ఒరవడి పెట్టారు.

శ్రీ సి. నారాయణరెడ్డిగారు వ్రాసిన నాటికలన్నీ ఎక్కువగా రేడియో ప్రసారం మనస్సులో పెట్టుకొని వ్రాసినట్టు కనిపిస్తున్నాయి.

వీటిలో నవ్వనిపువ్వులోను, వలపురేడులోను వ్రాసిన గేయాలు మిగిలిన రెండు నాటికలలోను రచించిన గేయాలకన్న బాగున్నాయి. వలపురేడులోని ఈ క్రింది గేయాన్నిబట్టి వీరి గేయవైఖరి గ్రహించుకోవచ్చును.

"దినరాజు పశ్చిమ
మ్మున సొమ్మసిలిపోయె
దిశలన్ని నాదూపు
కోసల బందీలాయె
మృదుల వాయుపథాల
కదలిపోయే వేళ
నానిశానాథుండు
రాని కారణమేమొ!"

---

## గ్రంథ స్వీకృతి

### జీవవికాసం

వేమరాజు భానుమూర్తి. ప్రకాశకులు, సంస్కృతి నికేతనము. హైదరాబాద్. వెల ఒక రూపాయి.

శ్రీ వేమరాజు భానుమూర్తిగారి చిన్న పుస్తకంలో జీవవికాసం, సృష్టిక్రమం, తంద్రుల [illegible] ప్రణయం పరివారం, బ్రతుకు తెరువు, పునస్సృష్టి అ[illegible] శీర్షికలకింద జీవశాస్త్రానికి సంబంధించిన విషయాలన్నీ అందరికీ అర్థమయ్యే తేట తెలుగు శైలిలో వివరించారు. పుస్తకం రేఖాచిత్రాది విశేషాలతో ఆకర్షణీయంగా ఉన్నది.

---

### రైలు కథ

శ్రీ వేమరాజు భానుమూర్తి. ప్రతులకు: జాతీయ విజ్ఞానమందిరము. రాయపేట, మదరాసు.

శ్రీ భానుమూర్తిగారిందులో రైళ్ళను గురించిన వివరాలన్నీ సంగ్రహంగా ఇచ్చారు.

ఇందులో ఇచ్చిన ఆంధ్రదేశపు రైలుమార్గాల పటం పాఠకులకు బాగా ఉపయోగకారి కాగలదు.

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.